సాహిత్య

# ప్రస్థానం

మార్చి 2012

వెల రూ. 10

**నేటి సాహిత్యరంగం తీరు తెన్నులు**

ఆసక్తికరమైన చర్చ

పేజీలు 27-35



సాహితీ స్రవంతి



BULLET MARKS

జనరల్ డయ్యర్ కాల్పులకు సాక్ష్యంగా నిలిచిన బుల్లెట్‌లు దిగిన జలియన్‌వాలాబాగ్‌లో గోడ.

ఇన్‌సెట్‌లో కాల్పులకు చెల్లాచెదురై ఆత్మాహుతి చేసుకున్న అమరవీరుల బావి

ఫొటోలు: మురళి యం. నల్లారెడ్డి

PRSVI402A135

సాహిత్య ప్రస్థానం

సంపుటి : 11 మార్చి 2012 సంచిక : 74

# బడ్జెట్‌లో భాషా సంస్కృతుల వాటా!

రాష్ట్రప్రభుత్వం ఈ సంవత్సరం లక్షా నలభై ఐదువేల కోట్ల బడ్జెట్‌ను ఆర్భాటంగా ప్రవేశపెట్టింది. ఇంత భారీ బడ్జెట్‌లోనూ భాషా సంస్కృతుల అభివృద్ధికి వాటా చూస్తే మనసు చివుక్కు మంటుంది. భాషాభివృద్ధికి కేవలం మూడుకోట్లు కేటాయించడం విస్మయ పరుస్తుంది. ఇటీవల భాషా చైతన్యం పెరిగిందని హడావుడి జరుగుతున్నది. ప్రాచీన లేదా విశిష్ట భాషా హోదాను అష్టకష్టాలు పడి సాధించుకున్నాం. కాని మనవంతు పాత్ర ఏమిటన్నది ప్రశ్న. ప్రస్తుత బడ్జెట్‌లో తెలుగు ఈ రంగాల కేటాయింపులు చూస్తే ఆ ప్రభావం ఏమీ కనిపించదు. తెలుగు సంస్కృతీ పరిరక్షణ పట్ల ప్రభుత్వాలకు ఏమాత్రం ఆసక్తి లేదనడానికి ఈ ధోరణి ఒక నిదర్శనం. ప్రాచీన హోదా, ఆధునిక ప్రతిపత్తి ఏది సార్థకం చేసుకోవాలన్నా సర్వతోముఖ కృషి అవసరం. ప్రాచీన హోదా కోటాలో వందకోట్లు వచ్చాయా? వస్తే ఎలా ఖర్చు చేస్తున్నారు? స్పష్టత, పారదర్శకత నాస్తి. ప్రపంచీకరణ దాడిలో విష సంస్కృతి విజృంభణను నిలువరించే ఆరోగ్యకర విలువలను కాపాడుకోవడం ఇప్పుడు చాలా అవసరం. అందుకే తెలుగు భాష వ్యాప్తికి, పరిపాలనలో సమర్థవంతంగా తెలుగు అమలుకు పటిష్ట చర్యలు చేపట్టాలి. ప్రాచీన భాష ఖాతాలో వచ్చే నిధులతో ప్రయోజకరమైన కార్యక్రమాలతో ప్రణాళిక రూపొందించాలి. తెలుగు అకాడమీ, తెలుగు విశ్వవిద్యాలయం, అలాగే వివిధ విశ్వవిద్యాలయాల తెలుగు విభాగాల మధ్య సమన్వయం వంటి అంశాలపై చర్చలు జరగాలి. పాఠశాలల్లో ముఖ్యంగా ఇంగ్లీషు మీడియం పాఠశాలల్లో తెలుగు భాషాబోధన తప్పని సరి చేయాలి. మంచి పుస్తకాల ప్రచురణకు చేయూతనివ్వాలి. గ్రంథాలయాలకు నిధులు పెంచాలి. భాషాభివృద్ధి, సాంస్కృతిక విభాగం కేటాయింపు ఇందుకు ఏమాత్రం సరిపోవు. అలాగే తెలుగులో వివిధ ప్రక్రియల్లో వస్తున్న మంచి సాహిత్యాన్ని ఇతర భాషల్లోకి, ముఖ్యంగా ఇంగ్లీషులోకి అనువదించేందుకు విస్తృత స్థాయిలో ప్రాజెక్టులు రూపొందించాలి. ఆ దిశగా తెలుగు భాషాభిమానులు, సాహిత్యవేత్తలు ఒత్తిడి తీసుకురావాలి.

......

ఈ నెల ప్రస్థానంలో సాహిత్యరంగం తీరుతెన్నులపై పలువురు పంపించిన అభిప్రాయాలను ప్రచురించాం. రెండు నెలలుగా ఈ సంపాదకీయంలో చేసిన విజ్ఞప్తికి స్పందించిన వారికి ధన్యవాదాలు. రాబోయే సంచికలలో కూడా ఈ శీర్షిక కొనసాగుతుంది. అర్థవంతమైన ఇలాటి చర్చ ఎప్పుడూ ఆహ్వానించదగిందే.

బొమ్మలు : చంద్ర, శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 040-27660013, 9490099059
ఫ్యాక్స్, 04027635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# ఒయాసిస్సులు

- డా॥ శాంతి నారాయణ



**ప్రతి దినం మాదిరిగానే నేను గ్రౌండ్లోకి అడుగుపెట్టే సరికి పొద్దు పొడుస్తూ వుంది. ఆదివారం కావడం వల్లనేమో, వాకింగ్ చేసే రకరకాల వయసు వాళ్ళతో క్రికెట్ ఆడుకునే పిల్లలతో రన్నింగ్ చేసే యువకులతో గ్రౌండంతా కళకళలాడుతూ వుంది.**

నేను వాకింగ్ మొదలుపెట్టిన కాసేపటికే మిత్రులందరూ వచ్చి కలుసుకున్నారు. అందరమూ కలిసి వాకింగ్ చేస్తూ ఎన్నో అంశాలపైన చర్చించుకుంటూ వాకింగ్ శ్రమను మరిచిపోతుంటాం మేము. మా చర్చల్లో వార్డు రాజకీయాల నుంచీ దేశ రాజకీయాల వరకూ ఎన్నో విషయాలు చోటు చేసుకుంటూ వుంటాయి.

ఆ రోజు మేమింకా బరువైన సామాజిక విషయాల జోలికి పోకముందే చదువుకునే పుత్రరత్నాల గొంతెమ్మ కోరికలూ మధ్యతరగతి తల్లిదండ్రుల అవస్థలూ చర్చకు వచ్చాయి. ఇంటర్ మీడియట్ చదువుతున్న తన కొడుకు కనీసం మోపెడ్ అయినా లేకుండా కాలేజీకి వెళ్ళనని మొండికేసుకున్నాడని బాధపడుతూ చెప్పాడు గంగన్న. అది విన్న మిత్రులు మౌనంగా వుండలేకపోయారు.

'ఈ కాలం పిల్లల కోరికలు హద్దు మీరిపోతున్నాయర్రా!'

'వాళ్ళ కోరికల కంటే మన ప్రేమలు మితిమీరి పోతున్నాయి బ్రదర్!'

'మరి యేం చేస్తాం బ్రదర్స్ తప్పడం లేదు. కాదుగీదని కోపంగా దండిస్తామనుకో, పిల్లలు చాలా సూక్ష్మంగా తయారయిపోతున్నారప్పా! వొకటి పోయి ఇంకొకటి అయితే ఇంకేమయినా వుందా? ఏదో ముందు చూపుతో వొకరిద్దరు పిల్లలతోనే చాలించుకున్నాక ఇప్పుడు వాళ్ళను కంటికి రెప్పలాగా చూసుకోక తప్పదు గదా!'

అందుకే మరి, వాళ్ళు ఆడినట్లల్లా ఆడుతున్నాం బ్రదర్! వొకవేళ మగవాళ్ళం మనం కొంచెం కఠినంగా వుందామనుకున్నా ఇంట్లో హోమ్‌డిపార్ట్‌మెంట్ ద్వారా రెకమెండేషన్స్! వాటిని కాదనడానికి మనకు సాధ్యమవుతుందా?'

'కరెక్టే, కన్న పిల్లలు మాటి మాటికీ గోముగా ప్రాధేయపడితే 'ఏ తల్లి మనసయినా కరిగిపోవడం, సహజమే కదా! పిల్లల కోరికలకు మమకారంతో తల్లి మద్దత్తు పలికినప్పుడు ఏ తండ్రి అయినా యేమనుకుంటాడు, ఈ సంపాదనంతా పిల్లల కోసమే కదా, పోనీలే అనుకుంటాడు'

'అనుకొని వాళ్ళు 'ఏదడిగినా దాన్ని అందించడానికి సిద్ధపడుతున్నామర్రా. కొమ్మమీదుండే కోతిని తెచ్చివ్వాలన్నా, సాధ్యాసాధ్యాలు గమనించకుండా తెచ్చివ్వడానికి ప్రయత్నిస్తున్నాం'.

'వాళ్ళ అవసరాల్ని తీర్చడం వరకయితే బాగుందండీ! కానీ వాళ్ళకిచ్చే డబ్బులూ, అందించే సదుపాయాలూ సద్వినియోగం అవుతున్నాయా లేదా అని గమనించవలసిన బాధ్యత తల్లిదండ్రులకు లేకపోతే యెలాగ? 'ఏమడిగితే అవి తీసిచ్చి డబ్బున్న తండ్రులు

చేతులు దులుపుకోవడంతో ఈ మధ్యకాలంలో యెన్ని దారుణాలు జరిగిపోయాయో మన కందరికీ తెలుసుగదండీ! నిన్న కోమటిరెడ్డి వెంకటరెడ్డి కొడుకు, మొన్న క్రికెటర్ అజారుద్దీన్ కొడుకు, అంతకు ముందు సినీయాక్టర్స్ కోటా శ్రీనివాస్, బాబూమోహన్ కొడుకులు 'ఏమయిపోయిరి? పెద్దవాళ్ళ పిల్లలు కాబట్టి వాళ్ళ ఆగడాలూ, జరిగిన దారుణాలూ మన దృష్టికొచ్చాయి. దృష్టికి రానివెన్ని? ఎంతమంది యువకులు మదమెక్కిన చేష్టలతో వాళ్ళు నాశనమయిపోతూ ఇతరులకు హాని కలిగిస్తూ సమాజాన్ని ఇబ్బంది పెడుతూ కని పెంచి పెద్దజేసి ఎన్నో ఆశలు పెట్టుకున్న తల్లిదండ్రుల్ని యెంత వేదనకు గురి చేస్తున్నారు? దీనికంతటికీ కారణం, బాధ్యతాయుతమయిన జీవన విధానాన్ని పిల్లలకు నేర్పకపోవడమేనండీ!'

మౌనంగా మిత్రుల వెంట నడుస్తూ వాళ్ళ సంభాషణ వింటున్న నాకు క్రమంగా గుండె బరువైపోసాగింది. మా సుపుత్రుడు కూడా మోటర్ బైక్ లేకుండా యూనివర్సిటీకి వెళ్ళనని నిన్న రాత్రి చేసిన గొడవంతా గుర్తుకొచ్చి మనస్సు చివుక్కుమనసాగింది. పెదవులు బిగుసుకోసాగాయి.



వాకింగ్ మిత్రులలో నేనూ, గంగన్నా చాలా కింది స్థాయి నుంచి స్వయంకృషితో పైకొచ్చాం. నేనొక హెడ్మాష్టర్‌గా, ఆయనొక లాయర్‌గా టౌన్లో ఒక సముచితమయిన స్థాయికి చేరుకొని సమాజంలో చాలామంది కంటే ఎన్నోరెట్లు బాగున్నాం. మేం బాగున్నామంటే మా సాంఘిక జీవన స్థితిని మా పిల్లలు కూడా అనుభవిస్తున్నట్లే కదా! దానితో మా పిల్లలెందుకు తృప్తి పొందడం లేదో అర్థం కాక కాసేపు మా పూర్వాపరాలను నేను గంగన్నా చర్చించుకున్నాం. అంతలోనే ఎవరో పెళ్లి ప్రస్తావన చేశారు. పెళ్లి మాట వినపడగానే గంగన్న తటాలున ఆగి 'ఔను రమేష్, ఈ రోజే కదా మన రంగనాథరెడ్డి కొడుకు స్టాలిన్ బాబుది పెళ్లి!' అని గుర్తు చేశాడు.

'ఔను, ఈ రోజే. మధ్యాహ్నం ఒంటిగంటకు మరచి పోయావా గంగన్నా?' అంటూ నేను పెళ్ళి సమయాన్ని సూచించాను. మా మాటలు విని మా పక్కన నడుస్తున్న శ్రీనివాసులు 'ఈ రోజు పెళ్లేమిటప్పా? అమావాస్యకదా! అందులోనూ ఆదివారం అమావాస్య. అటువంటి ఈ రోజు మిట్ట మధ్యాహ్నం పెళ్లా? పైగా తండ్రి రంగనాథరెడ్డి, కొడుకు స్టాలిన్ బాబు అంటున్నారు. అదేదో మతాంతర వివాహమా రమేష్?' అని ఆశ్చర్యంగా అడిగాడు.

రంగనాథరెడ్డి మాకు మంచి మిత్రుడని, అతడెవరో కాదు తరిమెల నాగిరెడ్డికి బంధువని మాటల్లో కాకుండా చేతల్లో ఆదర్శాలున్న వ్యక్తి అని రంగనాథరెడ్డిని గురించి చెప్పాను. శ్రీనివాసులు కాసేపు మౌనం వహించి, 'లవ్ మ్యారేజేమప్పా?' అని ఆసక్తిగా అడిగారు.

'లవ్ మ్యారేజ్ అయినా తప్పేముంది శీనూ? అయినా నువ్వనుకున్నట్లు అది లవ్ మ్యారేజేమీ కాదుగానీ, ఆ అబ్బాయిని గురించి తెలిస్తే నువ్వు ఆశ్చర్యపోతావ్. అమెరికాలో సీనియర్ సాఫ్ట్‌వేర్ ఇంజనీరింగ్‌గా స్థిరపడి అందరిలాగా ఇంజనీర్నో, డాక్టర్నో తన లైఫ్ పార్టనర్‌గా కోరకుండా మామూలు డిగ్రీ చదివిన అమ్మాయి అయితే చాలని ఈ కాలంలో అనుకోవడం చిన్న విషయం కాదు. పైగా కట్నం తీసుకోకూడదని, సోషియల్ మ్యారేజ్ మాత్రమే తనకిష్టమని తన ఇష్టాన్ని ప్రేమతో అంగీకరించాలని తల్లిదండ్రుల్ని కోరాడు. అమ్మాయి ఏ కులస్తురాలయినా పర్వాలేదని తన పెళ్లి, తెలిసిన బంధుమిత్రులందరూ వచ్చేందుకు అనుకూలమయిన అష్టమినాడో, అమావాస్యనాడో జరగడం బాగుంటుందని ప్రత్యేకంగా కోరుకున్నాడు. మరి దీన్ని యే పెళ్లి అని అనుకుందాము శీనూ'? అంటూ నేను అతని వైపు చూశాను.

'చాలా గొప్ప విషయమేనప్పా!' అంటూ శీనూ మౌనం వహించాడు. పక్కనున్న సుధాకర్, రమణారెడ్డి మాత్రం పెదవి విరుస్తూ యేదో గొణిగారు. వాళ్ల గొణుగుడును విన్న తర్వాత నేను మౌనంగా వుండలేకపోయాను.

'మనం ఆదర్శాలు రోజూ వల్లిస్తామర్రా! అయితే దేన్నీ ఆచరించలేం. ఏది మంచిదని అనుకుంటున్నామో దాన్ని ఆచరించేవాళ్లను అభినందించే పెద్ద మనసయినా మనకు లేకపోతే యెలాగ? మనమే ఎన్నోసార్లు మాటల సందర్భాల్లో, ఈ వివాహ పద్ధతులు మారాలని, భారతీయ సమాజాన్ని కులాల పేరుతో విడదీసి తమ పబ్బం గడుపుకుంటూ మొత్తం వ్యవస్థను బ్రాహ్మణ భావజాలం భ్రష్టు పట్టించిందని అనుకున్నాం. దేనికీ లొంగని కాలాన్ని శుభలగ్నం, దుర్ముహూర్తం అనే అర్థ రహితమయిన దృష్టితో చూడడం, కూర్చో డానికీ లేయడానికీ కూడా రాహుకాలాన్నీ, శుభగడియల్నీ లెక్కించడం వంటి చాదస్తాలు ఇంకా పెరిగిపోతున్నాయని, చివరికి మనిషి తన శ్రమశక్తిమీద కంటే కాలానికి సంబంధం లేనివాటిమీదా స్వప్రయోజనం కోసం ఎవరో కల్పించిన శుభాశుభ గడియలమీదనే విశ్వాసం పెంచుకుంటున్నాడని విచారించాం. శుభ ముహూర్తంలో ప్రారంభమయిన పనులన్నీ సఫలమయినట్లు దుర్ముహూర్తంతో ప్రారంభమయిన కాలాలన్నీ విఫలమయినట్లు దాఖలాలేవీ లేవని, ఒక పని సఫలమో విఫలమో అయిన తర్వాతనే దానికి అనుకూలంగా తిథీ నక్షత్రాలను లెక్కగట్టి చూపిస్తారని, శుభ ముహూర్తం దుర్ముహూర్తం వంటి విషయాలు కేవలం మనిషి విశ్వాసం వల్లనే కొనసాగుతూ వుండడం దురదృష్టకరమని బాధపడ్డాం. అటువంటి మనమే, ఈనాటి యువతకూ చాలామంది తల్లిదండ్రులకూ స్ఫూర్తిదాయకంగా జరుగుతున్న రంగనాథరెడ్డి కొడుకు పెళ్ళి పట్ల పెదవి విరిస్తే ఇంకెవరు ఆదర్శవంతమయిన విషయాలను అభినందిస్తారు. మంచిని మంచి అని చెడును చెడు అని మనం గుర్తించి గౌరవించినప్పుడు ఇక మంచిచెడ్డలను గురించి రోజూ మనమెందుకు చర్చించుకోవాలప్పా?' అని కొంచెం గట్టిగానే అన్నాను. దాంతో అందరూ నిజమేనన్నట్లు తలలూపుతూ మౌనం వహించారు. ఆ తర్వాత పది నిముషాలకు వాకింగ్ ముగించుకొని ఎవరిళ్ళకు వాళ్ళం వెళ్ళిపోయాం.

నేను ఇల్లు చేరుకునేటప్పటికి బీయస్సీ చదివే చిన్న కొడుకు ట్యూషన్‌కేమో బయలుదేరినట్లుంది. కాంపౌండు లోపలున్న కొళాయి గుంతలో నుండి మంచినీళ్ల బిందెను మోయలేక తెస్తూ వుంది కమల. చూస్తూ భరించలేక వెంటనే ఆ బిందెను భుజమ్మీదికి ఎత్తుకొని, 'నువ్వు నీళ్ళు తెస్తూవుంటే వాడికి కనిపించలేదంటనా? కళ్ళకు ఏమి అడ్డం పడిందంట?' అని కోప్పడుతూ వంటగదిలో బిందె దించి హాల్లోకి వొస్తూ బెడ్‌రూంలోకి తొంగి చూశాను. పెద్ద సుపుత్రుడింకా గురకబెట్టి నిద్రబోతున్నాడు. చూడగానే కోపం నషాళానికి అంటింది. గట్టిగా అరుస్తూ కోపంగా దండించాను. వాడు సీరియస్‌గా లేచి నా వైపు రుస రుసమని చూస్తూ యేదో గొణుగుతూ బాత్‌రూమ్ వైపు వెళ్ళాడు. వాని వాలకం చూసి మరింత రెచ్చిపోయాను. కమల నన్ను ఓదార్చడానికి ప్రయత్నించింది. బాధవల్ల నన్ను నేను కంట్రోల్ చేసుకోలేక కాసేపు కొడుకుల నడతల్ని యేకరువు పెడుతూ గట్టిగా నోరు చేశాను. వాడు బాత్‌రూమ్ నుంచీ బెడ్‌రూములో కెళ్ళి డ్రెస్ వేసుకొని సంస్కారహీనంగా మాట్లాడుకుంటూ కోపంగా బయటికి బయలుదేరాడు.

'యాటికి పోతాండావప్పా, కాఫీ గుడకా తాక్కుండా?' అంటూ అడ్డం వెళ్ళిన వాళ్ళమ్మను పక్కకు తోసి మరీ వెళ్ళాడు వాడు. కమల కన్నీళ్లు నింపుకొని వంటగదిలోకి వెళ్లింది.



సుపుత్రుడు ఇంట్లో నుంచీ కోపంగా సంస్కారహీనంగా మాట్లాడుతూ బయటికెళ్లి పోయినందుకు కాదు గానీ నిన్న రాత్రి వాడు మాట్లాడిన మాటలు గుర్తుకొచ్చి బాధతో గుండె బరువయింది. గట్టిగా నిట్టూరుస్తూ వరండాలో ఈజీ ఛెయిర్లో కూర్చొని వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాను. అణువణువులోనూ యేదో చెప్పరాని వెత మెదలసాగింది.

యూనివర్శిటీకి ఇంటి ముందు నుంచే అరగంటకొక బస్సు వెళుతుంది. హాయిగా నిశ్చింతగా బస్సులో కూర్చొని వెళ్ళొచ్చు గదా! ఊహూ! మోటార్ సైకిల్ లేకుండా యూనివర్శిటీకి వెళితే చాలా ఇన్సల్టింగ్‌గా వుంటుందట! ఇది బాగుపడే లక్షణమేనా? చదువుల విషయంలో ఇతరులతో కంపారిజన్ చేయకూడదట! మరి ఎంజాయ్‌మెంట్ విషయంలో మాత్రం ఇతరులతో పోలికెందుకో? అభివృద్ధి విషయంలో ఏ దేశమైనా, సమాజమైనా కంపారిజన్ చేసుకుంటూ తనవైపు చూసుకున్నప్పుడే డెవలప్ అవుతుంది. మనిషీ అంతేకదా!

ఇంట్లో వేల పుస్తకాలతో లైబ్రరీ యేర్పాటు చేసుకొని నిరంతరమూ చదువుతూ రాస్తూ వుంటాను. గొప్పగా చదువుకున్న మిత్రులే ఇంటికొస్తూ వుంటారు. ఇల్లొక చర్చావేదికగా మారుతూ వుంటుంది. ఎన్నో సాహిత్య సామాజికాంశాలు చర్చింపబడుతూ వుంటాయి. అవేవీ వీళ్లమీద ప్రభావం చూపడం లేదా? ఇంటికంటే సమాజ ప్రభావమే బలమైందా? ఎంతో మంది గొప్ప వ్యక్తుల మీద తల్లిదండ్రుల ప్రభావముందని అనుకోవడం సత్యం కాదా? గ్లోబలైజేషన్ ప్రభావంతో పెట్రేగి మనిషిని ఊపిరి సలపనీయని మార్కెట్ రంగ వికృత రూపాయలను మనిషి ఇంత పిచ్చిగా అభిమానించాలా? తనను తాను అర్థం చేసుకోగలిగిన జ్ఞానమున్న మనిషి తనను వక్రమార్గంలో నడిపే శక్తుల్ని అడ్డగించలేడా? తమకు అవసరమయిన సమయంలో లేని ఎన్నో సదుపాయాలను తమ పిల్లలకు సమకూర్చినా వాటిని పిల్లలెందుకు సద్వినియోగం చేసుకోవడం లేదు?

తండ్రిగా పిల్లల కోసం ఎంతో చేశాను. పెద్దగా చదువుకోలేక పోయినా తల్లిగా తానూ తన బాధ్యతను నిర్వర్తించింది. ఇద్దరమూ ప్రతి చిన్న విషయంలోనూ చాలా కేర్ తీసుకున్నాం. మంచి టీచర్స్ చేత ట్యూషన్స్ చెప్పించి మంచి స్కూళ్లలో కాలేజీల్లోనే చదివించాం. ఉపాధ్యాయునిగా పిల్లల సైకాలజీ తెలిసిన వానిగా వాళ్ళకు కావలసినంత స్వేచ్ఛనిచ్చాను. ఖర్చుకు భయపడకుండా దర్శనీయ స్థలాలెన్నో చూపించాను. పిక్నిక్‌లకు తీసుకెళ్ళాను. అవసరమనుకున్న వాటన్నిటినీ సమకూర్చాను. అయినా చదువు విషయంలో ప్రతి దశలోనూ అసంతృప్తే మిగిలింది. కన్న మమకారంతో తల్లి ఆరాటపడుతూ వుంటే మనసును చంపుకొని అడగరాని వాళ్లందర్నీ అడిగి ఇంటర్లో, డిగ్రీలో ప్రాక్టికల్స్ మార్కులు ఎక్కువ వచ్చేలాగా చూశాను. చివరికి ఆ మార్కుల వల్లనే సుపుత్రులు గట్టెక్కడం ఎంత దౌర్భాగ్యమనుకోవాలి! పొరపాటు ఎక్కడ జరిగింది? పుట్టుకతోనే వీళ్ళు బౌద్ధికంగా బలహీనులా? అయితే ఎవరికయినా సాధనే ముఖ్యం కదా! ఏ అంశమయినా సాధనతోనే కదా సత్ఫలితం పొందేది! పిల్లల్ని ఎందుకు నా మార్గంలోకి తెచ్చుకోలేకపోయాను?

నా ప్రశ్నలకు నేనే జవాబుదారిగా మారిపోయేటప్పటికి ఒక్కసారిగా కడుపులో దేవినట్లయింది. వెంటనే కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. వాటిని తుడుచుకుంటుండగనే కమల కాఫీ తీసుకొని వచ్చి నా ముఖం వైపు చూస్తూ, 'ఎందుకండి బాధపడతారు? మన తలరాత అంటూ ఆ తర్వాత మాట్లాడలేక కొంగు నోటి కడ్డం పెట్టుకొని పొంగి వొస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ కాఫీ ఇచ్చి లోనికెళ్లిపోయింది.

.. .. ..

మధ్యాహ్నం ఒంటిగంటకు ఇద్దరమూ స్టాలిన్ బాబు పెళ్లికెళ్లి వచ్చాం. ఆ పెళ్లిని చూసి కమల ఎంత మోజు పడిందో యేమో, ఇంట్లోకి అడుగు పెట్టగానే 'మనమూ మన పిల్లలకు ఆ మాదిరిగా పెళ్ళిండ్లు చేస్తే బాగుంటుందండీ' అని తన మనసును వ్యక్తం చేసింది.

'అది మనమొక్కరమే అనుకుంటే అవుతుందా కమలా? మన పిల్లలు అంత మానసిక స్థాయికి ఎదుగుతారని ఆశపడుతున్నావా? పోయిన నెలలో గోవిందరాజులు కొడుకు పెళ్ళి కూడా ఇలాగే జరిగింది. ఇటువంటి ఫంక్షన్స్‌కు వస్తే గదా వీళ్లలో ఏదయినా పరివర్తన కలిగేది! సామాజిక విషయాల పట్ల ఆలోచనలు రేకెత్తించే మీటింగులెన్నో జరిగాయి. ప్రతి మీటింగుకూ పిల్లల్ని తీసుకుపోవాలని ఆరాటపడ్డాను. కనీసం నా సంతోషం కోసమయినా వచ్చారా వీళ్లు' అని అంటుండగనే

ఫోన్ రింగయింది. కమల ఫోనెత్తింది. అవతల మాట్లాడుతున్నది సుపుత్రులని, మ్యాట్నీకి పోతున్నారని అర్థమయింది నాకు. నేను గట్టిగా నిట్టూరుస్తూ బెడ్‌రూములోకి కెళ్లి బరువుగా శరీరాన్ని వాల్చాను. ఎంతోసేపటికి గానీ గుండెబరువు తగ్గలేదు. కొడుకులను గురించి ఆలోచిస్తూ అలిసిపోయిన నా మనస్సులోకి ఒక్కసారిగా స్టాలిన్ బాబు వ్యక్తిత్వ పరిమళాలు వీచాయి.

రంగనాథరెడ్డి వారం రోజుల కిందట మా ఇంటకొచ్చి పెళ్లిపత్రిక ఇచ్చి తన కొడుకును గురించి గర్వంగా చెబుతూ ఆనందంతో పూడిపోయిన గొంతును కాసేపు విప్పలేకపోయాడు. చెమ్మగిల్లిన కళ్లతోనే కొడుకు పట్ల తన మనసునిండా వున్న సంతృప్తిని వ్యక్తం చేశాడు. ఆ దృశ్యం గుర్తుకొచ్చి నా మనసు తేలికపడింది.

స్టాలిన్ బాబు! ఎంత మంచిపేరు! అదొక 'పేరు' అని అనుకోవటం కంటే రంగనాథరెడ్డిలో దాగున్న ఆలోచనలకు చలనరూపమనుకుంటే బాగుంటుందేమో! స్టాలిన్‌బాబు నాకు, అదృష్టవంతుడయిన వొక తండ్రి కొడుకుగా కాకుండా ఎడారిలోని వొక ఒయాసిస్సులాగా కనిపించాడు. రంగనాథరెడ్డి చెప్పిన మాటల్లో మంచి ప్రకాశవంతమయిన స్టాలిన్ బాబు జీవన దశలు కొన్ని అగుపించసాగాయి.



ఏడవతరగతి పరీక్షల రోజులవి. స్టాలిన్ పరీక్ష రాస్తున్న గదిలోకి వొక టీచర్ వచ్చి జవాబులన్నీ డిక్టేట్ చేస్తూ స్టాలిన్ బాబును కూడా రాసుకోమన్నాడు అందుకు స్టాలిన్ నిరాకరించడంతో టీచర్ పరుషంగా మాట్లాడాడు. ఆ పసి హృదయం గాయపడింది. పరీక్షలయ్యాక స్టాలిన్ జరిగిందంతా చెప్పి హెడ్మాష్టరుకు కంప్లైంట్ చేసి టీచర్లందరి చేతా చీవాట్లు తిని కన్నీళ్లు కార్చుకుంటూ ఇంటికొచ్చి తల్లిదండ్రులకు చెప్పాడు. 'టీచర్లతో గొడవలెందుకు? నువ్వు పొరపాటు చేశావ్ స్టాలిన్' అంటూ రంగనాథరెడ్డి తన కొడుకును అభినందించలేకపోయాడు. దాంతో ఆ లేత మనస్సు ఏమనుకుందో యేమో, ఆ రోజుంతా మంచినీళ్లు కూడా ముట్టకుండా మౌనంగా వుండిపోయాడు. ఆ సంఘటన రంగనాథరెడ్డిని ఆలోచింపజేసింది.

స్టాలిన్ ఏడోతరగతి పాసయ్యారు. అయితే తన నిజాయితీని అసహ్యించుకున్న టీచర్ల దగ్గర తాను చదువుకోలేనని చెప్పి తండ్రిని వొప్పించి వేరే స్కూల్లో ఎనిమిదో తరగతి చేరాడు. చేరిన రెండు సంవత్సరాలకంతా అక్కడ కూడా తన రుజువర్తనతో చాలామంది టీచర్లకు చెడ్డవాడయ్యాడు. ముఖ్యంగా లెక్కల టీచర్ రమణకు తన దగ్గరికి ట్యూషన్‌కు రాడన్న కోపంతో ప్రతి స్లిప్ టెస్టులోనూ అదే పనిగా మార్కులు తక్కువ వేసి స్టాలిన్ బాబును మానసికంగా కుంగదీయడానికి ప్రయత్నించాడు లెక్కల టీచర్. కానీ స్టాలిన్ కుంగిపోకుండా, ప్రతిసారీ తాను కరెక్టుగా చేసిన లెక్కలను ఎత్తిచూపుతూ టీచర్ అదేపనిగా తనకు తక్కువ మార్కులు ఇస్తున్నాడని గొడవ చేయసాగాడు. అది టీచర్‌కు ఇబ్బంది కలిగించసాగింది.

ఒకరోజు లెక్కల టీచర్, కరెక్షన్ చేసిన పదోతరగతి టెస్ట్ పేపర్స్ పిల్లలకిచ్చి మార్కులు చూసుకోమన్నాడు. తన టోటల్ మార్కులు తక్కువున్నాయని ఇద్దరు పిల్లలు టీచర్ దగ్గరకెళ్లి, మళ్ళీ మార్కులు వేయించుకున్నారు. స్టాలిన్ తన పేపర్లో కూడా రాంగ్ టోటల్ వుందని రెండు మూడు సార్లు లెక్కించుకొని పైకి లేవబోయాడు. అంతలోనే టీచర్ తానే దగ్గరకొచ్చి స్టాలిన్ చేతిలో వున్న పేపర్ లాక్కొని వాని వైపు చూడకుండానే పొరపాటున మార్కులు ఎక్కవ పడ్డాయని, టోటల్స్‌లో తప్పుందని, 'తక్కువ మార్కులొచ్చినప్పుడు నిలదీసి అడిగిన వాడివి టోటల్స్‌లో మార్కులు ఎక్కువ వచ్చినట్లు తెలిసి కూడా మౌనంగా ఎందుకు కూర్చున్నావోయ్?" అని అరుస్తూ స్టాలిన్ చెంపమీద గట్టిగా కొట్టాడు. స్టాలిన్ ఏదో చెప్పబోయాడు. అదేమీ వినకుండా గద్దించాడు లెక్కల టీచర్.

స్టాలిన్ మాత్రం అవమానంతో కుంగిపోలేదు. ఇంటికి వెళ్లి జరిగినదంతా తండ్రికి చెప్పి, తాను ప్రతిక్షణమూ నిజాయితీగానే వున్నానని నిర్భయంగా అన్నాడు. రంగనాథరెడ్డి మౌనంగా కొడుకు చెప్పింది విని కాసేపు ఆలోచన చేశాడు. చివరికి వొక నిర్ణయానికొచ్చి స్కూలు మేనేజిమెంట్ దగ్గరకెళ్లి విషయమంతా చెప్పి తనకు వాస్తవాలు తెలియాలన్నాడు. మేనేజ్‌మెంట్ సలహాతో ప్రిన్సిపాల్ చాలా తెలివిగా వ్యవహరించి నిజానిజాలు బయటికి లాగాడు. దాంతో మేనేజ్‌మెంట్ లెక్కల టీచర్ రమణను ఉద్యోగం నుంచి తొలగించింది.

జరిగిన పరిణామం స్టాలిన్‌కు బాధనే మిగిల్చింది. పరిస్థితి అంత దూరంగా వెళుతుందని తానూహించలేదు. పబ్లిక్ పరీక్షలు దగ్గరవుతున్న సమయంలో మరో లెక్కల టీచర్ వస్తే పిల్లలకు ఇబ్బంది కలగవచ్చునని భావించిన స్టాలిన్, సవినయంగా మేనేజిమెంటును అభ్యర్థించి తన నిజాయితీ నిరూపణకు వొక టీచర్ జీవితం బలి కావడం ధర్మం కాదని, మళ్లీ లెక్కల టీచర్ రమణ క్లాసుకు వచ్చేవరకూ ధర్మయుద్ధం చేసి సక్సెస్ అయ్యాడు. ఈ వ్యవహారాలతో స్టాలిన్ పదో తరగతిలో మంచి మార్కులు తెచ్చుకోలేకపోయాడు.

విద్యా సంవత్సరం ప్రారంభం కావడమూ స్టాలిన్ ఇంటర్మీడియట్‌లో చేరడమూ ఆ తర్వాత చకచకా జరిగిపోయాయి. సైన్స్ గ్రూపులో చేరిన స్టాలిన్‌కు అక్కడ కూడా వెనకటి కథే ఎదురయ్యింది. ట్యూషన్‌కు రానందుకు సైన్స్ లెక్చరర్ల వేధింపులు, రాకుంటే ప్రాక్టికల్స్‌లో తొక్కేస్తామని బెదిరింపులు మొదలయ్యాయి. అయితే స్టాలిన్ దేనికీ అదరనూ లేదు బెదరనూ లేదు.

అదిగో ఇదిగో అనుకుంటూ వుండంగనే రెండేండ్ల కాలం గడిచిపోవచ్చింది. ప్రాక్టికల్ పరీక్షలు దగ్గరికొచ్చాయి. ట్యూషన్‌కు రాలేదన్న కోపంతో లెక్చరర్లు తమ కొడుకును ప్రాక్టికల్స్‌లో నిజంగానే ఫెయిల్ చేస్తారేమోనని రంగనాథరెడ్డి కొంచెం అనుమానపడి, తన మిత్రుడు డిగ్రీ కాలేజి లెక్చరర్ ప్రకాష్‌రెడ్డితో విషయం చెప్పి సలహా అడిగాడు. మరేం పర్వాలేదని ఆయన భరోసా ఇచ్చాడు.

ఫిజిక్స్ ప్రాక్టికల్స్ ప్రారంభమయ్యాయి. రంగనాథరెడ్డి ప్రకాష్‌రెడ్డితో ఒక లెటర్ తీసుకొని ప్రాక్టికల్స్ ఎగ్జామినర్‌గా వచ్చిన సురేంద్రబాబును కలుసుకొని విష్‌చేసి లెటర్ ఇచ్చాడు. స్టాలిన్ క్లాస్‌మేట్స్ చాలామంది రంగనాథరెడ్డి ఎగ్జామినర్ని కలవడం చూసి గుస గుసలాడుకున్నారు

## ఫిబ్రవరి నెల పురస్కారాలు



### భిన్న ధృవాలు

కథకు........రూ.700/-

రచయిత : తమ్మెర రాధిక



### అత్యవసరం

కవితకు.......రూ.500/-

రచయిత : పాయల మురళీకృష్ణ

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

అంతే. స్టాలిన్ ప్రాక్టికల్స్ చేయకుండా ఇంటికొచ్చి తల్లిని పట్టుకుని, 'అమ్మా, ఈ రోజు మా లెక్కల టీచర్ రమణ సార్‌కంటే నాన్న ఎక్కువగా నన్నవమానించాడు' అంటూ జరిగిందంతా చెప్పాడు. అంతలోనే ఇంట్లోకి అడుగుపెట్టిన రంగనాథరెడ్డి విషయం తెలుసుకొని సిగ్గుతో తలొంచుకొని కాస్తా దిగులు చేసి ఆ తర్వాత గర్వంతో తలపైకెత్తి కొడుకును హత్తుకొని వెలకట్టలేని కన్నీళ్లతో అభినందించారు.

యువతరానికి స్ఫూర్తినిచ్చే స్టాలిన్‌బాబు విద్యా జీవనదశలు వరుసగా నా కళ్ళముందు మెదలడంతో మనసంతా ఆనందంతో తేలికపడింది. గుండె బరువు తగ్గిపోయింది.

ఈ రోజు స్టాలిన్ బాబు అమెరికాలో ఒక పెద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీలో డైరెక్టర్. లక్షల డాలర్లు సంపాదిస్తున్నాడు. అయినా గర్వం లేదు. ఎవరిమీదా చిన్న చూపులేదు. నిర్లక్ష్యమూ, సోమరితనమూ అసలేలేవు. మానవ సంబంధాల పట్ల, కుటుంబ సంబంధాల పట్ల, బంధువర్గం పట్లా, తల్లిదండ్రుల పట్లా, పుట్టి పెరిగిన ప్రాంతం పట్లా తరగని ప్రేమానురాగాలు. అనవసర వస్తు వ్యామోహం గానీ అర్థరహితమయిన ఆర్భాటం గానీ, దర్పం గానీ లేని ఆ పిల్లవాని నిరాడంబరత ఎంతో ముచ్చటగా కనిపిస్తుంది.

పెళ్ళయ్యాక వొక వారం రోజుల తర్వాత రంగనాథరెడ్డి నాకు ఫోన్ చేసి రమ్మనడంతో నేను తరిమెలకు వెళ్ళాను. కాఫీ, టీల కార్యక్రమం అయ్యాక అందరమూ ఇంటి ముందు వరండాలో కూర్చున్నాం. అవీ ఇవీ మాట్లాడుతూ 'నన్ను పిలిపించిన విషయమేమిటి' అన్నట్లు నేను రంగనాథరెడ్డి వైపు చూశాను. మిత్రుడు కొడుకుతో మాట్లాడమన్నాడు. స్టాలిన్ ఎన్నో విలువయిన అంశాలు నాతో ప్రస్తావించాడు. ఎవరెవరినో గొప్ప సేనాతత్పరులను ఉదహరించాడు. చివరికి 'అంకుల్ పెళ్లి విషయంలో నాకున్న అభిప్రాయాలను నాన్న సంతోషంగా అంగీకరించాడు. అది నా అదృష్టం. నా అదృష్టమే గానీ ఇది ఎవరికీ ఉపయోగపడే అంశమయితే కాదు. చాలా కాలం నుంచీ నా మనసులో ఒక తీరని కోరిక వుంది అంకుల్. నాన్నతో చెప్పాను, ఆ విషయంలో మీతో కూడా షేర్ చేసుకోవాలని మిమ్మల్ని పిలిపించమన్నాను.'

'అంకుల్, మా వూరు నాకొక విలువయిన వారసత్వ సంపదను ప్రసాదించింది. 'తరిమెల స్టాలిన్‌బాబు' అని మా వూరి పేరును కలుపుకొని నా పేరు చెప్పుకోవడం నాకెంతో గర్వంగా వుంటుందంకుల్. 'తరిమెల' పేరువల్ల అమెరికాలోని తెలుగు ప్రజానీకంలో నాకొక ప్రత్యేకమయిన గుర్తింపు రావడం నేనిక్కడ పుట్టిన అదృష్టం వల్లనే! తరిమెల నాగిరెడ్డి వంటి త్యాగపురుషులూ వాళ్ళ అడుగుజాడలో నడిచిన మా తాతగారూ, ఆ మార్గాన్నే ప్రేమిస్తున్న మా నాన్నా నా జీవితానికి ఇప్పుడొక కొత్త దిశను చూపిస్తున్నారు. అందుకే నా ఆదాయంలో సగభాగం మావూరి పేదల వికాసానికి ఖర్చు పెట్టాలనుకున్నాను. నిన్న మా వూరి హరిజనవాడకెళ్లి చాలా ఇన్‌సల్ట్ ఫీలయ్యానంకుల్. పిల్లలప్పుడు నన్నూ మా చిన్నాయన, పెదనాయనగార్ల పిల్లల్నీ ఎత్తుకొని ఆడించిన ఆ ఆత్మబంధువుల జీవితాల్లో చీకటి నిండుకొని వుంది. వాళ్ళ బతుకుల్లో కళ్ళారా వెలుగు చూడాలనుంది. అందుకు ప్రతి సంవత్సరం నేను ఒక లక్ష డాలర్లు పంపాలనుకున్నాను. మీరు మా నాన్నను వొప్పించి ఆయనతోనూ, ఇంకా ఇద్దరు ముగ్గురు మీ ఆత్మీయులతోనూ కలిసి, మా వూరి పేద ప్రజల కోసం ఏదయినా ఒక మంచి ప్రణాళికను తయారు చేయండంకుల్. నేనింకా ఒక నెల రోజులు ఇక్కడే వుంటాను. ఈలోగా అందరూ కలిసి ఒక నిర్ణయానికొస్తే మీ సహకారంతో నేను ముందుకు ప్రొసీడవుతానంకుల్' అంటూ నమస్కరించాడు. నేను పరవశించి పోయాను.

రంగనాథరెడ్డి కొడుకు నిర్ణయం విని మాటలు రానివాడై నన్ను బయటికి పిల్చుకొని వెళ్లి నా చేతులు పట్టుకొని చెమ్మగిల్లిన కళ్లతో నా వైపు చూస్తూ రమేష్ యేమి చెప్పాలో నాకు మాటలు రావడం లేదప్పా. నిజం చెప్పాలంటే వాని కాళ్ళ దగ్గర కూర్చునే యోగ్యత కూడా నాకు లేదనిపిస్తా వుంది' అని అంటూ చేతిగుడ్డతో కన్నీళ్లు తుడుచుకోసాగాడు.

తండ్రిగా రంగనాథరెడ్డి సాధించుకున్న ఆ పరాజయ అనుభూతి నా శరీరాన్నంతా తాకడంతో యేదో తెలియని పారవశ్యం మనసును కప్పివేసింది. ఆ పిల్లవానిలో నా కొడుకుల్నీ, అనేకమంది ఇతరుల కొడుకుల్నీ కలగంటూ తృప్తి చెందాను.

సెల్ : 95331 22329

# చీపురు

- కందిపాటి గోపాలరావు

సెల్ : 9652174640



నునులేత కిరణాలని
సన్నటి పొడవాటి పుల్లలుగా
తుంచి కడితే
కట్టైన చీపురది
చిమ్మే చాకిరి
రాలిన చీకటి దుమ్మే
ఊపిరి
తరాల నుండీ
పెరిగిన అంతరాల నడుమ
ఆడవారికే
అంటగట్టిన ఆస్తి
ఇప్పుడిప్పుడే
కనుమరుగవుతున్న స్థితి
సువాసనలు ఎగజిమ్మే
ఫినాయిల్‌తో కడుక్కునే
ముగ్గుల సిగ్గులు పూయని
మార్బుల్ బుగ్గలకి
'ఫ్లోర్ క్లీనరే' ఇప్పుడు బ్యూటీషియన్
కొత్త కోడలు పై దాడిలో
అత్త చేతి ఆయుధంగా
ఇంటి పనుల అధ్యక్ష పీఠంపై
యుగాలుగా వెలిగిన చీపురు
ఇప్పుడు..
అధికారానికి రాలేని
అవిశ్వాసానికీ చాలని
ప్రతిపక్షమై పోయింది
'వినిమయ ప్రపంచ యుద్ధంలో
ఓడిపోయి గతమై
వీడిపోయి జ్ఞాపకమై
ఇంటి మూలనే కాదు
మనసు మూలాల్లోనూ లేదు
పాతబడ్డదంతా పాడుబడ్డదే
పాడుబడ్డదంతా బతికి చెడ్డదే

# చిటారుకొమ్మ

- జంకె కృష్ణారెడ్డి

సెల్ : 9652222051



చిగురాకుల సోయగాలతో
పూలగుత్తుల పరిమళాలతో
సయ్యాటలకై సైగలు చేసే
చిగురు వన్నెల చిటారుకొమ్మ
తల్లి చెట్టుకు తలమానికం
ప్రేమపక్షులకు పూలపానుపు

వానకో గాలికో ఎండకో
రుతు ధర్మానికో
ఆకులు నేలరాలినా
పరిమళాలు గాలికి పోయినా
వన్నెలు వాడిపోయినా
కలిసొచ్చే కాలం కోసం
చెట్టంత ధైర్యంతో
మాతృమూలాలను వీడని
చిటారుకొమ్మ సిసలైన స్థితప్రజ్ఞ!

# జయహో



సాహిత్యేతిహాసాల
సువర్ణ పుటల్లో
అయ్యవారి కొలువుల్లో
తన పేరు నమోదు
చేయదలచిన వారు
తప్పక సలామ్ కొట్టండి!
మఠాల్లో, దర్గాల్లో
శిరస్సు తప్పక వంచండి.
తాయిలాలు పొందండి.
బురదలో చింకి గుడ్డల్లో పెరిగిన వారు
ఆస్వాదించండి క్షీరాభిషేకం
కవితలు వినిపించండి
హరి కథలు చెప్పండి
అందలాలు ఎక్కండి
రచనలకు గర్వపడండి
ఎవరూ పొగడక పోయినా
మీ వీపు మీరే చరుచుకోండి
దీనులు, హీనులు, దళితుల గురించి
రాసి ఆనందించండి, పులకరించండి
పట్టణ, మహానగరాల్లో వెలుగొందండి
మీ పల్లెల్ని మరిచిపోండి
పొలాల్ని అమ్మి తినండి
కాని, పల్లెల వ్యథను
అంతులేని లేమిని
మీ పదాలతో
తప్పక అమ్ముకోండి!

అరె! మీరు రాయండి
మీ బతుకు ఓహో
సాహిత్యంలో
అమరులు కండి
ఎప్పుడైనా, ఎక్కడైనా
మీకే జేజేలు
మీకు జయహో
దేశ కవుల్లారా!
మహాశయుల్లారా!

హిందీమూలం :

నూర్ మహమ్మద్ 'నూర్'

తెలుగు : వేదుల రామకృష్ణ

# ఒక్కమాట



హిందీ మూలం :

రమేశ్ గోస్వామి

తెలుగు : ఆర్. శాంతసుందరి

అతనికోమాట చెప్పాలనుకుంటున్నాను
చెప్పేశాను
సముద్రంలో కాగితప్పడవని వదిలేశాను
ప్రతి కోరికనీ తప్పించుకుంటూ
ఒడ్డు మీద కలల చలిమంట వేసుకున్నాను
ప్రేమకి సిఫార్సు కాయితమ్ముక్క తగిలించలేదు
సంతోషాన్ని రమ్మని పిలవలేదు
గతాన్ని తూచలేదు
రేపటిని తడిమి చూడలేదు
శూన్యంలో ఎక్కడో తప్పిపోయానని ప్రకటన వేయించాను
నా చేతిరాతే నాకు అపరిచితమైపోయింది
కొత్త ఆలోచనలతో సిరా ఇగిరిపోయింది
ఒక మసీదు కూలిపోయింది
ఒక చర్చి కాలిపోయింది
దేవుడికి భక్తులే అటువంటి శిక్ష వేశారు

# 'ఖండిత' ఒక పరిశీలన

- డా॥ పొన్నంరెడ్డి కుమారి నీరజ




దళితుల అస్తిత్వాన్ని అవమానించి, వారిని చిన్న చూపు చూసే ఆచారాలను కూడా ఆదరించే మనఃస్థితి వాళ్ళలో నాటుకుపోయేట్లు చేశారు. పేరు పెట్టుకునే దగ్గర నుండి అలాంటి భావం ప్రస్ఫుటమవుతుంది. తాము చాకిరీ చేయడం వల్ల అగ్ర కులస్తులు ఆదరిస్తున్నారని, అయినా చేసే చాకిరీకి వాళ్ళిచ్చేది ఏమాత్రం సరికాదని గ్రహించలేని అమాయకులు. వాళ్ళ ఉప్పు, కారం తింటున్నందున వారిని ఎదిరించడం, వారికి అన్యాయం చేయడం ద్రోహమనుకుంటారు.

భిన్న మతాలు, విభిన్న కులాలకు నిలయమైన భారతదేశంలో కొన్ని ఉన్నతంగానూ, కొన్ని తక్కువగానూ చూడబడుతున్నాయి. పని విభజనలో భాగంగా ఏర్పడిన వృత్తులు క్రమంగా కులాలుగా స్థిరపడ్డాయి. కులానికీ, వృత్తికీ ప్రత్యక్ష సంబంధం తెగిందనుకునే ఈ రోజుల్లో కూడా కొన్ని కులాల్ని దూరంగానే ఉంచుతున్నారు. వృత్తిలో భాగంగానే అంటరానివాళ్ళుగా ఊరికి దూరంగా నెట్టివేయబడిన మాల మాదిగ కులాల వారిని నేటికీ సమాజం అలాగే చూస్తోంది. ప్రభుత్వం ఎన్ని చట్టాలు తీసుకొచ్చినా, రిజర్వేషన్లు కల్పించినా అవన్నీ వారికి అందని ద్రాక్షగానే మిగులుతున్నాయి. దీనికి తోడు చాకిరీ, లైంగిక వేధింపులు - కొన్ని పాత్రల మానసిక సంఘర్షణలను, రిజర్వేషన్ల లొసుగులను ప్రత్యక్షీకరించినవి నాగలోకం, మార్తా, నీళ్ళు, పిచ్చితుమ్మ, సందిగ్ధ, విధ్వంసానికి ఆవలి వైపు కథలు. వి.ప్రతిమ గారి 'ఖండిత' కథల సంపుటిలోని కథలివి. ఇందులో 15 కథలున్నాయి. పూర్తిగానూ, పాక్షికంగానూ దళితుల సమస్యలను చిత్రించిన కథలను మాత్రమే పరిశీలనకు తీసుకున్నాను.

ఆధునిక కులాంతర వివాహ ఆలోచనను ఒక సాంప్రదాయక దళిత మహిళ ఈసడించిన విధానం, తెగింపు ధోరణిలో ప్రవర్తించిన ఆమె కూతురి జీవితం, అగ్ర కులస్థుల కుళ్ళు 'రాజకీయాలు' వెరసి 'నాగలోకం' కథ.

దళితుల అస్తిత్వాన్ని అవమానించి, వారిని చిన్న చూపు చూసే ఆచారాలను కూడా ఆదరించే మనఃస్థితి వాళ్ళలో నాటుకుపోయేట్లు చేశారు. పేరు పెట్టుకునే దగ్గర నుండి అలాంటి భావం ప్రస్ఫుటమవుతుంది. తాము చాకిరీ చేయడం వల్ల అగ్ర కులస్తులు ఆదరిస్తున్నారని, అయినా చేసే చాకిరీకి వాళ్ళిచ్చేది ఏమాత్రం సరికాదని గ్రహించలేని అమాయకులు. వాళ్ళ ఉప్పు, కారం తింటున్నందున వారిని ఎదిరించడం, వారికి అన్యాయం చేయడం ద్రోహమనుకుంటారు.

యెంకటమ్మ కూతురికి రెడ్డి భార్య 'అరుణ' అని పేరు పెట్టినందుకు సంప్రదాయాలకు విరుద్ధంగా నడుచుకుంటే ఎగతాళి చేస్తారని భయపడింది. అయినా పేరులో ఏముంది బుద్ధుండాలి గాని అంటుంది. బుద్ధి అంటే ఈమె దృష్టిలో పెద్దలను ఎదిరించకుండా ఉండటం. ఎన్ని బాధలు పెట్టినా ఎదురు చెప్పకుండటం. వివిధ మాధ్యమాలు, చదువు వల్ల నేడు పిల్లల్లో మార్పు రావడాన్ని జీర్ణించుకోలేని మహిళ ఈమె. "వాళ్ళు బంగళాల్లో దేనికుండాలా? మనము గుడిసెల్లో దేనికనేసుండాలా" అని అడిగితే "కాలిగోళ్ళు తలెంటికల్తో ఎట్టా పోటీ పడ్తాయి" అంటుంది. దీనికి ఆమెలోని అమాయకత్వమో, చదువు లేకపోవడమో, మూలాలు తెలియకపోవడమో కారణం కాదు. వారి మనస్తత్వాన్ని బాగా ఎరిగింది కాబట్టి.

తరతరాలుగా అణచివేతలకు గురిచేయడం, భయపెట్టడం వల్ల తన కూతుర్నే నిందిస్తుంది. చావబాదుతుంది. పెద్దోళ్ళతో ప్రేమలేంటని" మనమేంది? ... వాళ్ళేంది? అంటుంది. పెద్దోళ్ళతో పెట్టుకుంటే ఇంకేమన్నానా, అది పాపం కూడా అని తన కూతుర్ని బలవంతంగా తమ్ముడికిచ్చి పెళ్ళి చేస్తుంది. పెళ్ళయిన పిల్లని రెడ్డి కొడుకు రమేష్ లేవదీసుకుపోయినా తన కూతుర్నే అనరాని మాటలంటుంది. అట్లా చేయడాన్ని స్వామిద్రోహంగా భావిస్తుంది. మారిన కాలానికనుగుణంగా కొందరితో కలిసి రెడ్డి ఇంటిముందు తన కూతురు పోరాటం చేయడం పెద్ద ఘోరమైనట్లు, నేరమైనట్లు భావిస్తుంది. దీనివెనకున్న ఆమె భయం రెడ్డి తన బిడ్డను బతకనివ్వడని, నరికి పారేయవచ్చునని. వాళ్ళ క్రూరత్వం తెలిసిన స్త్రీ కాబట్టే అలా భయపడింది. సంప్రదాయాల ముసుగులోనుంచి బయటకు రాలేక పోయింది. అందుకే "నక్కకూ నాగలోకానికి పొత్తేదీ కుదరద్దీ" అంటుంది.

రెడ్డికీ, నాయుడికీ తగవుల కారణంగా నాయుడు ఇప్పుడు రెడ్డి కొడుకు తప్పు చేయడాన్ని అదనుగా తీసుకుని మనల్ని రెచ్చగొట్టి మనకు సహాయం చేస్తున్నట్లు నటిస్తున్నారు. మనల్ని మధ్యలో వాడుకుంటున్నాడు. ఆయనకే లాభం లేకపోతే మనకెందుకు సహాయం చేస్తాడు అని ఆ 'రాజకీయాల' వెనకున్న కుట్రను తన వాళ్ళందరికీ అర్థమయ్యేట్లు చెప్పింది.

"రేపు రెడ్డి, నాయుడు ఒకటైపోయి మనల్ని పులుసులో కరేపాకు నేరినట్టు" ఏరి పారేస్తారని హెచ్చరిస్తుంది. రాజకీయాల వెనుక దాగున్న కుట్రను అర్థం చేసుకునే శక్తి వున్నా వాళ్ళను ప్రశ్నించే ధైర్యం లేదు. తరతరాల నుండి అల్లుకుపోయిన ఆ అంతరాలను తెంచుకోలేకపోయింది.

ఉడుకు రక్తం మీదున్న కొడుకు మారిన కాలానికనుగుణంగా సమాజం మారిపోవాలనుకునేవాడు. "పిచ్చినాయాలు వాడికి తెలీదం లేదు. ఇదంతా అంత తేలిగ్గాదని" అంటుంది. అందుకు ఎంతో

సమయం పడుతుందని, ఎన్నో విప్లవాలు రావాలని ఆమె ఆలోచన.

తమ కుటుంబాల్లో భర్తలు చెప్పిందే వేదం. భార్య తెలివితక్కువది. అయినా "ఆడముండ జెప్తే మనమినేదేందిలే?" అనుకుంటారు తాగుబోతులైనా. తమ ఆడవాళ్ళకు విలువ లేదనీ, ఎంత ఆలోచనా శక్తి వున్నా, ముందు చూపున్నా, కుటుంబ భారాన్నంతా మోస్తున్నా తమ మగాళ్ళకు పనికిరాని వాళ్ళకిందే లెక్క. ఇతర కులాల్లో లాగా ఇక్కడా స్త్రీ అణచివేత తప్పలేదన్నమాట.

అవమాన భారం కంటే పెద్దవాళ్ళతో తర్వాత ఎదురయ్యే సమస్యల కంటే తన ప్రాణం, తన కూతురి ప్రాణం ఎక్కువ కాదని యెంకటమ్మ కూతురికి కాఫీలో గన్నేరు కాయలు పొడి వేసిచ్చి తానూ ఆత్మహత్య చేసుకోవడానికి బావి దగ్గర కెళ్తుంది.

వాళ్ళను ఎదిరించి తాము బతకడం కష్టం అనే భయాలే ఆమెనలా పురికొల్పాయి.

అంటూ, ఆచారాల ముసుగులో చిక్కుకున్న దుర్గమ్మలో మార్పు తెచ్చి, ఎన్నో కష్టాలు పడి 'మార్తా'ను కాపాడిన కథే 'మార్తా'.

ఎప్పుడో బతుకు తెరువు కోసం నాగపట్టణం చేరిన తెలుగువాళ్ళు, తిండికి జరక్క క్రైస్తవ మతంలో చేరితే వాళ్ళ బిడ్డకు 'మార్తా' అని పేరు పెట్టాడు పెద్ద.

తన ప్రమేయం లేకుండానే ఆ అమ్మాయి ఎన్నో కష్టాలు పడాల్సి వచ్చింది. ఎప్పుడో తండ్రి పోయాడు. తల్లిని సునామీ కబళిస్తే నాగపట్టణం నుంచి కొట్టుకొచ్చి బిక్కమొహంతో పార్కులో దుఃఖిస్తుంటే శర్వాణి అనే బ్రాహ్మణ స్త్రీ ఇంటికి తీసుకొచ్చింది. భర్త తల్లి బాధపడలేక 'మారుతి' అని పేరు మార్చాడు.

మడి, ఆచారాలు ముసుగులో, భర్త సేవలో తను ఆలోచించడమే మరిచిపోయిన బ్రాహ్మణస్త్రీ దుర్గమ్మ ఉద్యోగాలు చేసుకుంటున్న చిన్న కొడుకు, కోడలు దగ్గరికొచ్చిన ఆమె 'మార్తా' మాదిగ అమ్మాయని గ్రహించి అన్నం తినడం మానేసింది.

"మాల కూడు ఎలా తింటున్నారండి?" వండినంతనే, తాకినంతనే అది మైల ఎలా పడిందో నిజంగా ఆమెకూ తెలియదు. మూఢంగా ఎప్పటి నుండో అనుసరిస్తున్న ఒక ఆచారమది.

దుర్గమ్మ ప్రవర్తనతో 'మార్తా' బెంబేలు పడిపోతుంది. ఆమెలో ఎన్నో ఆలోచనలు. ఆమె వచ్చినప్పటి నుండీ తను వరండాలోనే. ఇక్కడి నుండి తరిమేస్తే తన పరిస్థితి ఏంటన్నదే ఆమె భయం.

రచయిత్రి అన్నట్లు కులం అన్నది "మనిషికీ మనిషికీ నడుమ కన్పించని మాయ గోడ". 14 సం॥ల మార్తా 'కులం' పేరు వింటేనే వణికిపోతుంది. తన జీవితం ఇలా ఒంటరి కావడానికి ఓ బలమైన కారణం కులం కూడ. చిన్నప్పటి నుండీ ఆమె అణచివేతను, అంటరానితనాన్ని ఎదుర్కొంది. దానిమూలంగానే తల్లి శీలానికి విలువ లేకుండా పోయింది. దానిమూలంగానే ఆమె తండ్రి మరణించారు. అందుకే ఆమెకు 'కులం' అనే మాటంటే అంత ఆవేదన, భయం.

కులాలెలా ఏర్పడ్డాయో తెలిసిన శర్వాణి 'మార్తా'ను కాపాడ్డానికి తహతహలాడ్తుంది. ఆమె ఎక్కడున్నా, ఏం చేస్తున్నా మార్తా గురించే ఆలోచన. అత్తగారి కోసం మార్తాను పంపడం ఇష్టం లేదు. నిద్రలోనూ అదే కలవరం. ఆమెకు ఈ కులాలు, పట్టింపులు గిట్టవు. పట్టణాల్లో, చదువుకున్నవాళ్ళల్లో, ఈ 21వ శతాబ్దంలోనూ కన్పిస్తున్న కులాంతరాలను చూసి లోలోపలే రగిలిపోతుంది.

**కులాలెలా ఏర్పడ్డాయో తెలిసిన శర్వాణి 'మార్తా'ను కాపాడ్డానికి తహతహలాడ్తుంది. ఆమె ఎక్కడున్నా, ఏం చేస్తున్నా మార్తా గురించే ఆలోచన. అత్తగారి కోసం మార్తాను పంపడం ఇష్టం లేదు. నిద్రలోనూ అదే కలవరం. ఆమెకు ఈ కులాలు, పట్టింపులు గిట్టవు. పట్టణాల్లో, చదువుకున్నవాళ్ళల్లో, ఈ 21వ శతాబ్దంలోనూ కన్పిస్తున్న కులాంతరాలను చూసి లోలోపలే రగిలిపోతుంది.**

'మార్తా' మానసికంగా సంఘర్షణ పడి ఓ రోజు రాత్రి శర్వాణి నిద్రపోతున్న గదిలోకొచ్చి ఆమె పాదాలు పట్టుకుని తనను పంపవద్దని దీనంగా వేడుకుంటుంది. ఈ దృశ్యం ప్రసాద్‌లో కలత రేపింది. అందుకే ఈ కులాలకు మూలాలు ఏమిటి; ఈ అంటు సొంట్లు ఎలా వచ్చాయో తల్లికి వివరంగా చెప్పాడు. కొడుకు చేసిన హితబోధతో ఆలోచించడం మొదలుపెట్టిన దుర్గమ్మలో మార్పొచ్చింది. 'మార్తా' మనతోపాటే ఇక్కడే ఉంటుందంటుంది.

ఏ మనిషైన తెలిసో తెలియకో తప్పు చేయడం సహజం. అయితే అది తప్పని తెలుసుకున్న తర్వాత ఆ తప్పు చేయడం మనిషి తనం కాదు. కులాల సృష్టి, వాటి వెనకున్న రహస్యాలు తెలుసుకుని సమాజంలోని అగ్రకులాల వాళ్ళు దుర్గమ్మలాగా మారితే దళితులకు అంటరానితనం, కష్టాలు, లైంగిక వేధింపులు ఉండవు. ఆత్మాభిమానం చంపుకోవాల్సిన అవసరం వుండదు. బతుకు భయం ఉండదు.

పీడితులైన మహిళల ద్వారా కుల వివక్ష ఎలా పునరుత్పత్తి అవుతున్నదో వివరించిన కథ 'పిచ్చి తుమ్మ'.

దళితుడైన సుధాకర్ చదువుకుని, ఉద్యోగం చేస్తూ జనాభా లెక్కలు రాయడానికి రెడ్డింటికి వచ్చి వరండాలో మంచం మీద కూర్చున్నాడు. అది చూసి జీర్ణించుకోలేని రెడ్డి కోడలు "మాల వెధవ..." అని నానామాటలూ అంది.

ఆ మాటలు విన్న సుధాకర్ పంచాయతీ పెట్టించాడు. ఆమె చేత్తోనే స్వయంగా వండి దళితులకు వడ్డించాలని డిమాండ్ చేశాడు. ఒప్పుకోకపోతే కేసు పెట్టి కోర్టు కెళ్తానన్నాడు. గత్యంతరం లేక తీర్పు చెప్పే ఆమె మామ రెడ్డి అందుకు సరేనన్నాడు. అది సుజాతకు చాలా బాధగానూ, పెద్ద అవమానంగానూ తోచింది.

అయినా ఆమె అలా మాట్లాడ్డానికి కారణం లేకపోలేదు. తరతరాలుగా వస్తున్న ఆచారమది. నాయనమ్మ నుండి అమ్మకు, అమ్మ నుండి, చుట్టుపక్కల వాళ్ళ నుండి ఆమెకూ వచ్చింది.

పని విభజనలో నుండి వృత్తి, వృత్తుల్లో భాగంగా కులాలు ఏర్పడ్డాయని, దళితులు చర్మకార వృత్తి చేయడం వల్ల వారిని ఊరికి దూరంగా నెట్టారన్న రహస్యాలు ఆమెకు తెలియదు. ఇప్పుడు ఆ వృత్తులు లేకపోయినా అంటరానితనం మాత్రం పోలేదు. అందుకే ఆమె ఆ విధంగా అన్నది. అణచివేయడానికి పెట్టిన ఆచారాల గుట్టు విప్పరు కదా!

ఆమె మాటలతో సుధాకర్‌కి తన గతమంతా గుర్తొచ్చింది. తన అంతరంగంలో మెదులుతున్న ప్రశ్నలను ఒక్కొక్కటిగా గుర్తు చేసుకుంటాడు.

చిన్నప్పుడు చదువుకుంటున్నందుకు చదువులేని తండ్రి చావగొడ్తే "నీకెందుకు చదువులంటూ" నీరుగార్చారు అయ్యవార్లు.

తన వాళ్ళను ఏ కారణం లేకపోయినా చంపేయడం.. ఏదో ఒక చావుగా చిత్రీకరించడం, వంగి వంగీ దండాలు పెట్టించుకోవడం... చదువు కోసం వెళ్ళిన తమ ఆడపిల్లల హఠాన్మరణాలు... ప్రభుత్వం చిన్నచూపు చూడటం ఇవన్నీ అతని అంతరంగాన్ని కుదిపేశాయి.

మనిషి అంటే రక్తమాంసాలు, ధమనులూ, సిరలూ తమకసలు ఉన్నాయా? రక్తం నలుపా? తెలుపా? అని తమని చిన్నచూపు చూస్తున్న వాళ్ళు ఆలోచించే ప్రశ్నలు సంధిస్తాడు.

'మైల' శరీరానిదా? వాడిదా? ఈ పదం ఎలా పుట్టింది? దేన్ని ఆధారంగా చేసుకుని పుట్టింది? నా శరీరం శుభ్రంగా వుందే! అని తాను కుమిలిపోతూ ఆలోచనను రేకెత్తిస్తాడు. మైల అని తమను దూరంగా పెడుతున్న పెద్దలకు దళిత స్త్రీలను చూసినప్పుడు, వేధించినప్పుడు అంటు అంటదు. అసలు "మా వాడల్లోని ఆడవాళ్ళెప్పుడూ పెద్దలకు సంసారులుగా కన్పించరని" బాధపడతాడు. తన అక్కా, చెల్లీ ఏ విధంగా బలైందీ గుర్తుచేసుకుని కుమిలిపోతాడు. అసలు దళిత స్త్రీ అంటే వాళ్ళ స్వంత ఆస్తి, ఆటబొమ్మ అనే తత్వం పోవాలి. స్త్రీ అంటేనే లోకువ. అందునా దళిత స్త్రీ అంటే ఇంకా లోకువ. సమాజంలో ఇలాంటి భావజాలం పోనంత వరకూ, స్త్రీకి రక్షణ లేనంత వరకూ ఇలానే జరుగుతుంది. ఆమెను గౌరవించే ఆలోచనలు పుట్టకపోతే సమాజం భ్రష్టమవుతుంది.

ఎన్నో తరాల నుండి పడుతున్న బాధలూ, అవమానాలూ అతనిలో విద్యాగంధం వల్ల ప్రశ్నించబడ్డాయి, తిరస్కరించబడ్డాయి, ప్రశ్నించబడ్డాయి.

పెద్దలు చేసిన అన్యాయాన్ని కూకటి వేళ్ళతో సహా పెకిలించడానికి సుజాత అన్న మాట అతనికి ఆయుధంగా దొరికింది.

సమస్య పరిష్కారం కోసం బలవంతం మీద ఒక సామాజిక స్థితి నుండి మరొక సామాజిక స్థితిని రుచి చూసి, ఆ రెండు ప్రపంచాల మధ్య ఊగిసలాడి - పాతను చీదరించుకుని, కొత్తలోకి ప్రవేశించాలని తాపత్రయపడే 'చంద్రిక' మానసిక స్థితికి సంబంధించిన కథ 'సందిగ్ధ'.

తన వాళ్ళను అన్యాయంగా పొట్టన బెట్టుకున్న, అవమానించిన వివిధ సంఘటనలు గుర్తొచ్చాయి. ఒక్కసారిగా లోలోపల ఉడుకుతున్న అగ్నిపర్వతం బద్దలై లావాలా అతని గుండెల్లోని బాధ బయటికొచ్చింది.

సుధాకర్ ఒక్కడే కాదు. ఎంతోమంది అంతరంగాల్లో జరుగుతున్న మథనమిది.

సమస్య పరిష్కారం కోసం బలవంతం మీద ఒక సామాజిక స్థితి నుండి మరొక సామాజిక స్థితిని రుచి చూసి, ఆ రెండు ప్రపంచాల మధ్య ఊగిసలాడి - పాతను చీదరించుకుని, కొత్తలోకి ప్రవేశించాలని తాపత్రయపడే 'చంద్రిక' మానసిక స్థితికి సంబంధించిన కథ 'సందిగ్ధ'.

తండ్రిపై పడిన కేసును ఎత్తివేయడానికి పెద్దలు సి.ఐ. కూతురింట్లో పనిమనిషిని చేశారు. పేరులేని 'నడిపమ్మి'కి అక్కడే 'చంద్రిక' అని పేరు పెట్టారు. అక్కడ అన్నీ అనుభవించిన చంద్రిక తిరిగి తన ఊళ్ళో ఇమడలేకపోయింది. పట్టణంలో వాళ్ళలాగా తామూ ఎందుకుండ కూడదు. ఇలానే ఎందుకు బతకాలి అని లోలోపలే కుమిలిపోతుంది.

"పల్లెల్లో వాళ్ళు కేవలం శరీరాల కోసం, శరీరాలతో బతుకుతున్నారు." వారికి ఆలోచనలు లేవు. ఎలా బతకాలో తెలియడం లేదని - తనకు మాత్రమే తెలుసని అనుకుంటుంది. వారి ఊహలూ, ఆలోచనలు కూడా అణచివేయబడ్డాయని తెలుస్తుంది.

పెద్దలు తమనెంత ఆదరించినా, ఆప్యాయంగా చూసినట్లున్నా అణచివేయాలనే ఆలోచన వారి నరనరానా జీర్ణించుకుని ఉంటుంది. అన్ని రకాలుగా ఆదరించే అరుణక్క... "ఎందుకో తను నిలబడి మనిషిలా మాట్లాడబోతే సహించలేకపోయేది. తగ్గే వుండమనేది" అని బాధపడుతుంది. దీనికి కారణం లేకపోలేదు. అవసరాలకే కింది వాళ్ళు. వాళ్ళు కిందే వుండాలి అనుకోవడం.

పరువు కోసం పాకులాడే కుటుంబంలో పుట్టిన చంద్రిక మనసులో ఎన్నో కోరికలు, ఆశలు. తను ఈ దుస్థితికి కారణమైన సమాజం మీద కోపం. యుద్ధం ద్వారానైనా తమ హక్కులు తాము పొందాలన్నంత ఆవేశం, ఆత్రుతలతో మనసులోనే సంఘర్షింప బడుతుంది. మనుషులంతా ఒకటే అయితే మరి అందరూ ఒకే విధంగా ఎందుకు బతకకూడదు అన్న ప్రశ్న ఆమె మెదడును తొలుస్తుంది. ప్రభుత్వం తమను ఉద్ధరించడానికి ఏం చేస్తూందో.. ఎక్కడ చేస్తూందో.. తెలీదని అసమర్ధ ప్రభుత్వాన్ని నిందిస్తుంది. ఇంత ఆలోచనా శక్తి ఆమెలో కలగడానికి ఆమె గడిపిన పరిసరాలే కారణం కావచ్చు.

"పేదవాడుగా పుట్టిన ప్రతివాడూ పేదవాడుగా మరణించాల్సిన అవసరం లేదు" అన్న మాటలు ఆమెకెంతో ఉద్వేగాన్నిచ్చాయి. అలా ఉండాలి... ఇలా ఉండాలి అనే ఆమె మాటలు పల్లెలోని తోటి స్నేహితులకు నవ్వు తెప్పించాయి. తరతరాలుగా ఒకే జీవన విధానానికి అలవాటు పడ్డ వాళ్ళకు ఆమె మాటలు వింతగానూ, విచిత్రంగానూ తోచడంలో ఆశ్చర్యం లేదు.

పల్లెలు ఒకప్పటిలా ప్రశాంతంగా లేవు. ఎన్నో 'రాజకీయాలు'. కుళ్ళు, కుట్రలు, కుతంత్రాలు, కొట్లాటలు, రాద్ధాంతాలు. చదువూ సంధ్యలూ లేకపోవడం వల్ల, ఆలోచనలు లేకపోవడం వల్ల, లోకజ్ఞానం లేకపోవడం వల్ల జీవితాల్లో ఎదుగూ బొదుగూ లేదని గ్రహించింది. అందుకే తానూ ఇల్లు కట్టుకోవాలని... ఆ యింట్లోకి కుర్చీలు, టేబులూ, గ్యాస్ స్టౌ.. నాలుగు వస్తువులూ కొనుక్కోవాలని... మనం మాత్రం వాళ్ళ మాదిరిగా ఎందుకనుభవించకూడదన్న ఆలోచనతో, ఇవన్నీ ఎందుకు నీకనే అమ్మానాన్నలకు చెప్పకుండా పారిపోతుంది. ఎంతో మానసిక సంఘర్షణనుభవించిన ఆమె అక్కడే ఉంటే అందరిలాగే తన ఆశలూ, ఆలోచనలూ, చివరకు తానే అణచివేయబడతాననే అలా చేసిందేమో.

ఇవేమీ తెలియని అమాయకురాలైన వాళ్ళమ్మకు మాత్రం కూతురు దేనికోసం వెతుక్కుంటూ వెళ్ళిందో అర్థం కాలేదు. కానీ ఆమెలో ఒక భయం. ఊర్లో వాళ్ళకు ఏమని సమాధానం చెప్పాలని, వయసులో వున్న ఆడపిల్ల ఇంటి నుండి వెళ్ళిపోతే సమాజం ఆలోచనలు ఎలా ఉంటాయో తెలిసిందే కదా! కానీ ఆమెకు ఎక్కడో చంద్రికపై ఒక నమ్మకం, ఏ తప్పూ చేయదని.

మామూలు కళ్ళకు బాణామతిగా, గ్రామీణ కౌటుంబిక ద్వేషాల వ్యక్తీకరణగా కనబడే ఘటనల వెనుక కూడా తరచి చూస్తే లోలోపల అస్పృశ్యం పట్లా, పెత్తందారుల దౌర్జన్యం పట్లా వ్యతిరేకత, కసి ఎట్లా పనిచేస్తుంటాయో చూపిన కథ 'విధ్వంసానికి ఆవలి వైపు.'

పదో తరగతి వరకు చదువుకున్న జయరాముడు తన తండ్రి, ఊర్లోని దళితులు అగ్ర కులస్తుల వద్ద పడ్డ అవమానాలు, చేసిన చాకిరీలు భరించలేకపోయాడు. అన్నింట్లో అంటు పాటించే ఆ పెద్దలకు దళిత స్త్రీని తమ కామవాంఛ తీర్చుకోవడానికి వాడుకున్నప్పుడు ఆ 'అంటు' గుర్తు రాదు.

జయరామునిలో రగులుతున్న ఆ కసినంతా తమ ఈ దుస్థితికి కారణమైన కిష్టారెడ్డి కుటుంబంపై చూపాడు. అతని కొడుకుల మధ్య బాణామతి నెపంతో చిచ్చుపెట్టి ఒకరంటే ఒకరికి పడనట్లు చేసి, వాళ్ళలో వాళ్ళు కొట్టుకు చచ్చేట్లు చేయాలనుకున్నాడు. వాళ్ళ వంశం ఈ భూమ్మీద నిలవకూడదనుకున్నాడు.

తరతరాలుగా తనవాళ్ళందరి అణచివేతకు, అవమానాలకు కారణమైన ఆ పెత్తందారీ వృక్షాన్ని కూకటి వేళ్ళతో సహా పెకిలించాలనుకున్నాడు. సమాజానికి అంటిన ఆ 'అంటు' రోగాన్ని పూర్తిగా నయం చేయాలనుకున్నాడు.

మారుతున్న కాలమే అతన్నలా తయారు చేసింది. ఆలోచింపచేసింది. తండ్రికి లేని, రాలేని ఆలోచనలను పుట్టించింది.

అదంతా దేవుడు చూసుకుంటాడ్రా మనకెందుకు అన్న తండ్రితో అందుకే అతడు అంత ఆవేశంగా "హయ్యో పిచ్చి నాయనా దేవుడే వుంటే కొంతమందినిట్టా, కొంతమందినట్టా ఎందుకు పుట్టిస్తాడు చెప్పు? అమ్మ చచ్చిపోయింది ఆ కిష్టారెడ్డి వల్ల గాదా?.. అన్నింట్లో మాత్రం అంటు.. మనాడోళ్ళు మాత్రం వాళ్ళ పక్కలోకి రావాలి. దానికి మాత్రం అంటుండదు..." అంటాడు.

తన జ్ఞానంతో తరతరాలుగా బూజుపట్టిన తన తండ్రిలాంటి వారి బుర్రలను దులపాలనుకున్నాడు. మాటలతో వినరని, మారరని పెత్తందారులను సమూలంగా నాశనం చేయాలనుకున్నాడు.

పంచాయతీరాజ్, స్థానిక స్వపరిపాలనా సంస్థలు, వాటిలో రిజర్వేషన్లు, గ్రామీణ అట్టడుగు ప్రజలకు, ఇంతకాలమూ అవకాశాలు కోల్పోయిన ప్రజలకు అధికారంలో వాటా పంచి ఇస్తాయన్న ఒక అమాయకపు నమ్మకం కఠోర వాస్తవాల ముందు ఎట్లా భగ్నమైపోతుందో వివరించిన కథ 'నీళ్ళు'.

రిజర్వేషన్ల ముసుగులో ఊరి పెద్దలే తమ చెప్పు చేతల్లోని వారిని పోటీకి దింపడం, గెలిపించడం, వారి ప్రమేయమే లేకుండా ఊరేగింపులు చేసుకోవడం, వారిని పంచాయతీ ఆఫీసు ముఖం కూడా చూడనీయకుండా సంతకాలు పెట్టించుకోవడం.

రిజర్వేషన్ల ఆంతర్యం గ్రహించనంతవరకూ, తమపై వారి పెత్తనం ఏంటని ప్రశ్నించుకోనంత వరకు, పైవారు ఆలోచనతో పెత్తనం చెలాయించడాన్ని ఆపనంతవరకు, ప్రభుత్వం అలాంటి పెత్తందారులపై కఠినమైన చర్యలు తీసుకోనంతవరకూ వ్యవస్థ ఇలాగే వుంటుంది.

రిజర్వేషన్ దళితులకు... అందునా స్త్రీకైతే ఆమె భర్త... ఆపై ఊరి పెద్దలు ఎలా పెత్తనం చెలాయిస్తారో చూపిన కథ 'నీళ్ళు'.

'మల్లిక'ను సర్పంచ్‌గా నిలబెట్టి గెలిపించారు. ఆమె ప్రమేయం లేకుండానే ఆమె తాగుబోతు భర్తను పక్కన పెట్టుకుని ఊరేగింపు జరుపుకున్నారు. మనసులో ఎక్కడో బాధ వున్నా ఇవన్నీ ఇక్కడ సహజమని, అందుకు అంతకు మునుపు సంఘటనలే నిదర్శనమని అనుకుంటుంది. తమకేదో చేయాలని వున్నా చేయనివ్వరని, ఇంతకు మునుపు నిలబెట్టి గెలిపించిన రమణమ్మ చచ్చేంత వరకూ రాళ్ళు కొట్టి ఎలా బతికిందో గుర్తు చేసుకుంటుంది.

ఈ ఎలక్షన్లు దళితులను గుర్తించాయని, ఎక్కడో వున్నవారిని వెతుక్కుంటూ వచ్చి పేర్లు రాయించుకుని, అప్పుడే మనకు ఇంటి పేరు వచ్చిందని ఆనందపడుతుంది. ఆ వెంటనే ఈ ఎలక్షన్లు కలిసి మెలిసి వున్న తన వాళ్ళ మధ్య చీలికలు తెచ్చాయని బాధపడుతుంది. దీని వెనుక పెద్దల హస్తముందని గ్రహించలేకపోయింది పాపం.

అడవికి పోయి, కట్టెలు తెచ్చి, కలుపు తీసి, నీళ్ళు మోసి, మొగుడి దగ్గర తన్నులు తిన్న ఆ మల్లిక తన వాళ్ళకి నీటి సౌకర్యం, మరుగుదొడ్ల సౌకర్యం కల్పించాలని పంతం పట్టింది. ఎన్నో శక్తులు అడ్డుపడుతున్నా ఎం.ఎల్.ఎ.ని కలిసింది. రాజమ్మ సహాయంతో ఊరందరినీ తీసుకుని కలెక్టర్ వద్దకెళ్ళింది. తమ సమస్యలు, పరిష్కార మార్గాలు తెలుసుకోలేనంత అమాయకులు కాదు. దళిత స్త్రీలని తెలియచెప్పింది.

గవర్నమెంట్ అన్ని సౌకర్యాలు కల్పిస్తున్నా మధ్య నున్న వాళ్ళు తమదాకా వాటిని రానివ్వడం లేదని బాధపడుతుంది. అందుకు కారణం లేకపోలేదు. ఆ ఊరి పెద్ద నారాయణరెడ్డి వాళ్ళకు మేలు చేస్తున్నట్లే కేసుల్లో ఇరికించడం, విడిపించడం. వాళ్ళని తన చెప్పుచేతల్లో పెట్టుకోవడం. వాళ్ళ సమస్యలు సమస్యలుగానే ఉండాలి. తాము వాటిని తీరుస్తున్నట్లే ఉండాలి. లేకుంటే వాళ్ళు తమ మాట వినరని భయం. "ఈ మాల మాదిగ ఎదవలన్నంతా యిట్టా సీట్లలో కూర్చోబెడితే యిట్నే కొమ్ములొస్తాయి" అని మల్లిక తన ప్రమేయం లేకుండా ఎం.ఎల్.ఎ. దగ్గర కెళ్ళినందుకు అక్కసునంతా వెళ్ళగక్కాడు. ఆమె భర్తను రెచ్చగొట్టాడు. పెద్దోళ్ల 'రాజకీయాల'ను అర్థం చేసుకోలేని ఆమె భర్త "మొగుడి మాటంటే కూడా లెక్క లేకపాయె" అని చితకబాదాడు.

"మనం చెయ్యలేంది ఈ ఆడెదవ, అదీ కులం తక్కువదీ ఏంది చేసేదని" అగ్రకులస్తుల అంతరంగాన్ని విప్పి చెప్తుంది. ప్రయత్నం ఆపనందుకు భర్తపై తప్పుడు కేసు పెట్టారు... చివరకు మనిషినే లేకుండా చేశారు. అయినా ఆమె ఆశ చావలేదు. కోరిక తీరలేదు. తమ్ముడి సహాయంతో ఎలాగోలా పైపులు తెచ్చి ఊళ్ళో దింపింది. ఆక్రోశించిన రెడ్డి మనుషులతో దాడి చేయించాడు. ఆ దాడిలో తన చెయ్యి, తమ్ముడి కాళ్ళూ పోయాయి. కలలు తప్ప ఏం మిగలలేదు.

"మొగుడు పాయె, మానం పాయె, ముసలి అత్త పాయె... చెయ్యి కూడా పాయె?" అని తన మొండి చేతిని తడుముకుంది. మారని మనుషుల్ని, ప్రభుత్వాన్ని పెద్దోళ్ళ కుతంత్రాలు తనకు చేసిన అన్యాయాల్ని తలచుకుని కుమిలిపోయింది.

మల్లిక సర్పంచైనా ఊరు మారలేదు. నీళ్ళు రాలేదు. ప్రపంచంలో 'గాలి' ఆక్రమణలకు గురి కాలేదు కాబట్టి పైపుల్లో 'గాలి' మాత్రం వస్తోంది.

ఒంటరిదైన ఆలోచనల్లో మునిగిన మల్లికకు "మహిళలు సామాజికంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందాలంటే వారికి చట్ట సభల్లో రిజర్వేషన్లు కల్పించాల్సిన అవసరం వుంది. మహిళలు సాధికారత మూలంగానే మహిళాభివృద్ధి జరుగుతుంది" వంటి మాటలు ఉపన్యాసాలకే పరిమితం. అందుకు సాక్ష్యం తన మొండిచెయ్యిని తడుముకుంది.

నిజంగా అట్టడుగున కష్టాలనుభవించిన వాళ్ళు ప్రజోపయోగకర పనులు చేయాలనుకుంటే, పెత్తందారీ శక్తులు వాటిని ఎట్లా నీరుగారుస్తాయో, ఆలోచనలు అగ్ర కులస్తుల కాళ్ళ కింద ఎలా నలిగిపోతాయో ఆర్ద్రంగా వివరించిందీ కథ.

దళితులు, అగ్ర కులస్తులు అంతరానితనానికి మూలాలు తెలుసుకోవాలని కొన్ని కథలు చెప్తాయి. అణచివేత ఇలాగే సాగితే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎదుర్కోవడం తప్పదని మరికొన్ని కథలు హెచ్చరిస్తాయి. శరీరానికి ఆలోచనలు అవసరమని మరో కథ సూచిస్తుంది. అన్నిటికంటే బలంగా రిజర్వేషన్ల లొసుగులను వివరించిందో కథ. ఈ కథల్లో దేనికది ప్రత్యేకమైంది. సమాజానికి ప్రతిబింబం కథ అన్న నిరూపణ చేసేవీ కథలు. ఈ విషయంలో రచయిత సఫలీకృతులయ్యారు. కథ సమాజాన్ని మారుస్తుందన్నది యథార్థమైతే ఆ మార్పును ఆశిద్దాం.

**సెల్ : 9885248649**

**దళితులు, అగ్ర కులస్తులు అంతరానితనానికి మూలాలు తెలుసుకోవాలని కొన్ని కథలు చెప్తాయి. అణచివేత ఇలాగే సాగితే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎదుర్కోవడం తప్పదని మరికొన్ని కథలు హెచ్చరిస్తాయి. శరీరానికి ఆలోచనలు అవసరమని మరో కథ సూచిస్తుంది. అన్నిటికంటే బలంగా రిజర్వేషన్ల లొసుగులను వివరించిందో కథ. ఈ కథల్లో దేనికది ప్రత్యేకమైంది. సమాజానికి ప్రతిబింబం కథ అన్న నిరూపణ చేసేవీ కథలు. ఈ విషయంలో రచయిత సఫలీకృతులయ్యారు.**

# ప్రపంచీకరణ, పరాయీకరణ

- పి. కుమారస్వామి



"మనిషి మట్టి పరిమళాన్ని కోల్పోయాడు / ప్రాణ పరిమళాన్ని కోల్పోయిన/ఒట్టి కాగితం పువ్వు మనిషి" - మల్లెల నరసింహమూర్తి (మట్టిగొంతుక)

ఇలా మనిషి కోల్పోయిన సహజ స్వభావాన్ని కవులు గుర్తించినంతగా ఎవరూ గుర్తించలేకపోయారు. మనిషి తన సహజ స్వభావాల్ని కోల్పోవడం పరాయీకరణ. ఇది ప్రపంచీకరణ ప్రారంభమయ్యాక ప్రస్ఫుటంగా కనిపించింది. ప్రపంచీకరణ ప్రారంభంలో అర్థంకాక అయోమయంలో నున్న కవులు, కళాకారులు, రచయితలు ప్రపంచీకరణ సునామీ తరువాత పరాయీకరణను బాగా గుర్తించారు. తమ రచనల్లో ఒక నోస్టాల్జియాతో, ఒక ఆవేదనతో, ఆక్రందనతో మనిషి కోల్పోయిన దాన్ని వ్యక్తీకరించారు.

పరాయీకరణ భావనను మొట్టమొదట ప్రవేశపెట్టిన వ్యక్తి హెగెల్. మానవుడు తన పరిణామ క్రమంలో ప్రకృతి నుంచి తాను ఏర్పరచుకున్న ఆధ్యాత్మిక భావాల నుండి వేరుపడటం మొదలైనప్పటి నుంచి మనిషి పరాయీకరణ ప్రారంభమైందని హెగెల్ భావించాడు.

హెగెల్ తరువాత పరాయీకరణ భావనను ఒక ఖచ్చితమైన పద్ధతిలో వాస్తవిక దృష్టితో చెప్పినవాడు మార్క్స్. మనిషి తన శ్రమను తన జీవనం కోసం అమ్ముకుంటాడు. ఇది అనివార్యమైంది. అంతేకాక పెట్టుబడిదారుని ఉత్పత్తి పెంచేందుకు తన శ్రమను పూర్తిగా ధారపోస్తాడు. అయితే తాను ఉత్పత్తి చేసే వస్తువుపై అతనికి ఎలాంటి అధికారం ఉండదు. పైగా దాన్ని ఉపయోగించుకునే పరిస్థితి, అవకాశం అతనికి ఉండదు. ఆ వస్తువును తయారు చేయడం అతడు బుద్ధిపూర్వకంగా చేస్తున్న పని కాదు. కేవలం యాంత్రికం. ముఖ్యంగా పెట్టుబడిదారీ వ్యవస్థలో ఈ పరిణామం అనివార్యమవుతుంది. ఈ నేపథ్యంలో మనిషి (శ్రామికుడు) ప్రకృతి నుంచి తన నుంచి తన వర్గీయుల నుంచి పూర్తిగా వేరుపడిపోతాడు. ఒక ప్రాణమున్న వస్తువుగా మారిపోతాడు. మనిషన్నవాడు అతనిలో మాయమై పోతాడు. ఇదీ మార్క్స్ పరాయీకరణ భావనకు ప్రవేశపెట్టిన విధానం.

**పరాయీకరణను కవిత్వీకరిస్తాడు కవి ఇలా...** పరాయీకరణంటే అక్షరాల పొడి పదం కానేకాదు / మన ప్రేమలు, మన అనురాగాలు, మన పెనవేసుకున్న ముప్పిరితాడు / ఆత్మీయతల్ని మనకు మనం తెంపేసుకోవడమే / వ్యక్తులమైన మనం వస్తువులోకి రూపాంతరం చెందుతున్నాం.

మార్క్స్ చెప్పిన భావన ప్రస్తుతం మన కళ్ళెదుట ఆవిష్కృతమవుతోంది. చాలామంది కవులు పరాయీకరణను బాగా గుర్తించారు. విభిన్న కోణాల్లో దీన్ని ఆవిష్కరించారు.

భూస్వామిక సమాజంలో మనిషి మనుగడంతా పరస్పరాధీనతలో గడిచింది. భూమిని దున్నాలంటే పలుగూ, పార, నాగలి, పశువులు ఇలా అనేక పనిముట్లు అవసరమయ్యేవి. ఇవన్నీ ఒక వ్యక్తి స్వతంత్రంగా చేయగలిగే పనులు కావు. దాంతో పాటు ఉత్పత్తి శ్రమించే మనిషి మనుగడకు అవసరమయ్యేది. ఉత్పత్తిలో భాగస్వామ్యం, ఉత్పాదన అవసరం మనిషిని పరాయీకరణకు గురిచేసేది కాదు. సమాజంలో మనిషి పాత్ర రైతుగానో, కూలీగానో, చేతి వృత్తి కార్మికునిగానో, రాజుగానో ఉండేది. శ్రామికుల మధ్య సంబంధం పేనిన తాడులాగా బలంగా ఉండేది.

నూతన ఆవిష్కరణలతో యంత్రాల వినియోగం పెరిగింది. ఉత్పత్తి పెంచడానికి ఉపయోగపడింది. శ్రమ దోపిడీని తీవ్రతరం చేయడం తద్వారా పెట్టుబడిదారుడు తన లాభాలను పెంచుకోవడానికి ఇవన్నీ దోహదం చేశాయి. యాంత్రీకరణ పెరిగాక మనుషుల మధ్య వస్తువుల మార్పిడి అవసరం బాగా తగ్గిపోయింది. పారిశ్రామిక విప్లవం తరువాత మనిషి యంత్రాల మధ్య బందీ అయ్యాడు. మనిషి కూడా ఒక జీవమున్న యంత్రం లాగా మార్చబడినాడు.

యాంత్రికత మానవ సంబంధాల్ని పటాపంచలు చేస్తోందన్న విషయాన్ని గుర్తించిన కవి గేరా ఇలా చెబుతాడు తన కవితలో.

మందలో తిరుగుతున్నా / అందరికీ దూరం చేస్తున్న యాంత్రికత / ఒక నిర్లిప్తత / ఒక స్తబ్దత (గోగ్రహణం)

మనుషుల మధ్య ఏర్పడిన అగాధాల్ని గుర్తించిన కవి హృదయం తల్లడిల్లిపోతోంది. వేదనాభరితంగా, ఆక్రోషంగా ఇలా చెబుతాడు కవి కె. శివారెడ్డి.

ఇద్దర్ని కలిపే ఒక అద్భుత శక్తి స్పర్శ ఇద్దరు కలవకుంటే ఏముందిక్కడ ఎడారి తప్ప - (అజేయం)

పై విషయాన్ని అర్థం చేసుకోవడానికి ఒక కార్ల పరిశ్రమను తీసుకుందాం. ఒక కారును ఒక వ్యక్తి స్వతంత్రంగా తయారుచేయలేడు. ఒక విడిభాగాన్ని మాత్రమే తయారు చేయగలడు. దాంతో ఆ వ్యక్తికి తాను కారును చేశానన్న తృప్తి, ఆనందం మిగలదు. ఆ శ్రామికుడు లేకుండా, ఆ విడిభాగం లేకుండా కారు తయారుకాజాలదు. కాని

కారు నిర్మాణంలో పూర్తి బాధ్యత అతనికి లేదు. పైగా ఆ వస్తువును తాను వినియోగించలేదు. దాంతో అతను పరాయీకరణకు గురవుతాడు. అదే మధ్య యుగాలలోనైతే ఒక చేతివృత్తిదారుని చేతిలో ఒక వస్తువు పూర్తిగా తయారయ్యేది. ఆ వస్తువులో అతనికి పూర్తి సంబంధం ఉండేది. తాను ఆ వస్తువును చేశానన్న తృప్తి అతనికి మిగిలేది. ఆ వస్తువుతో అతని సంబంధం పూర్తిగా అతని శ్రమకు, మేధకు సంబంధించినది. మానవుని శక్తియుక్తులు, ఉత్పాదనలు తమ సహజ స్వభావాన్ని కోల్పోవడమే పరాయీకరణ.

యాంత్రీకరణ పెట్టుబడిదారీ విధానానికి ఒక చోదక శక్తి. పెట్టుబడి పెరగాలంటే తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభాలు రావాలి. లాభాలు రావాలంటే ఎక్కువ ఉత్పత్తి, ఎక్కువ అమ్మకం జరగాలి. ఉత్పత్తిని పెంచడానికి కొత్త యంత్రాల ఆవిష్కరణ పెరిగింది. అమ్మకాలు పెరగడానికి సరిహద్దుల్లేని ప్రపంచం కావాలి. ప్రపంచీకరణ దీనికి తోడ్పడింది. వస్తువులు ఎంతగా వినియోగించబడితే అంతగా పెట్టుబడిదారీ విధానం తన మనుగడను సాధించగలదు. అందుకే వినియోగ వస్తువుల మాయాజాలం సృష్టించింది. వినిమయ వస్తువుల పట్ల ఆకర్షణ, అవసరం ప్రజల్లో కల్పించాలి. ఇదంతా జరగాలంటే ఒక భావజాలం ప్రజల్లో ఏర్పడాలి.

**వస్తువులు ఎంతగా వినియోగించబడితే అంతగా పెట్టుబడిదారీ విధానం తన మనుగడను సాధించగలదు. అందుకే వినియోగ వస్తువుల మాయాజాలం సృష్టించింది. వినిమయ వస్తువుల పట్ల ఆకర్షణ, అవసరం ప్రజల్లో కల్పించాలి. ఇదంతా జరగాలంటే ఒక భావజాలం ప్రజల్లో ఏర్పడాలి.**

భావజాలం అంటే ప్రపంచాన్ని గురించి భావన. ఇది కళలు, చట్టాలు, ఆర్థిక కార్యకలాపాల్లో అంతర్గతంగా పనిచేస్తూ ఉంటుంది. ఇది వ్యక్తులను, సమాజాన్ని ప్రభావితం చేస్తూ వుంటుంది. భూస్వామిక భావజాలం పూర్తిగా అంతరించాలంటే పెట్టుబడిదారీ భావజాలం పెరగాలి. పెట్టుబడిదారీ విధానం పునాది వస్తు వినియోగం విస్తృతం కావడం మీద ఆధారపడింది. నీది నువ్వు చూసుకోమని చెబుతుంది. వ్యక్తిగత పురోగమనం ప్రధానమని చెబుతుంది.

ఈ భావజాలాన్ని ప్రజల్లోకి తీసుకెళ్ళడానికి మూడు మార్గాలను ఎంచుకున్నారు. మొదటగా ఇలాంటి భావాల్ని సులభంగా తీసుకెళ్ళడానికి టీవీ సీరియళ్ళు, ప్రకటనలు మొదలైన ప్రసార మాధ్యమాలను ఉపయోగిస్తున్నారు. రెండోది పాలకుల ద్వారా ఈ భావాలు సత్యమని ప్రకటింపచేస్తుంటారు. మూడోది రకరకాల పథకాలతో ఎరవేయడం.

భావాలు ప్రజల్ని మార్చుతాయి. ఆచరణకు పురికొల్పుతాయి. పాలకవర్గాల భావజాలం ప్రజల భావజాలంగా చెలామణిలో ఉంటుంది. దీన్ని మార్క్స్ గుర్తించారు. భావజాలాన్ని చెలామణిలో ఉంచగలిగే అద్భుత సాధనం మీడియా. వినిమయ సంస్కృతి ప్రబలంగా పెరిగే కొద్ది ప్రజల్లో పరాయీకరణ సహజం. ప్రతిది సరుకుగా మారి కొనడం, అమ్మడం సాధ్యమయ్యే చోట పరాయీకరణ సర్వత్రా ఉంటుంది. శ్రామికుల శ్రమ ఒక సరుకుగా మారిపోతుంది. ఈ వ్యవస్థలో శ్రామికులు సమిష్టిగా పనిచేస్తూ పరాయీకరణకు గురయ్యే విచిత్రమైన పరిస్థితి ఏర్పడుతుంది. శ్రామిక వర్గం ఈ వినియోగ వస్తువులు మాయాజాలంలో చిక్కుకుపోయారు. బయటపడేందుకు శతవిధాల ప్రయత్నిస్తోంది శ్రామిక వర్గం. మన దేశంలో ఈ సంస్కృతి పెరగడానికి దోహదపడిన అంశం ప్రపంచీకరణ. ఈ ప్రపంచీకరణ పెట్టుబడిదారీ దేశాల లాభాల దురాశ ఫలితంగా ఏర్పడింది. ప్రపంచీకరణ అంటే ఏమిటి? అనే వాళ్ళు బహుకొద్దిమంది మాత్రమే. దీన్ని విశదం చేస్తున్నాడు ఎండ్లూరి సుధాకర్ తన కవితలో ఇలా. 'ప్రపంచీకరణ అంటే ఏమిటి? / ఎక్కడుంది, ఏదీ చూపించమని నా అమెరికా మిత్రుడడిగాడు /నిండు గోదారి పక్కన / నీళ్ళ పొట్లాలమ్ముకుంటున్న పనిబాలున్ని చూపించాను /కొ బ్బ రి బోండాలమ్ముకుంటూ కోకోకోలా తాగుతున్న / కోనసీమ కొబ్బరి వ్యాపారిని చూపించాను / పెరుగు, పాలు అమ్మాక పెప్సీ సేవిస్తూ / సెల్లు మాట్లాడుతున్న చల్లనమ్మను చూపించాను' **(ప్రపంచీకరణ)**

ప్రపంచీకరణ మనిషి పరాయీకరణ కావడానికి ఇతోధికంగా దోహదం చేస్తోంది. కానీ మొదట్లో ప్రపంచీకరణ వల్ల చాలా మేలు కలిగిందని చాలామంది మేధావులు భావించారు. ముఖ్యంగా రైల్వే రిజర్వేషన్, టెలిఫోన్ సౌకర్యాలు, బ్యాంకుల లావాదేవీలు సులభతరం కావడం మొదలైనవన్నీ చూసి ప్రపంచీకరణ వల్లనే ఇలా జరిగిందని సంబరపడ్డారు. తదనంతర పరిణామాల్తో అందరూ కలవరపడ్డారు. పల్లెలు ధ్వంసమయ్యాయి. చేతివృత్తులు అదృశ్యమయ్యాయి. మనిషి మనిషికి మధ్య సంబంధాలు క్షీణించాయి. కలసి మాట్లాడుకోవడం కరువైంది. 'పల్లె కన్నీరు పెడుతుందో కనిపించని కుట్రల/ తల్లీ బందియై పోయిందో కనిపించని కుట్రల...' అంటూ గోరేటి వెంకన్న ప్రపంచీకరణానంతర పరిణామాలను తన పాటలో వ్యక్తీకరించారు.

పల్లెకున్న తనదైన సంస్కృతిని విధ్వంసం చేసింది. ఒక జాతిని లొంగదీసుకోవడానికి వారి సంస్కృతి పరాయీకరించబడాలి. నగరీకరణ, వ్యాపారం, మార్కెట్ స్వేచ్ఛ, దేశీయ సంస్కృతిని పెనుమార్పులకు గురిచేశాయి. సంస్కృతిలో మార్పులకు బదులు మొత్తం ప్రపంచ దేశాల సంస్కృతిని ఏకం చేయడానికి పెట్టుబడిదారీ వినిమయ సంస్కృతి కృషి చేసింది.

ఇదంతా పడమటి గాలి పని. అదే లాటిన్ అమెరికన్‌ల గాలి మనల్ని నిద్రలేపింది. పోరుబాటు పట్టించింది.

తన దారిన తాను పోయే తత్వం, పక్క మనిషి పట్ల మానవతా దృష్టి లోపించడం కేవలం ఆ వ్యవస్థలో ఒక లక్షణం. అందుకేనేమో నాళేశ్వరం శంకరం ఇలా తన కవితలో చెబుతాడీ విషయాన్ని.

ఇప్పుడు ఎవరిలోనైనా ఆత్మ వుంటే కదా / కొనుక్కోవడానికి మనుషులు దొరికేది / ఇప్పుడు మనుష్యుల మధ్యన మమకారముంటే కదా / దానికి అస్థిత్వం సంపద అలవడేది. (ఒక విపత్కర పరిస్థితి – ఒక అంతర్మథనం)

మనిషి తన మనుగడ కోసం శ్రమను నమ్ముకుంటాడు. తన శ్రమ కేవలం అమ్ముకోవడానికి, తన అవసరాలను తీర్చుకోవడానికి ఉపయోగపడుతుంది. కానీ తన శ్రమచే తయారైన వస్తువు తన అధీనంలో ఉండదు. పైగా పూర్తిగా తన శ్రమతో ఆ వస్తువు తయారు కాజాలదు. దాంతో మనిషి సమూహం నుంచి వేరుపడి ఒంటరి

# సాహితీ స్రవంతికి స్వాగతం

- మాల్యశ్రీ

సెల్ : 9290070043



స్వాగతం - స్వాగతం
సాహితీ స్రవంతి స్వాగతం
మా - సాహితీ స్రవంతి స్వాగతం!

సారభూత వారసత్వ
పురోగమన విరాజితకు
సువిశాల శుభోపేత
నవతా సమతా సరితకు

కందుకూరి - గురజాడల
పదముద్రల పథగామికి
శ్రీశ్రీ - జాషువా ప్రభృత
నవచేతన నాదానికి

కార్మిక - కర్షక జనతా
కళ్యాణాంకిత భవితకు
ప్రళయ ప్రపంచీకరణము
ప్రతిఘటించు నవసవితకు ॥స్వాగతం॥

కులమత భేదాతీతపు
ప్రజాస్వామ్య ప్రభావితకు
సార్వజనిక జగదంతర
మానవతా కేతనముకు ॥స్వాగతం॥

సమధర్మపు ప్రబోధినికి
యుగధర్మపు ఉదయినికీ
కళాశిల్ప కళ్యాణికి
సందేశపు కావ్యానికి

నవభారత కవిశక్తికి
సమ సమాజ అభివ్యక్తికి
తెనుగుదనం తేజస్సుకు
తెలుగు వెలుగు ఉషస్సుకూ
॥స్వాగతం॥

తాడిత పీడిత గీతికి
అధోజగతి జనవాణికి
సురుచిర స్వేచ్ఛాధారికి
విశ్వశాంతి విభావరికి
॥స్వాగతం॥

---

అవుతాడు. ఇలా ఒక జంతు స్థాయిలోకి కుదించబడతాడు. అంటే తన ఆలోచన శక్తిని కోల్పోతాడన్నమాట.

అదే సమయంలో డబ్బు సమాజంపై ఆధిపత్యం వహిస్తుంది. అది దేనినైనా కొనగల శక్తిగా తయారవుతుంది. డబ్బుకున్న లక్షణాలన్ని డబ్బు గల వ్యక్తికి సంక్రమిస్తాయి. సంపన్నుడు ఒక డబ్బు శక్తిగా మారిపోతాడు. ఒక మనిషి వ్యక్తిత్వం అతనికున్న డబ్బు మీద ఆధారపడి వుంటుంది. డబ్బున్న కురూపి ఒక సౌందర్యవతిని కొనుక్కోగలడు. అంటే డబ్బు కురూపి లక్షణాన్ని తీసివేసిందన్నమాట. అలాగే డబ్బున్న కుంటివాడు ఒక విమానాన్నే కొనగలడు. ఎందుకంటే డబ్బు అవిటితనాన్ని తీసివేసింది కనుక. డబ్బున్న దుర్మార్గునికి, అవినీతిపరునికి గౌరవ మర్యాదలు అందుతాయి. ఎందుకంటే డబ్బు చాలా మంచిది కాబట్టి, అది ఉన్న మనిషి కూడా చాలా మంచివాడుగా చెలామణీ అవుతాడు. డబ్బు విలువే మనిషి విలువ.

పరాయీకరణ నుంచి మనిషి బయటపడే ప్రయత్నంలో డబ్బును ఆశ్రయించుతాడు. సంపద పెంచుకోవడం ద్వారా తన ఒంటరితనాన్ని పోగొట్టుకోవాలని ప్రయత్నం చేస్తాడు. డబ్బుంటే చాలు అన్నీ వస్తాయనే భ్రమ ఏర్పడుతుంది. అందుకే బిల్‌గేట్స్, టాటా బిర్లాలు, వారెన్ బఫెట్స్ ఆదర్శవంతులు. జీవితాల్ని త్యాగాల్ని చేసిన పొట్టి శ్రీరాములు, గాంధీ, లాల్‌బహదూర్‌శాస్త్రి, కామ్రేడ్ సుందరయ్య, వీరేశలింగం పంతులు లాంటి వారు వెనుక వరుసలోకి వెళ్ళిపోయారు. కవయిత్రి డా॥ జె. అనూరాధ తన కవితలో ఈ విషయాన్ని ప్రకటించిందిలా.

'భార్య కడుపులో పెరిగే పిండం / మరో బిల్‌గేట్స్ కావాలని సంకల్పం / కాబోయే అమ్మా నాన్నలకి / ఈ తలపే సగం బలం' ( **కంచె మేసిన చేను)**

పరాయీకరణలోంచి మనిషి బయటపడటానికి శతవిధాల పోరాడుతాడు. ఊపిరి సలపని ఒంటరితనాన్ని ఏవగించుకుంటాడు. మనిషి ఉక్కిరిబిక్కిరిలోంచి బయటపడేందుకు నిరంతరం తపన పడతాడు. అంతర్మథనం చెందుతాడు. కవి కారం శంకర్ దీన్ని గుర్తిస్తాడు తన కవితలో ఇలా...

నా కలల లాంతరు వెలుగులో / కాసింత ప్రేమను పంచే ఆత్మీయుడి కోసం / మనుషుల్ని ప్రేమించే మనిషి కోసం / వెతుక్కుంటున్నాను. - **(జారవిడుచుకున్న స్వప్నాల కోసం)**

వ్యాపారాత్మక సమాజంలో మనిషి ఎందుకు ఒంటరి అవుతాడో పైన పేర్కొన్నవన్నీ రెండు శతాబ్దాల క్రితమే మార్క్స్ చెప్పినవి.

మనిషి సమూహంలో ఒంటరిగా మారడం పరాయీకరణకు పరాకాష్ట. దీన్ని అధిగమించుకోవడానికి మనిషి పరిచయాలు పెంచుకుంటాడు. సంపద పెంచుకోవడం తద్వారా తన ఉనికిని కాపాడుకోవడం మొదలైన పద్ధతులు అవలంభిస్తాడు. తన ఒంటరితనాన్ని, అభద్రతలను అధిగమించే ప్రయత్నం చేస్తున్నాడు. తోటి మనుషుల్ని ప్రేమించే తత్వాన్ని నేర్చుకునే ప్రయత్నం చేస్తాడు.

ఇలా తనలో కోల్పోయిన మట్టి పరిమళాన్ని తిరిగి పొందేందుకు తోటి మనుషుల్ని ప్రేమించడం మొదలు పెడతాడు. తోటివారి కోసం తానూ పోరాటంలోకి వస్తాడు. పలమనేరు బాలాజీ తన కవితలో ప్రేమ పరిమళాన్ని వ్యక్తీకరిస్తాడు.

ఓర్పులేని వాడెప్పుడూ / ఓదార్పులేడు / దయలేని వాడెప్పుడూ / పోరాడలేడు / ప్రేమించే వాళ్ళదే జీవితం / ప్రేమించే వాడే పోరాడతాడు.

మానవీయ విలువలు లోపించిన ప్రస్తుత సమాజంలో వాటిని పునరుద్ధరించడం కోసం మనిషి తన సంఘర్షణ ద్వారా పరిష్కరించుకుంటాడు. భ్రమల్నించి బయటపడటానికి మనిషి తన సమిష్టి లక్షణాన్ని సాధనం చేసుకుంటాడు. సమాజంలో జరిగే దోపిడీని మనిషి తాను సమైక్యంగా ఎదుర్కోవాలనే స్పృహ పెరిగే కొద్దీ పరాయీకరణను అధిగమిస్తాడు. అప్పుడే మనుషుల మధ్య ప్రేమ పుష్పాలు వికసిస్తాయి. అందుకనే ప్రేమ, శ్రమ కలగలసిన ఆచరణ ద్వారా పరాయీకరణను అధిగమించవచ్చని ప్రముఖ రచయిత ఎరిక్‌ఫ్రామ్ అభిప్రాయపడ్డారు.

**సెల్ : 9490122229**

## మార్గదర్శి

- గోపగాని రవీందర్
సెల్ : 9440979882



శిల్పాన్ని శిలలోంచి చెక్కినట్లుగా
వేణువును వెదురులోంచి మల్చినట్లుగా
దీపాన్ని ఒత్తిలోంచి వెలిగించినట్లుగా
ఆలోచనలను అక్షరాల్లోంచి సృజించారాయన!

మానవ సమూహం మీద
అచంచలమైన నమ్మకం
బహుముఖాల జీవన యానంలో
దరికి రానీయని నటన
ఊపిరినిచ్చిన కన్నవారి ముందు
ధనధాన్యాలు దిగదుడుపే
నిరంతరం విశ్వాసాన్నే శ్వాసించి
అవిశ్వాసాన్ని శాసించిన నిగర్వి!

వాయువు ద్వారా ఆయువును
నది ద్వారా కాలువను
సూర్యుని ద్వారా సుప్రభాతాన్ని
రైతు ద్వారా పంటను పొందినట్లుగా
ఉద్యోగాన్ని ఉద్యమంగా సాగించి
మానవీయ పథాల్ని పరిచిన మార్గదర్శి!

మీ తత్వం ఖచ్చితత్వం
మీ మనస్తత్వం సమానత్వం
మీ నైజం అర్థించడాన్ని నిరసించడం
మీ విజయం ఆర్జించే చేయూతనివ్వటం
మీ బలం పని చేయటం
మీ బలగం పనిచేసేవారంత
మీ మాటలు విజ్ఞానపు విత్తనాలు
మీ జీవితం అలుపెరుగని గీతం!

జ్ఞాపకాల పుట్టను తవ్వుకోటానికి
నాకు రెండు నిమిషాల సమయం
కోరుకోవటానికో, ఎన్నుకోవటానికో
ఈ నూటిరవై సెకండ్లు లేవు
నరనరాల్లో అల్లుకుపోయినా
ఆత్మీయ పలకరింతల మూటను
విప్పుకునే అదృష్టం ఈ గడియలది
వృధా చేసి దుఃఖ పడలేను!

ఆవరణలో నడిచిన దారుల్ని గూర్చి
చుట్టు పర్చుకున్న గాలుల్ని గూర్చి
భావాలను అందుకున్న శిష్యుల్ని గూర్చి
ఒక్కొక్కటిగా తలుచుకునే కాలం
కనుమరుగవుతున్న తలంపుల తడిని
హృదయ పొరల్లో భద్రపరుస్తా
అందుకే నాకు కేటాయించిన
రెండు నిమిషాల్ని జారనివ్వను
మీ స్ఫూర్తిని మరువను

---

## వెలుగు జెండా

- నూనెల శ్రీనివాసరావు
సెల్ : 9032883206



మిత్రమా!
హఠాత్తుగా త్రుళ్ళిపడినప్పుడో
పాడు కలతో వణికిపోయినప్పుడో
అప్రయత్నంగా "అమ్మా" అనే
గుండె భావనను ఏమార్చి
మరో పదాన్ని పలుకగలవా!

ఊహించని దృశ్యంతో
హృదయం ద్రవించినప్పుడో
కనులు చెమర్చినప్పుడో
వణికే పెదవిపై
ఉబికే పదాలు
ఏ స్వరాలో చెప్పగలవా?

బ్రతుకు పోరాటం
నిన్నే తీరాలకు విసిరేసినా
అక్కడ జనాల పెదాల
పదాల పట్టులో కొట్టుకుపోతున్నా

కష్టసుఖాల రంధిలో
అనురాగబంధాల సంధిలో
నీ మెదడు పొరల్లో
లోలోపల అలజడుల్లో
ఎగిసిపడే భావావేశాలు
ఏ శబ్ద తరంగాలో
కాస్త విన్నావా?
బహుశ...
వినే కోరిక
కనే తీరిక
నీకు లేకపోవచ్చు -
కాని ఒక్కక్షణం

నీలోకి తొంగిచూడు
అక్కడి అక్షరాల స్పర్శ చూడు
తేనెలూరు తేట చూడు
నీకు పట్టిన మైకం వదిలిపోతుంది
నీ ఉనికి
వ్యక్తిత్వం
ఘనమైన సంస్కృతితో
ముడిపడ్డ పేగుబంధం
తెలియవస్తుంది
మాతృభాష హృదయఘోష
వినిపిస్తుంది -
నిన్నో శిఖరంలా

జాతి గుండెపై నిలిపి
శిథిలమైపోతున్న
మన ప్రాచీన వైభవం
నీలో కలవరం పుట్టిస్తుంది -

గత స్మృతిలో
సంగీత సాహిత్యాలు
భువన విజయాలు
అంబరాన్నంటిన సంబరాలు
నీ మనోవీధిలో ఉయ్యాలూగి
నీ అడుగుజాడలు
ఏ కన్నీటి ఆనవాలో
పుటలు పుటలుగా గుర్తుకు వస్తుంది-

పశ్చాత్తాపం
శిరస్సు వంచగా
తెలుగు తల్లికి ప్రణమిల్లి
రేపటి తరాల వెలుగు జెండాగా
నీ పయనం మొదలౌతుంది

కథ

# కేరమ్మ కథ



- వేదుల కామేశ్వర శర్మ

**పరుగు పరుగున ఇంటికి వచ్చిన నేను ఆతృతగా గదిలోకి వెళ్ళి చూశాను. పసిపిల్లలా నిద్రపోతోంది బామ్మ. టైము రాత్రి 10 గం॥లు అయింది. "ఏమైంది?" అడిగింది మా ఆవిడ. "బామ్మకెలా ఉంది?" కొద్దిగా కుదుటపడుతున్న మనసుతో అడిగాను. బాగానే వుంది! అంది. "ఏమైనా మందులు వేసుకుందా?" అడిగాను. "లేదు! ఉదయాన్నే రైలు దిగింది. పిల్లలతో రోజంతా ఆడింది. భోజనం చేసి ఇప్పుడే పడుకుంది" అని చెప్పింది నా భార్య. నేను ప్రయాణ బడలిక తీర్చుకుని, భోజనం చేసి పడుకునే ముందొకసారి, మా బామ్మ గదిలోకి వెళ్ళి ప్రక్కనే కూర్చున్నానామె మొహంలోకి చూస్తూ...**

మా బామ్మ పూర్తి పేరు వెంకట మంగతాయారు అలివేలు సూర్యకాంతం కేరమ్మ. 'కేరమ్మ' అనేది వ్యంగ్యమైన బిరుదుతో వచ్చి అతుక్కుని సిసలు పేరై కూర్చుంది. కేరమ్మ ముందంతా ఉన్న పేరుకు కొంతమంది దేవుళ్ళు, కొంతమంది మనుష్యులు కారణమైతే, కేరమ్మ అన్న పేరుకి మాత్రం ఒక చరిత్ర వుంది.

మా బామ్మ చిన్నప్పటి రోజులలో పిల్లలుగా వున్న దగ్గర్నుంచి పెద్దవాళ్ళయినా కూడా రకరకాల కారణాల వల్ల ఆడపిల్లలను బయటకు వెళ్ళి ఆడుకోనివ్వని, తిరగనివ్వని రోజులలో ఆడపిల్లలు ఇంట్లో గచ్చకాయలు, వామన గుంటలు, చెమ్మ చెక్కలు ఆడుకునే రోజులలో మా బామ్మ 'నాయన' ఒక రోజు, ఒక అపురూపమైన 'స్నేహితురాలిని' ఇంటికి తెచ్చాడు. దానిని చూసి మా బామ్మ, ఆమె ముగ్గురు అక్కచెల్లెళ్ళు, ఇద్దరు అన్నదమ్ముల సంబరం అంతా ఇంతా కాదు. ఇంతకీ అది ఒక "కేరమ్సు బోర్డు". ఇక అక్కడి నుండి మొదలైంది మా బామ్మ కేరమ్స్ ప్రస్థానం.

స్కూలుకి వెళ్ళే సమయం, చదువుకునే సమయం, పడుకునే సమయం మినహాయించి మిగతా సమయం అంతా ఆ ఆట ఆడుతూ గడిపేది బామ్మ. చెల్లెళ్ళు, స్నేహితురాళ్ళు, అన్నదమ్ములు ఎవరూ ఆడకపోతే ఒకతే కూర్చుని ఆడేది. ఎలా గురి నేర్చుకుందో గాని, మధ్యవేలుని, బొటన వేలుని విష్ణుచక్రంలా మడిచి విడిచిపెడితే స్ట్రైకర్ ఎంత క్లిష్టమైన కాయిన్‌ని అయినా చాలా చులాగ్గా పాకెట్‌లో పడేసేది.

మా బామ్మకి దుడుకుతనం, ఉడుకుమోత్తనం రెండూ కూడా ఎక్కువే. తెలివిగా ఆడటం, అవసరం అయినపుడు అవతలవాళ్ళ పిక్కలు (కాయిన్స్) లేపేయడం చేసేది కాదు. అది చేతకాని ఆట. నిజమైన ఆటగాడు ఆడే ఆట కాదు అనేది. డిఫెన్స్ అసలు ఆడకపోవడం వల్ల ఎంత బాగా ఆడినా ఓడిపోయేది. కోపంలో పిక్కలు అందరి మీదకి విసిరేసేది. అలిగి అన్నం మానేసేది. మా బామ్మ, ఆ ఊరిలో మిగతా పిల్లల పోరు వల్ల మరిన్ని కుటుంబాలలో కేరమ్స్ బోర్డులు వెలిశా(గా)యి. పండుగ సెలవులలో, ముఖ్యంగా వేసవి సెలవులలో, మధ్యాహ్నం అలసిన పెద్దలు పడకునే సమయంలో అలుపు, ఎండ ఎరుగని బయటకు పంపబడని వేళల్లో, ఇళ్ళ పెరళ్ళలో, మామిడి తోపులలో, పిల్లల మధ్య పోటీలు జరిగేవి. ఆ పోటీలకు కూడా కర్త మా బామ్మే. క్రమేపీ మా ఊరి పిల్లల్లో తిరుగులేని ఆటగత్తెగా అయింది మా బామ్మ.

కానీ మా బామ్మ చివరికి పెద్దగా గెలిచేది కాదు. గెలిచిన వాళ్ళు "తొండి" ఆట ఆడేరు అనేది. ఉడుక్కుపోయేది. మళ్ళీ కొన్నాళ్ళు తరువాత తనే ఆటకి పిలిచేది. ఉన్నట్టుండి ఒక రోజు నుండి మా బామ్మ కేరమ్స్ ఇంకా బాగా ఆడటం మొదలుపెట్టింది. ఎదుటి వాళ్ళ పిక్కలను తిన్నగా లేపకుండానే అడ్డు తొలగిస్తూ ఆడేది విచిత్రంగా, పిక్కలని, చదరంగంలో పావుల్లా కదిపేది. ఇట్లా ఎలా చేయగలిగేదో ఎవరికీ అర్థం కాలేదు. అప్పటి నుండి గెలవడం బామ్మకి ఒక అలవాటుగా మారిపోయింది.

ఒక రోజున మా "బామ్మ నాన్న" మా బామ్మని బాగా కొట్టి, అరచేతిలో వాతపెట్టాడు. కూపీ లాగితే తెలిసిందేంటంటే – మా బామ్మ స్కూలుకి వెళ్ళే దారిలో ఒక పెద్ద చెట్టు. దాన్నానుకుని చిన్న కిళ్ళీ బడ్డీ వున్నాయి. చెట్టు కింద బడ్డీ పక్కగా పెద్ద కేరమ్స్ బోర్డు ఒక చెక్క స్టాండ్ మీద అమర్చి వుంది. అక్కడ మా ఊరి పహిల్వాన్స్ (కేరమ్స్ ఆటలో) చాకలి సూరీడు, పులిరెడ్డి, మాంసం కొట్టు మస్తాన్, కమ్మరి దుకాణం

పీటర్ రోజంతా ఆడేవారు. అపుడపుడూ మా హైస్కూలు హెడ్‌మాష్టరు, ఆంజనేయులు పంతులుగారూ, మునసబుగారూ, కొబ్బరి వ్యాపారి సాంబమూర్తి రాజుగారు, దేవాలయం ట్రస్ట్ బోర్డు మెంబరు, మోతుబరి, పెద్దినాయుడుగారూ కూడా ఆడేవారు. చాకలి సూరీడు ఛాంపియన్, కేరమ్స్ పహిల్వాన్‌లో మిగతా ముగ్గురికి చాకలి సూరీడు టార్గెట్ అయితే మొత్తం ఊరందరికి టార్గెట్ ఆ మొదటి నలుగురూ. వాళ్ళల్లో ఒక్కళ్ళనైనా ఒకసారైనా ఓడించాలని హెడ్‌మాష్టరు, మునసబు, రాజుగారు, నాయుడుగారూ ఇంకా ఎంతోమంది ఔత్సాహికుల జీవితకాల కోరిక. వారిపై గెలుపుకు ఎంతో ప్రయత్నించేవారు. ఎవరైనా ఆ బోర్డుకు ఒకసారి అతుక్కున్నారో ఇక ఆ రోజుకు ఆ కుర్చీ ఖాళీ అయ్యేది కాదు.

ఇదిలా వుండగా మా బామ్మ అప్పర్ ప్రైమరీ స్కూల్లో జాయిన్ అయిన రోజులలో యాక్సిడెంటల్‌గా ఈ ఆట చూడటం జరిగింది. కుతూహలం కొద్దీ బడినించి వచ్చేటప్పుడు ప్రతీ రోజూ ఒక గంట అక్కడ నిలబడి ఆ ఆట చూసేది. చూసి ఆ ఆటలో మెళకువలు చాలా నేర్చుకుంది.

ఒకరోజున ఎందుకో ఎవరూ ఇంకా రాక ఒక్కడే బోర్డు వద్ద కూర్చున్న చాకలి సూరీడు నిలబడి చూస్తున్న మా బామ్మని చూసి "ఏమ్మా! ఆడలేవా!" అని అడిగాడట. తలూపి కూర్చున్న మా బామ్మ సరదాకి ఆడిన ఒక బోర్డుని, అబ్బురపడి, ముచ్చటపడి చాకలి సూరీడు ఆడిన ఫుల్‌గేమ్‌ని గెలిచేసిందట. ఇది తెలిసిన మా బామ్మ నాయన "అడ్డమైన ఆటలూ చూస్తున్నావా? పైగా జూదంగా ఆ ఆట ఆడేవాళ్ళతో ఆడటం కూడానా? అని చితక్కొట్టి, చేయి మీద వాత పెట్టాడట. అంతేకాదు. ఇంట్లోని కేరమ్స్ బోర్డును విరిచి పొయ్యిలో పెట్టి, మళ్ళీ ఎక్కడైనా ఆడితే చంపేస్తాను అని వార్నింగ్ ఇచ్చాడుట. ఆడితే ఏంటి? పోనీ ఎపుడైనా మన కుటుంబం అంతా కలిసి కేరమ్స్ ఆడామా? మిగతా చాలా ఇళ్లల్లో లాగ? వాళ్ళందరూ ఎంత సరదాగా ఉంటారో! మనం ఎందుకలాగుండడం? ఎందుకుండగూడదు? అయినా ఆట ఆడితే తప్పేంటి? అని ఎదిరించిందట.

అంతే కేరమ్స్ అంటే పిచ్చి అని తోటి పిల్లలు, పెద్దల కన్నా బాగా ఆడిందని పెద్దలు మా బామ్మకి "కేరమ్స్‌మ్మ" అని పేరు చివర తగిలించారు. అది కాలక్రమేణా "కేరమ్మ"గా మారిపోయింది. ఇది మా బామ్మ ఏడవ తరగతి చదువుతూ ఉండగా జరిగింది. ఆ ఆట, చదువు కాలమాన పరిస్థితుల వలన ఆగిపోయాయి. పెద్ద కూతురు కాబట్టి పెళ్ళి, ఆ తర్వాత బాధ్యతలు ఒకదాని తర్వాత ఒకటి. కాని మా బామ్మకి కేరమ్స్ ఫాసినేషన్ పోలేదు. తన పిల్లలనాడు భర్తకి భయపడినా, మనమల నాడు అది వెలికి తీసింది. ఖరీదైన బోర్డు ఒకటి ఇంట్లో పెట్టించి, రోజూ కుటుంబం అంతా కలిసి ఒక గేమ్ అయినా ఆడాలని శాసనం చేసింది. రూపీస్ ఆట కేవలం గురి నేర్చుకోవడానికే పని కొస్తుందని, అది ఎంత సరదాగా వున్నా, అప్పుడపుడే ఆడాలని, గేమ్ ఆడటం వలన సింగిల్స్ అయితే ప్లానింగ్, ప్రత్యర్థి నెదుర్కోవడం, క్లిష్ట పరిస్థితులలో ఎలా యాక్ట్ చేయాలో తెలుస్తాయని, డబుల్స్ అయితే టీమ్ వర్క్, పార్టనర్‌తో అవగాహన (అండర్‌స్టాండింగ్) అలవాటవుతాయని పిల్లలకి చెప్పేది.

టి.వి. చూడాలన్నా, క్రికెట్ మ్యాచ్ చూడాలన్నా ఎవరైనా సరే మా ఇంట్లో ముందుగా కుటుంబ సభ్యులతో కేరమ్స్ బోర్డు ఆడి తీరాలి. మా కుటుంబంలో ఒక గర్ల్స్ సబ్-జూనియర్ (నేషనల్) ఛాంపియన్, ఒక డిస్ట్రిక్ట్ ఛాంపియన్, మరొక స్టేట్ లెవల్ పార్టిసిపెంట్ ఉన్నారు. ఈ మధ్య ఢిల్లీలో ఉన్న మా అన్నయ్య దగ్గరకి వెళ్ళినప్పుడు మా బామ్మ అక్కడ అయిన కారమ్స్ వరల్డ్ కప్ టోర్నమెంట్ చూసి, చిన్నప్పుడు ఇంట్లో పిల్లలు వీధులలో "అలగాజనం" ఆడే ఆట అని అందరూ ఎద్దేవా చేసిన కేరమ్స్ ఈ స్థాయికి ఎదిగింది కదా! అని చాలా సంబరపడింది. అక్కడి చాలామంది ఆటలు చూసి చాకలి సూరీడు, మస్తాన్ ఆడిన ఆట ఎవరూ ఆడటం లేదని పెదవి విరిచింది.

మా బామ్మ మాతో ఎప్పుడూ చెప్పేది. కేరమ్స్ ఆట ఆనందాన్నివ్వడమే కాదు, ఏకాగ్రతని, ఓర్పుని, పట్టుదలని ఒక అలవాటుగా మార్చగలదని, వ్యాయామం లేకుండానే గుండెలో రక్తాన్ని వేగంగా పంప్ చేయగలదని (ముఖ్యంగా పోటీలు ఆడే సమయంలో), కుటుంబంలో సమైక్యతని నింపగలదని, కళ్ళకి డాక్టర్లు చెప్పే ముఖ్యమైన వ్యాయామాలలో మూడింటిని తేలికగా చేయించగలదని చెప్పేది. శారీరకమైన, మానసికమైన అలసటలను రెంటిని కూడా క్యారమ్స్ ఆట దూరం చేస్తుందని "మా ద్వారా నిరూపించింది" బామ్మ. ఇవాల్టి యాంత్రిక జీవనంలో ప్రతి కుటుంబం టి.వి.ల సమయాన్ని అంతా కాకపోయినా కొంతైనా క్యారమ్స్ ఆటకి కేటాయిస్తే, మానవ సంబంధాలు మెరుగవుతాయని అభిప్రాయపడేది.

బామ్మ చిన్నగా కదిలింది. ఆలోచనలలోంచి బయటకు వచ్చాను నేను. జరిగినదేమిటంటే ఢిల్లీలో బామ్మకి తిరుగు ప్రయాణానికి ముందు గుండెల్లో నొప్పి అనిపించింది. డాక్టర్ (మా అన్న స్నేహితుడు)కి చూపిస్తే కొన్ని మాత్రలు ఇచ్చి ప్రస్తుతానికి వేసుకోమన్నాడు. లేకపోతే చాలా ప్రమాదమన్నాడు. ఊరు వెళ్ళగానే మెడికల్ చెకప్ చేయించమన్నాడు. కాని మా బామ్మ ఆ మాత్రలు అక్కడే మర్చిపోయి రైలెక్కింది. రోజున్నర ప్రయాణం. ఈ విషయం ఆ డాక్టరు అన్నకి, అన్న నాకు చెప్పగానే ఆఫీసు పనులన్నీ వాయిదా వేసుకుని మాత్రలు తీసుకుని ఫ్లైట్ ఎక్కి రాత్రికి ఇల్లు చేరా!

పదకొండు గంటలకు మొబైల్ ఫోన్ మోగింది. ఢిల్లీ డాక్టర్ ఎలా ఉంది? ఆతృతగా అడిగాడు. "బాగుంది" అన్నాను. "మాత్రలేమైనా వేసుకున్నారా?" అడిగాడు. "లేదు" అన్నా.

"మరి" అన్నాడు.

"ఉదయం నుంచి పిల్లలతో గడిపింది. మధ్యాహ్నం అంతా క్యారమ్స్ ఆడింది" అన్నాను.

"ఆడితే" అన్నాడు ఢిల్లీ డాక్టరు.

"నవ్వాను నేను"

"అవతల డాక్టరు బుఱ్ఱ గోక్కునైనా వుండాలి, లేదా నోరైనా తెరిచుండాలి."

సెల్ : 9989177588

- సౌభాగ్య

సెల్ : 9848157909



# విట్టోరియో సెరెనీ

## *(Vittorio Sereni)*

**1913 - 1983**

విట్టోరియో సెరెనీ కవి, రచయిత, సంపాదకుడు, అనువాదకుడు.

ఆయన కవిత్వంలో ఇరవయ్యో శతాబ్దికి చెందిన ఇటాలియన్ చరిత్ర, ఫాసిజం, ఇటలీ సైన్యం ఓటమి పాలు కావడం, యుద్ధానంతర పరిస్థితులు వస్తువులుగా వుంటాయి.

విట్టోరియో సెరెనీ మిలాన్ యూనివర్శిటీ నుంచి 1936లో డిగ్రీ పొందాడు. 1941లో Conrente' అన్న సాహిత్య సమీక్ష పత్రికని కొందరితో కలిసి నిర్వహించాడు. అదే సంవత్సరం 'Frotiera' అన్న మొదటి కవితా సంకలనం తెచ్చాడు. తప్పనిసరై రెండో ప్రపంచ యుద్ధంలో సైన్యంలో చేరాడు.

1943లో మిత్రసేనలకి చిక్కాడు. అల్జీరియా, మొరాకో క్యాంపుల్లో గడిపాడు. ఈ అనుభవాలు అతని రెండో కవితా సంపుటి 'Diariod Algeria'కు వస్తువులయ్యాయి.




యుద్ధానంతరం ఉపాధ్యాయుడుగా, సాహిత్య విమర్శకుడుగా పనిచేశాడు. 1950 మధ్య కాలం నుంచీ 1983లో అతని మరణ పర్యంతం లిటరరీ పబ్లిషింగ్ హౌస్‌కు డైరెక్ట రుగా పనిచేశాడు. పాల్‌వలేరీ, విలియం కార్లస్ విలియం వంటి సుప్రసిద్ధ ఫ్రెంచి, ఇంగ్లీషు కవుల్ని ఇటాలియన్ భాషలోకి అనువదించాడు.

విట్టోరియో సెరెనీ తన అనువాద కవితలకి 'Bagutta Prize' పొందాడు. అతని కవితలు ఇంగ్లీషు అనువాదాల్తో ద్విభాషా సంపుటాలుగా వెలువడ్డాయి.

### వేసవి ఒక్కటే నిజమైంది

వేసవి ఒక్కటే నిజమైంది
ఈ కాంతి మిమ్మల్నందర్నీ ఒకటి చేస్తుంది
ప్రతి మనిషీ తనకోసం ఓ నిత్యహరిత వృక్షాన్ని కనిపెడతాడు
సూటిగా వున్న నీడని, కాంతివంత జలాల్ని కనిపెడతాడు
సరస్సులపై, ద్రోహపూరిత సరస్సులపై
విసుగుపుట్టించే సాలెగూడు ఇంద్రధనుస్సులా కదుల్తుంది
కింద కంచె పక్క కప్పిన వస్త్రంలా ఎర్రటి దుమ్ము
బాటసారి ఒకడు విషాద గీతాన్ని విలపిస్తూ పోతుంటాడు
ప్రతి ఆకూ నిశ్శబ్దంగా వుంటుంది
మరపు ముత్యపు చిప్ప తెరచుకోదు
వాతావరణమంతా శబ్దం చేయకుండా
క్రమశిక్షణకు లొంగి వుంటుంది

- విట్టోరియా సెరెనీ

# ఉదయం చూడని సూర్యులు

- జి. లెనిన్ శ్రీనివాస్
సెల్ : 9959852154

దెబ్బ మీద దెబ్బతో
ఉక్కిరి బిక్కిరి మధ్య ఊపిరి సలపక
అతివృష్టి, అనావృష్టి
ప్రకృతి ప్రకోపాల మధ్య
ఏ యేటికాయేడు ఎదురీత
అడుగంటిన ఆశల సేద్యం (పంట విరామం)
ఆవిరైన ఆలోచనా లోగిళ్ళు
లోకానికి ఆకలి తీర్చే అన్నదాత
ఉరుముల మెరుపుల జడివాన
చలి పులికి చలించక
చుట్టుముట్టిన ఎర్రటి ఎండను
అనేక ఆటుపోట్లను అనుభవిస్తూ..
స్వేదాశృవులు చిందిస్తూనే
రేయింబవళ్ళు రెక్కలు ముక్కలు చేస్తే
కరెంట్ కోతల కష్టాలు
విత్తనాలు మొలకెత్తని ఎక్కిరింతలు
నల్లబజారులో నిలువునా ముంచే ఎరువుల బరువు
సబ్సిడీల నుండి సల్లగా తప్పుకున్న సర్కారు



ఎండిన పంట పొలాలు చూసి
అప్పులపై మిత్తీలు అవహేళన చేస్తే
పెండ్లీడు ఆడపిల్ల గుండె బరువైతే
పిల్లవాడి చదువులకు సర్దుబాటు లేక
ఊబి నుండి ఊరటుందో లేదోనన్న సందేహం
పలుకరించని తొలకరి వాన చుక్క
దిక్కులేక తప్పని ఏరువాక
పుడమి తల్లికి పురిటి నొప్పులు
రైతన్నకు గుండె పగుళ్ళు
చక్రవడ్డీల చట్రబంధంలో దుర్భరం
రైతు కంటిలో తడి తప్ప
పంట మడిలో తడిలేని నేల నెర్రెలిస్తుంటే
ఆశ నిరాశల ఆశనిపాత గుండంలో
వడబడ్డ పిందెల్లా వాలిపోతున్న జీవితాలు
దిగులు గుండెల్లో ఉరితాళ్ళు ఉసిగొల్పుతూ
పురుగు మందుల పెరుగన్నమై
ఆఖరి శ్వాస పంట పొలాన్ని చేరింది
ప్రభుత్వ అచేతనత్వం
గుప్పించిన వాగ్దానాల గుట్టలు
అమలు నోచక ఆచరణ పడకేస్తే
ప్రపంచీకరణ, ఆర్థిక సంస్కరణల అమలులో
మార్పులేని మరో ఉదయం చూడక
అంతమవుతున్న సూర్యులు అన్నదాతలు
సెలవంటూ తనువును బలిపీఠమెక్కిస్తున్న భూతపస్వీకులు!!

# చేతుల కోసం

- సడ్లపల్లె చిదంబరరెడ్డి
సెల్ : 9440073636

గోళం ఊపిరి బిగబట్టి దొర్లుతోంది
గోళం ఊపిరాడక దొర్లుతోంది
గోళాన్ని ఊపిరి దొర్లిస్తోంది
గోళం ఊపిర్ని దొర్లిస్తోంది
ఊపిరి గోళాన్ని - ఊసుల గోళాన్ని
ఆశల గోళాన్ని - అనంత రాసుల గోళాన్ని
చట్టాల సంకెళ్ళతో ఆజ్ఞాపించే నెపాలు
మాటల మాయా పథకాలు
రాశీభూతమై దోచే తపాలు
ఎదిరించే నోళ్ళని రగిలే గుండెల్ని
నూకల చల్లి వలపన్ని భయపెట్టి



ప్రాణాలకు ఎక్కుపెట్టి ఊపిరాడనియ్యక
ఊపిరిడిస్తే ఊపిరి పోతుందని
గోళం నిండా బుడ్డీలు
బిరడాలు బిగించుకొని
తమలో తాము కుదించుకొని
రాకాసి రాళ్ళ పొరల ఒత్తిళ్ళకి
చిలకపచ్చ నాకులు మండే ఇంధనమైనట్లు
బిగించిన పిడికిళ్ళు
అణచిన ఆవేశాలు
ఒక స్పిరిట్టుగా రూపాంతరమై
ఒళ్ళంతా నిండిన బుడ్డీలు
మండడానికి సిద్ధమై
మంటలు చిమ్మడానికి సంసిద్ధమై
ఒత్తినంటించే చేతుల కోసం!!

కథ



# రాయ (ని) లేఖ

- బి. లక్ష్మీనారాయణ

"…. కన్నా… ఎలా వున్నావురా (ఎప్పుడొస్తున్నావురా…) ….”!

"అమ్మా…!"

అవున్రా కన్నా అమ్మనే… యీ అనుబంధానికి దూరాలు… భారాలు కావు కదరా.. కన్నా.

.. .. ..

ఇక్కడ నేను 'కన్నా' అని పిలిచిన వెంటనే ఎక్కడో సముద్రాల అవతల వేల మైళ్ళ దూరంలో వున్న నువ్వు… కేవలం పక్కనే వున్నట్లుగా… 'అమ్మా' అని పలికావే దానికి మీ శాస్త్రవేత్తలు ఏం పేరురా అది… 'టెలిపతీ' యా… అంటున్నారు.

నేను నిన్ను 'కన్నా' అని పిలిచాననీ…నువ్వు 'అమ్మా' అని పలికావనీ… మన ఇరువురికీ తప్ప యింకెవరికి తెలుస్తుందిరా కన్నా… ఏ పేరు పెట్టినా, పెట్టకపోయినా పేరు పెట్టకముందూ… పెట్టిన తర్వాత కూడా… మార్పులేని… ఏమార్చలేని… తేడా రాని మనకున్న ఏకైక పదబంధంరా… తల్లీ బిడ్డల అనుబంధం… అది అమృతమయం కదరా… ఆ పిలుపు…. కన్నా.

నీ రాక కోసం కదరా కన్నా అహర్నిశలూ ఎదురుచూసేది, తలుపులూ మూస్తే నీవెక్కడ బెంగ పడతావోననే ఆదుర్దాతో అహరహం తెరచే వుంటాయి కదరా మన తలుపులు, తలపుల్లో సైతం రెప్పవాల్చని కంటి 'వాకిళ్ళ'లోనే కదరా… నా మకాం. ఎదురుచూస్తూ… చూస్తూ… స్తూ… మన యింటికి… అనుబంధాల కోవెలకి… ద్వారబంధాలు లేనే లేవు కదరా…

అందుకే ననుకుంటా… బంధాలు వదులుకుని మాకు దూరంగా నువ్వు వెళ్ళిపోయావు.

చూశావా కన్నా.. 'తెంచుకుని' అనడం లేదు… 'వదులుకుని' అన్నాను అదేరా 'అమ్మదనం'. కానీ నువు మాకు దూరంగా ఎక్కడో సముద్రాలకు అవతల ఇక్కడ కంటే సుఖంగా వుండొచ్చు. నిజానికి అలా వుండాలి కూడా… కానీ అమ్మ మనసు నీ ఎడబాటుని భరించలేక పోతోందిరా… తట్టుకోలేక పోతోందిరా కన్నా.

నేను 'కన్నా' అని పిలిచినా… నువ్వు 'అమ్మా' అని పిలిచినా… మువ్వల సవ్వడిలా వినిపించేది రాగబంధమే రా కన్నా… అది అనురాగ బంధమే కదరా.

మొన్న నీ స్నేహితుని ద్వారా పంపిన శాలువా కప్పుకుని మీ నాన్న ఎంతగా మురిసిపోయారో ... అంతలోనే ఆ ఆనందపు క్షణాల్లో సైతం కళ్ళల్లో మెరిసిన సన్నటి 'తెర'... అది కన్నీటి తెరేనా. ఆ శాలువాని తడిమి.. తడిమి... చాలాసేపు అలా వొళ్ళో పెట్టుకుని మౌనంగా ఏం ముచ్చట్లు చెప్పుకున్నారో మీరిద్దరూనూ... నేను గమనించకపోతే కదరా కన్నా... చిక్కనైన అనుబంధం దూరమవడంతో... దూరాలు భారమై అసలే శుష్కించిన దేహాలు ఆ 'భారం' మోయలేక మరింతగా కృశించి పోతాయిరా కన్నా...

నీకు తెలియనిది కాకపోయినా ముఖ్యంగా మీ నాన్న బయటకు వెళ్ళే ముందు... చేతి కఱ్ఱ కోసం ఎదురుచూస్తూ... ఎవరైనా తెచ్చిస్తే బాగుండునన్నట్లుగా గుమ్మంలోనే తచ్చట్లాడటం కేవలం యీ దశాబ్దంన్నర కాలంలో వచ్చిన మార్పేరా కన్నా... అది వయసు మీద పడటం వల్ల వచ్చిన అలసటా లేక నీ గురించి ఆలోచనల్లోని తీవ్రతా... మనకు తెలీకపోతే కదా... అయినా సరే... చిన్న అసంతృప్తి.

నీ చిన్నప్పుడు ప్రతీ కృష్ణాష్టమి నాడు మన ఇంటి ముందర నుండి... గుమ్మం వరకూ పాదముద్రల ముగ్గులు పెట్టి... నిన్ను కృష్ణునిగా అలంకరించి వేడుక చేసి ఆనందించినట్లుగానే... యిప్పుడు నేను ప్రతి ఉదయం... అచ్చం అప్పట్లానే ముగ్గులు పెట్టి గుమ్మంలో కూర్చుని నీ పాద ముద్రలతో ఆ ముగ్గులు 'నీలమణులై' మెరుస్తున్నట్లుగా తలంచుతూన్న నన్ను మీ నాన్న ఆట పట్టిస్తున్నారు చూడు కన్నా.



ఇది ఆరోపణ కాదు కన్నా... మీ అడుగుల గుర్తులే ఆ ముగ్గులని నేను వెంటనే అన్నాను కదరా మరి కన్నా... ఎందుకంటే... మన గేటు దగ్గర్నుంచి గుమ్మం వరకూ ఏదో మరచినట్లుగా పదే పదే అటూ ఇటూ నడుస్తూ... తిరుగుతూ... ఎవరికోసమో ఎదురుచూస్తూ నిట్టూరుస్తూ యివన్నీ దేనికి సంకేతాలురా కన్నా...

నీ కోసమే కదరా ఆ నిరంతర ఎదురుచూపు... నీవేమో 'చప్పున' రానే రావు... మరి ఏ క్షణాన నువ్వు వస్తావోనని ఇల్లంతా శుభ్రంగా అచ్చం మా మనసుల్లా పరిశుభ్రంగా శుభ్రయవనికల్లా అహరహం వేచి వున్నామిక్కడ కదరా కన్నా నీ కోసం వేయి కన్నులు చేసుకొని.

నీ కిష్టమని పంపిన కొబ్బరి లౌజు, నువ్వుండలూ, సున్నుండలూ ఎంతో ఇదిగా అచ్చు అమ్మ ఒడిలో పడుకుని అమ్మ చేతి గాజులతో ఆడుకుంటూ చిన్నగా తింటూన్నట్లుగా వుందంటూ ఎంతో మురిసిపోయావని మొన్న డిసెంబరులో కోడలు వసుంధరా, పిల్లలు వాగ్దేవి... పూర్ణేందు శశి వచ్చినప్పుడు చెప్పింది.

పిల్లలిద్దరూ 'పాలబువ్వ' కలిపి పెట్టమన్నప్పుడు అచ్చు నువ్వడిగినట్లే వుంది కదరా కన్నా.

వాగ్దేవి వీణ వాయినస్తాంటే... మీ నాన్న ఎంత మురిసిపోయారనుకున్నావురా కన్నా యింక పూర్ణేందు తన సన్నటి గొంతుతో చేతితో తాళం వేస్తూ... పాడే త్యాగరాజ కీర్తనలూ... అన్నమయ్య పదాలూ... కళ్ళు తిప్పుతూ... పాడేప్పుడు... ఆ పెదిమ వంపు... అబ్బ... కన్నా నువ్వే రెండు 'సమీరా'ల్లా మారి మా దగ్గరకు వచ్చి మా వళ్ళో కూర్చున్నట్లనిపించిందంటే... నమ్ముతావా... కన్నా...

వసుంధర ఎంత ఒద్దికైన పిల్లరా... నిజానికి కూతురు లేని యీ తల్లి మనసు ద్రవించేలా సేవలు చేస్తూ, నీకు తగిన ఇల్లాలురా కన్నా.. అనుక్షణం ఇక్కడున్నన్ని రోజులూ నా కొంగు పట్టుకుని తిరుగుతూ తెలియనివి అడిగి తెలుసుకుంటూ ముఖ్యంగా మీ నాన్నతో సాయంత్రాలు షటిల్ ఆడుతూ మరచిపోయిన జీవితాల్లోని ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ మరలా కనుల ముందుకు తెచ్చిందిరా కన్నా... వసంతం తిరిగొచ్చిందంటే నమ్ము... అయినా ఏదో వెలితి...

నిజానికి నువ్వు దగ్గర లేవనే బాధ తప్పితే భగవంతుని దయ వల్ల మాకు యితర ఏ యిబ్బందీ లేదు.. కానీ నీవు దగ్గర లేవన్నదే కదా అసలు బాధల్లా..

కానీ నీకున్న సమస్యలకు మేం నిన్ను మరింత యిబ్బంది పెట్టకూడదనుకుంటూనే... నీవు లేని వెలితి మమ్మల్ని నిలువ నీయడం లేదు కన్నా...

చాలామంది కొడుకుల కంటే నువ్వు మా కోసం ఎక్కువగానే నిజానికి యింకా తక్కువేనంటావు నువ్వు... ఆలోచిస్తున్నావు మా గురించి... మిగతా వాళ్ళ మాదిరిగా కాకుండా మన ఇంట్లోనే... వుంటూ... మా సేవల కోసమని ప్రత్యేకంగా వొక మనిషిని పెట్టి అహర్నిశలూ మా అవసరాలను కనుక్కొని సేవలందిస్తోంది సుశీల, దూరపు బంధువే అయినప్పటికీ... వాళ్ళ అబ్బాయి చదువు కోసం తను... యీ వయస్సులో మా అవసరాలకు మనమూ... కేవలం పరస్పరాధారిత జీవితాలు మాత్రమేనా మనవి... బంధాలూ... అనుబంధాలూ కేవలం యిక్కడ 'అణు' బంధాలు మాత్రమేనా..

సుశీల కూడా డిగ్రీ వరకూ చదివి వుండటంతో... అన్ని పనులూ చక్కబెట్టి తను కూడా, నువ్వు చెప్పిన మీదట, ఏదో పుస్తకం చదువుతూ... పరీక్షలు రాస్తోంది కూడా... వసుంధరని కూడా ఏవో అడిగి చెప్పించుకుంది కూడానూ. అయినా ఎక్కడో అసంతృప్తి... ఆవేదనానూ...

గడిచిన రెండు దశాబ్దాల కాలంలో నువ్వు కేవలం రెండంటే... రెండు సార్లు మాత్రమే వచ్చావు... కానీ గుడ్డి కంటే మెల్ల మేలన్నట్లు... వసుంధర అంతకంటే ఎక్కువ సార్లు రావడం జరిగింది.

నీ దగ్గర నించి ఫోన్ వచ్చిన ప్రతీసారీ ఎంత ఆనందమో ముఖ్యంగా మీ నాన్న... మొదటి నుంచీ 'అంతర్ముఖుడు' కావడం వలనా... ఏ భావమూ బాధా తనంత తానుగా వ్యక్తీకరించలేని మనిషి

కావడం వలనా... ఆయన మొహంలో ప్రతిఫలించే కాంతి... కేవలం చూడాలి తప్ప చెప్పలేనురా కన్నా... చేతులు వూపుతూ... హాల్లో పచార్లు చేస్తూ... చిటికెలు వేస్తూ... అప్పుడప్పుడు ఏవో విచిత్ర ధ్వనులు చేస్తూ అదంతా ఆనంద ప్రకటనే అంటే నవ్వకురా కన్నా... నేనది గమనించి... చక్కటి కాఫీ కలిపిస్తాను రా కన్నా అప్పుడు... ఆ తర్వాత ఆయనకిష్టమైన వేపుడు బియ్యమూ, గుల్ల శెనగ పప్పూ, వేయించిన నువ్వులూ ఓ కప్పులో పోసి యిస్తాను వెంటనే చిన్నగా నవ్వుతూ వీధి గుమ్మం మీద అటో కాలూ, ఇటో కాలూ వేసుకుని అచ్చం నీకు మల్లే కూర్చుని అవి తినడంలో మునిగి పోతారురా కన్నా... అది చూసి తీరవలసిందే కన్నా.

ప్చ్ ఎందుకో యివాళ మనసంతా నీ జ్ఞాపకాలతో ఉక్కిరి బిక్కిరి అవుతోంది. ఒకోసారి నిర్లిప్తత కూడిన నిట్టూర్పు... మరింతలోనే ఆనంద కెరటమేదో ఉవ్వెత్తున ఎగిసి వడివడిగా ఒడ్డును తాకి విరిగి పడుతూన్నట్లనిపిస్తోందిరా కన్నా...



ప్రతీ యువతీ యువకుడూ మనువుతో భార్యా భర్తలవడమూ తదుపరి కాలక్రమంలో తల్లిదండ్రులవడమూ ప్రకృతి అమరికే కదా... ఆ తర్వాతనే కదా ఆ తల్లిదండ్రులే... అమ్మా నాన్నలుగా స్థిరపడతారు కదా.. మొదటి రెండు దశలూ... జీవన పరిణామ క్రమంలో ఒకదాని వెన్నంటే మరొకటి ఏర్పడతాయి లేదా జరుగుతాయి కానీ మూడో దశ వుందే... అదే తల్లిదండ్రులు... అమ్మానాన్నలు అవడమనేది చాలా ముఖ్యమైనది. అందుకు ఆయా దంపతుల నేపథ్యమూ వారి వారి ఆలోచనా సరళి... పరిధీ... సాంఘిక పరిస్థితులూ కూడా దోహదకాలే... యిదే విషయాన్ని వసుంధరకు చెప్తుతుంటే విస్మయంగా చూస్తూ ఎంతో ఆప్యాయంగా నా చేయి పట్టుకుని నిమురుతూ... నే చెప్పినది ఆకళింపు చేసుకుంటూ... నాకేసి ఆరాధనగా చూస్తూ... తన కృతజ్ఞతా భావాన్ని మౌనంగా కేవలం తన చూపులతో... కూర్చుని వినే భంగిమతో... అది చాలురా కన్నా...

ఎన్నోసార్లు కన్నా... నువ్వు మమ్మల్ని అక్కడకు రమ్మనమని అడిగావు... అలిగావు... కానీ కన్నా ... మా మనసులు దానికి లేదా అందుకు అంగీకరించట్లేదు ఎందుకు... ఏమో మాకే తెలీదేమో... కానీ... ఏదో యిదీ అని చెప్పలేని భావం మాత్రం మా మనసులను నియంత్రిస్తోందేమో... నాకు తెలీకపోవచ్చు కానీ ఎందుకో మనస్కరించట్లేదు అనేది మాత్రం నిజం... నిన్ను మాత్రం ఇబ్బంది పెట్టాలని కాదురా కన్నా... నీ మాటను ఖాతరు చేయలేదని భావించకురా కన్నా...

పైగా నిన్నే మా దగ్గరకు... లేదా యిక్కడకు వచ్చేయమంటున్నాం... ఎందుకని... నిజానికి నీకు మా అవసరం ఎంతుందో... మాకు నీ అవసరం కూడా అంతే కదా... యింత చిన్న విషయం ఎందుకు అవగతం కావట్లేదు మా మనసులకు.

చాలాసార్లు మధ్యాహ్నం వేళల కాస్సేపు నిద్రపోయిన అనంతరం మీ నాన్న వాలుకుర్చీలో కూర్చున్నప్పుడు వేయించిన కందిపప్పుని ఎంతో యిష్టంగా తింటుంటారు కదరా కన్నా... పక్కనే నేను కూడా కూర్చుని ఏదో వత్తులు చేయడమో, బియ్యం బాగు చేయడమో లాంటి పనులు చేయడం చూసిన వసుంధరా, పిల్లలు ఎంత ముచ్చట పడ్డారు కన్నా... అంత వీలూ సమయమూ అక్కడ వుండవు కదరా కన్నా.. ఆసక్తీ, అనురక్తీ వున్నా సరే సరిపడని వాతావరణంలో మనుగడ ఎంత కష్టసాధ్యమో తెలీకపోతే కదూ కన్నా...

పైగా భవిష్యత్తుకై మొరలు సాచి ఎదురు చూసే తరం మీది... మరి మాది వాస్తవానికి వర్తమానమే ఆగిపోయిన వాళ్ళం కాదూ... అయినా... మా మాట మీరు మాత్రమే వినాలనే తాపత్రయం లేదా పంతం ఎందుకూ... ఏమో... అసలు మా తరమే అంతేనేమో... ఏమో రేపు మీరు కూడా అట్లాగే మాట్లాడతారేమో... యిప్పుడు చెప్పలేం...

బహుశా యిదేనేమో తరాల అంతరమంటే.. అయినప్పటికీ... ఎన్నో ప్రయాసలు పడి మంచి భవిష్యత్తు కోసమంటూ అహరహం కష్టపడుతూ మన ఉనికి కోల్పోకుండా పరిస్థితులకూ,... వాతావరణానికీ... అనుగుణంగా... మనలను మనం తీర్చిదిద్దుకుంటూ మరో పక్క అమ్మా నాన్నలనూ, వారి బాగోగులనూ తదుపరి తనూ... తన పిల్లలూ.. వారి భవిష్య పథక రచనా... క్రమంలో మరింతగా నలిగిపోతూ అందులోనే ఆనందం వెదుక్కుంటూ... వెదుక్కుంటూ... చాలాసార్లు... ఇటు అమ్మానాన్నలనూ వారి వారి ఆశలనూ తదనుగుణంగా మారలేక... వీలులేక లేక కాదు వీలుకాక.. మరో పక్క నిత్యకృత్యంలో ఎన్నెన్నో సమస్యలతో సతమతమవుతూ తలమునకలవుతూ కూడా ఎవ్వరి కోసం యీ సమరం... యీదులాట అంటే... సమాధానం కోసం వెతుక్కోవలసిందేనేమో...

చాలామంది "ఎందుకీ జంఝాటాలూ... బాదరబందీలూ యీ వయస్సులో హాయిగా కృష్ణా... రామా... అనుకోక" అంటుంటారు.

నిజానికి మేం చేసేది అదే కదరా కన్నా... కృష్ణా అన్నా... రామా అన్నా... నీ తలపే కదరా... కృష్ణుడైనా.. రాముడైనా... నీ జ్ఞాపకాలే కదరా.. అందుకే ననుకుంటా.. దేవుళ్ళ పేర్లు పిల్లలకు పెట్టుకోవడం...

అయినా అసలు దీనికంతటికీ ఆదిమూలం మాత్రం మరలా 'అమ్మే' కదా అంటే ప్రకృతే.. కదా...

అందుకే తల్లిదండ్రులందరూ... అమ్మా నాన్నలు కావాలనేది... దాంట్లో వుండే లాలిత్యమూ... అమ్మతనంలోని... కమ్మదనమూ... అమ్మదనం మాత్రమే...! అది ఆస్వాదించాలిరా కన్నా... అదే ప్రకృతి అమరిక... అప్పుడే ఉగాది... మానవాళికి... కదరా కన్నా... కన్నా...

కళ్ళు చెమర్చుతూండగా... కళ్ళజోడు తీసి... పైట కొంగుతో శుభ్రం చేస్తూ అమ్మ... అవును అమ్మే... అమ్మ...

■

# శ్రుతిమించిన మతభాష్యం




అనమానతలు అమానుషాలతో నిండిన హిందూ మతఛాందసాన్ని ఖండించవచ్చు గాని క్రైస్తవ ఇస్లాం మతాలు మిగిలిన వాటికన్నా చాలా గొప్పవని అనడం నిరాధారం. దేని చాందసం దానిది. అలాగే భారతీయుల చరిత్రలో సానుకూల అంశాలే లేవనీ కాదు. దేశాల చరిత్రనూ, మతాల పుట్టుకనూ పరిణామాన్ని కదలికలో చూడలేని ఫలితమిది. అసలు మతాల మధ్య తూకాలేసే పని బొత్తిగా అవసరం లేనిది. బుద్ధుడి బోధలు, ఆదిమ బౌద్ధం గొప్పవే కాని తర్వాత మహాయానం పేరిట బౌద్ధ సన్యాసులు రాజభోగాల్లో మునిగితేలారు.

తెలకపల్లి రవి

దేవులపల్లి కృష్ణశాస్త్రి రాసిన ఇది మల్లెల వేళయనీ పాటలో గొప్ప ఆవేదన వుంటుంది. తొందరపడి కూసిన కోయిల కథ అది. తొందరపడి కూస్తే కలిగే అనర్థాలు చాలా వుంటాయి. వ్యక్తిగత జీవితాల్లోనే గాక సామాజికాంశాల్లో అది మరింత నష్టం కలిగిస్తుంది. ఉదాహరణకు కొడవటిగంటి కుటుంబరావు చాలా దశాబ్దాల కిందటే 'కులం గాడి అంత్య క్రియలు' అన్న కథ రాసి పారేశారు. పెట్టుబడిదారీ వ్యవస్థలో పట్టణ సంస్కృతి విస్తరించడం వల్ల కులం దిక్కులేని చావు చస్తుందని ఆయన వూహించాడు. తర్వాత తను తొందరపడ్డానని గ్రహించారు. 'హిందూ మతానంతర భారతదేశం' గురించి కంచ ఐలయ్య కాల్పనిక సిద్ధాంతం అలానే వుంది. మత మార్కెట్ ఛాందసాలను కలిపి రుద్దుతున్న ప్రస్తుత ప్రపంచీకరణ స్వభావం సవ్యంగా గ్రహిస్తే అప్పుడు ఐలయ్య వంటివారు హిందూ మతాంతం గురించి తేలిగ్గా జోస్యాలు చెప్పరు. వర్చ్యువల్‌గాడ్స్ పుట్టుకొస్తున్న కాలం ఇది. గుజరాత్ ఒరిస్సా అడవుల్లో ఆదివాసులను కూడా ఆరెస్సెస్ ప్రభావితం చేస్తుంటే - కొత్తగా నిలదొక్కుకున్న కొన్ని కింది కులాలు అది వరకటి అగ్రవర్ణాలను తలపించేలా ఆధిపత్యం ప్రదర్శిస్తుంటే - ఆఖరుకు అట్టడుగు పొరలోని రెండు కులాల మధ్యన కూడా చిచ్చు రగల్చడంలో పాలక వర్గాలు జయప్రదం అవుతుంటే ఇలాంటి సమయంలో ఆయన హిందూ మతంలో అంతర్యుద్ధం గురించి, అనివార్య పతనం గురించి భ్రమపెట్టడం, ఆ పేరుతో తక్కిన మతాలను నెత్తినెత్తుకోమనడం తనే చెప్పే ఉత్పత్తి కులాలకు మేలు చేసేది కాదు. ఏ మతం ఎప్పుడు పతనమవుతుందనే వూహాగానాల కన్నా వాటిలోని దురాచారాలను దుర్మార్గాలను ఎలుగెత్తి ఖండించడం ముఖ్యం.

ఆకాంక్షలు అంచనాలు కలగాపులగం చేయడం అవాస్తమైన వ్యూహాలకు తద్వారా అవాంఛనీయ వాదనలకు దారి తీస్తుంది. ఐలయ్య భావాలకూ ఆయన విశ్లేషణకు చాలా పరిమితులు, పాక్షికతలు వున్నా అణగారిన తరగతుల పక్షాన అధిపత్య వర్గాలకు వ్యతిరేకంగా అవి ఎక్కుపెట్టబడి వుండటం వల్ల నేను పెద్దగా విమర్శించే పని పెట్టుకోలేదు. అయితే ఈసారి ఆంధ్రజ్యోతి - ఎబిఎన్ ఇచ్చిన అవకాశం దానిపై విస్తృత చర్చకే దారి తీసింది. పునరుద్ధరణ వాదం నుంచి పలు రకాల అపరిపక్వ అవాస్తవ వాదనలు ఈ చర్చలో ముందుకొచ్చాయి. ఏ కులమో తనను వివరాలడగొద్దన్న వీరబ్రహ్మం నుంచి పాలికాపు నుదుటి చెమట, కూలివాని గుండె చెరువు మిథ్యంటావా అని ప్రశ్నించిన శ్రీశ్రీ వరకూ ఎందరో కులాధిక్యతను మెట్ట వేదాంతాన్ని సవాలు చేశారు. కనుక హిందూమతం లేదా బ్రాహ్మణవాద అహంభావాలనూ దారుణ వివక్షలనూ నిరసించడంలో ఏ మాత్రం తేడా వుండాల్సిన అవసరం లేదు. ఎలా చెప్పారన్నది కూడా పెద్ద సమస్య కాదు. కాని పరస్పరం పొందిక లేని అంశాలను ఏకరువు పెట్టి మతాల పేర్లను జోడించి ఏదో భవిష్యత్ చిత్రణ ఇవ్వడమే సమస్య.. ఉత్పత్తి కులాల ఉన్నత సంస్కృతిని కీర్తించడం సరే గాని ఉత్పత్తి సాధనాలైన భూమి చిన్న తరహా యంత్రాలు వగైరాలపై ఎవరి యాజమాన్యం వుందనేది కూడా పట్టించుకోకపోతే తర్కం దారి తప్పిపోతుంది. భారత దేశంలో బ్రాహ్మణులైతే మరోచోట రోమన్ కులీనులు, మరో చోట క్రైస్తవ మతాధిపతులు, ఇంకా మరోచోట ముల్లాలు మౌల్వీలు.... ఎవరైతేనేం? మతాల పేరిట జరిగిన మహాపచారాల మౌలికతత్వంలో తేడా ఏమీ వుండదు. మౌఢ్యం ఏ ఒక్క మతం సొత్తు కాదు. ఆ మాటకొస్తే హిందుమతం ఏకీకృత రూపం కాదు గనకే ఎవరు ఎంత గింజుకున్నా వైవిధ్యానికి కొంత ఆస్కారం వుండిపోయింది. అదేమీ గొప్ప కాదు.

అనమానతలు అమానుషాలతో నిండిన హిందూ మతఛాందసాన్ని ఖండించవచ్చు గాని క్రైస్తవ ఇస్లాం మతాలు మిగిలిన వాటికన్నా చాలా గొప్పవని అనడం నిరాధారం. దేని చాందసం దానిది. అలాగే భారతీయుల చరిత్రలో సానుకూల అంశాలే లేవనీ కాదు. దేశాల చరిత్రనూ, మతాల పుట్టుకనూ పరిణామాన్ని కదలికలో చూడలేని ఫలితమిది. అసలు మతాల మధ్య తూకాలేసే పని బొత్తిగా అవసరం లేనిది. బుద్ధుడి బోధలు, ఆదిమ బౌద్ధం గొప్పవే కాని తర్వాత మహాయానం పేరిట బౌద్ధ సన్యాసులు రాజభోగాల్లో మునిగితేలారు. ఇప్పుడు దలైలామా పాత్ర ఏమిటి? ఆదిమ క్రైస్తవం విప్లవాత్మకమైందే కావచ్చు. కాని తర్వాత తనను అణచివేసిన రోమన్ రాజ్యాధినేతల పంచనే చేరి అది తన మౌలిక స్వభావం కోల్పోయింది. ఇస్లాంలో బహు భార్యాత్వం (నలుగురు భార్యలకే పరిమితం చేశారని కితాబు!) పురుషాధిక్యత వంటి లక్షణాలను చూడకుండా ఐలయ్య దానిలో ఉదార

# నవ్య కెరటం

- డి. కృష్ణయ్య

ఎగసిపడే కెరటాన్ని
నడిచే నావకు చుక్కాని
జోరున వీచే సోయగాలనీ
గలగల పారే సెలయేరునీ
నవ సమాజ నిర్మాణానికి దిక్సూచినీ!
సంద్ర అలలోని తిమిరాన్ని
పగడపు దీవులోని ముత్యాన్ని
తుషారంలోని ఉషస్సుని
సమస్త ప్రాణులకు ఆక్సిజన్‌నీ!!



ఉషోదయానికి జడివానను
వాడిపోతున్న మొగ్గకు పత్రహరితాన్ని
రోగగ్రస్తుల పాలిట ఆంటిబయాటిక్స్‌ని
దాహార్తి నోళ్ళకు సేదతీర్చే సముద్రుని!
పీడితుల పట్ల వేగుచుక్కని
దుఃఖార్తుల కన్నీళ్ళ చారికల్ని తుడిచే ఆప్తునీ
కామాందుల యడ రుధిర రౌద్రాన్ని
కుల మత ఛాందసాల్ని చెండాడే కలం యోధునీ!!
అవినీతి చీడనాలిచే ఆరుద్రను
ప్రపంచీకరణ రాకాసిని దహించే జమదాగ్నిని
రణ ఝురి గీతాన్ని - ఆర్ధ్రత హృదయాన్ని
ఎట్టి బతుకులోంచి ఉట్టిపడ్డ మట్టిబిడ్డని
మానవీయతను పంచే నవ్య కెరటాన్ని!!!

---

నైతిక లైంగిక నియమాలున్నాయని సూత్రీకరించడం అర్థరహితం. కాస్తో కూస్తో భౌతిక పరిజ్ఞానానికి సంబంధించిందిగా పరిగణించబడడమే వాత్స్యాయన కామసూత్రాలు గ్రంథంపై అంత ఆగ్రహం కూడా అవసరం లేనిదే. శృంగారం పాపం అన్న దేశాల కన్నా దానికి కూడా పవిత్రత ఆపాదించిన ఈ దేశ సంప్రదాయ, జానపద విజ్ఞానాలు విలక్షణమైనవి. తర్వాతి కాలంలో ఇది స్త్రీలను కించపర్చేదిగా మారడం మరో అంశం.

ఇక వర్తమాన ప్రపంచ పరిణామాలను కేవలం మతం బట్టి విశ్లేషించడం మరింత విపరీతం. చమురు కోసం అమెరికా అరబ్ దేశాలపై దురాక్రమణలు చేస్తుంటే దాన్ని ఇస్లాం క్రైస్తవ మతాల ఘర్షణగా ఐలయ్య చిత్రించడంలో అమెరికన్ మేధావి హంటింగ్టన్ చెప్పిన నాగరికతల యుద్ధం వాదనకు ప్రతిధ్వనిగా వుంది. క్రైస్తవ ప్రపంచం ఉదార ప్రజాస్వామ్య విధానాలను అనుసరించినందువల్ల అత్యంత శక్తివంతమైందిగా అవతరించిందనడం సామ్రాజ్యవాద ప్రపంచీకరణను మత భాషలో ఆకాశానికెత్తడమే. చైనా వియత్నాం కొరియాలు బౌద్ధ దేశాలు గనుక సామ్యవాదాన్ని అనుసరించుతున్నాయని సూత్రీకరించేట్టయితే మార్క్స్, మావో, హోచిమన్ వంటి వారు ఏమై పోవాలి? అంబేద్కర్ గొప్పతనం సామాజిక పాత్ర గురించి ఎంతైనా చెప్పొచ్చు గాని ఆయన నవయాన బౌద్ధం తీసుకోవడంతో హిందూమతానికి చావుదెబ్బ తగిలిందని సూత్రీకరించడంలో వాస్తవికత ఎక్కడ? ఇదే శ్రుతి మించిన మత భాష్యం.

అరవిందరావు (మాజీ డీజీపి) వంటివారు హైందవ సంస్కృతి గొప్పతనాన్ని గురించి ఎంతైనా చెప్పొచ్చు. హనుమాన్ చౌదరి వంత పాడొచ్చు కూడా. తిరుపతి కొండపై అవినీతి గురించి స్వామీజీలు పాదయాత్రలు చేస్తుంటే కాస్తయినా ఆత్మవిమర్శ చేసుకోకుండా మిథ్యాకీర్తిని పాడుకోవడం నిరర్థకమే. అయితే అదే సమయంలో చర్చలో కొందరు విమర్శకులు ఆరెస్సెస్ నేతలను మార్క్సిస్టు నేతలను కలిపి బ్రాహ్మణీయ ముద్ర వేయడం కూడా అనుచితం. ఇంగ్లీషు భాష, క్రైస్తవ మతం అమాంతం విముక్తి ప్రసాదించేస్తాయని చెబుతున్న ఐలయ్య వంటి వారు ఆ రెండూ వున్న ఈశాన్య రాష్ట్రాల ప్రస్తుత పరిస్థితికి ఏమంటారు? నిజానికి భారతదేశంలో ఆంగ్లీకరణ, సంస్కృతీకరణ ఏక కాలంలో జరిగాయని ఎంఎన్ శ్రీనివాస్ వంటి వారు సోదాహరణంగా నిరూపించారు. అప్పుడూ ఇప్పుడూ కుల మత వ్యవస్థల కొనసాగింపులో సామ్రాజ్యవాదానికి ప్రత్యేకాసక్తి వుంది. నల్లజాతీయులను బానిసలను చేసి దక్షిణాఫ్రికా ఖండాన్నే చీకటి ఖండంగా మార్చిన సామ్రాజ్యవాదానికి విముక్తి పాత్ర ఆపాదించడం ఎంత విడ్డూరం? ఇప్పుడు ఏకధృవ ప్రపంచంలో దేశీయ ఉత్పత్తులనే నాశనం చేసే ఆ పెత్తనం నుంచి ఎలా కాపాడుకోవాలని ప్రజాస్వామ్యవాదులు ఆలోచిస్తుంటే దాన్ని ఆరాధించడం ఎంత తలకిందులు వ్యవహారం? ఇంకా అనేక అరకొర సూత్రీకరణలు వున్నా ఐలయ్య విమర్శనలో అతి పెద్ద బలహీనత అదే.

కులాల దొంతరలో వివక్షనూ తత్ఫలితాలను అర్థం చేసుకోవడం ప్రతిఘటించడం వేరు. ఆయా కుల పురాణాలే పాడుకొని ఆనందించడం వేరు? చాణుక్యుడు ఆదివాసులపైన కోపంతోనే మౌర్య సామ్రాజ్యానికి చేయూత నిచ్చాడనడం చరిత్రతో పొసిగేదేనా? అనార్య ఆదివాసీ దేవతలను కలిపేసుకున్న అధిపత్య కులాల వ్యూహాలను అర్థం చేసుకోకుండా వారిని నిరంతరం శత్రుపూరితంగానే చూశారని చెప్పడం వాస్తవాలతో పొసుగుతుందా? సమ్మక్క సారక్క జాతరకు ఇప్పుడు కనిపించే ఆర్భాటం చూస్తే అర్థమయ్యేదేమిటి? ఆదివాసీ విశ్వాసాలను కూడా ఆలింగనం చేసుకోడానికి అభ్యంతరం వుండదనే కదా? ఈనాడు ఆదివాసీ ప్రాంతాలను విధ్వంసం చేస్తున్నది ఐలయ్య ఆకాశానికెత్తే పాశ్చాత్య దేశాలు కాదా? మతాల పరిణామాన్ని ఆయా దేశాల భౌగోళిక చారిత్రక నేపథ్యంలో పరిశీలించితేనే సరైన నిర్ధారణలకు వస్తాము. రాజ్యాలను ప్రపంచ సామ్రాజ్యాల పాత్రనూ ప్రభు పురోహిత వర్గాల పాత్రనూ తగు విధంగా అంచనా కట్టకుండా అన్నిటినీ కలగాపులగం చేయడం వల్ల మిగిలేది గందరగోళం తప్ప అవగాహన పెరగదు. ఒకటికి రెండుసార్లు మహానాయకులకు కులాల పేర్లు తగిలించి పిలిచినంత మాత్రాన వారికి పోయేది వుండదు గాని మన సంస్కారం బయటపడుతుంది. దళిత బహుజనుల పేరిట చలామణీ అయ్యేవారంతా వారిని ఉద్ధరించేవారు కాదు. కులం, మతం, ప్రాంతం, లింగం ఇలా ఏదో ఒక్క అంశమే సర్వస్వాన్ని శాసించేట్టయితే చరిత్ర మరోలా వుండేది. సామాజిక ఆర్థిక రాజకీయాంశాల కలబోతే చరిత్ర. సామాజిక శాస్త్రజ్ఞులనమనుకునే వారికి ఆ సమగ్రత మరింత అవసరం.

(ఆంధ్రజ్యోతి సౌజన్యంతో)

# విమర్శ సాహిత్యానికి పరిమితమై ఉండాలి

- ఆదిత్యరెడ్డి

'యజ్ఞంపై మరోసారి' చర్చను ప్రారంభించినందుకు ముందుగా ప్రస్థానం పత్రిక సంపాదకులకు ధన్యవాదాలు. కథ రాసి సుమారు 50 ఏళ్ళవుతున్న తరుణంలో ఒక కథను గురించి మళ్ళీ చర్చిస్తున్నామంటే అంతకుముందు ఆ కథ వేసిన ప్రభావం గొప్పదని అర్థం. అటువంటి కథను ఇవాళ చర్చించడం వలన రెండు ప్రయోజనాలు సాధించవచ్చు. ఒకటి ఆ కథను నేటి తరం పాఠకులకు పరిచయం చేయడం, రెండు ఇవాల్టితరం ఎట్లా ఆలోచిస్తున్నారో తెలుసుకోగలగడం.

నవంబర్-2011 ప్రస్థానం సంచికలో ప్రచురించిన విద్యాసాగర్ వ్యాసంలో ప్రధానంగా పది అంశాల పట్ల అభ్యంతరాలను లేవదీశారు. అవి

(1) కథాకాలం నాటికి దళితులకు భూములు లేవు. రైతాంగ కులాలకే భూమిపై హక్కులు లేని కాలంలో దళితునికి భూమిపై హక్కుందునే ప్రతిపాదనతో కథ మొదలయింది.

(2) ఆ కాలంలో చేనేత కార్మికులకు జరుగుబాటుండేది కాదు. అనేది తప్పుడు నిర్ధారణ.

(3) కథలో, అందరికీ తిండుండేది. అనే సూత్రీకరణ సరైనది కాదు. అది వాస్తవ విరుద్ధమైనది.

(4) వర్గం అనే పదానికి ఈ కథలో సరైన భాష్యం లేదు (వర్గ విశ్లేషణ తకరారుగా ఉన్నప్పుడు తప్పుడు భాష్యాలు, వాటికి తప్పుడు పరిష్కారాలు వస్తాయి).

(5) ఊరులో అంతా బాగున్న కాలంలో అప్పలరాముడు మూడెకరాల భూమి ఎలా కొనగలిగాడు. ఎవరి భూమి పరాయీకరణకు గురైంది. ఎందుచేత?

(6) అభివృద్ధిని వ్యతిరేకించే పేరుతో విద్యను వ్యతిరేకించే పలుకులు పలికించేరు రచయిత, ఒక పాత్ర ద్వారా.

(7) గ్రామం నుంచి బ్రతుకు తెరువుకు పట్టణాలకు వెళ్ళి ఒక నూతన వృత్తిని అన్వేషించే ప్రజానీకాన్ని భయంలో ముంచే ఒక తిరోగమన అంశాన్ని బోధించారు.

(8) ఒక దేశ నమూన ఏ దశల గుండా సాగితీరుతుందనే సూత్రాల పట్ల అవగాహన లేదు.

(9) 1962 నాటికే ఒక గ్రామంలో రియల్ ఎస్టేట్ బూమ్‌ని ప్రవేశపెట్టేరు. హైస్కూల్ వచ్చిన కారణంగా...

(10) పాత్ర (సీతారాముడు) లోకి తప్పుడు చైతన్యాన్ని ప్రవేశపెట్టి తన కొడుకును తానే హత్య చేసుకోవాలనే తప్పుడు మార్గంలోకి మళ్ళించి ఆత్మ విధ్వంస పంథాకు దారి చూపించారు.

ఇవి విద్యాసాగర్ తన వ్యాసంలో లేవదీసిన అభ్యంతరాలు. సహజంగా తరువాత చర్చించదలచుకున్న వారెవరైనా ఈ అంశాల పట్ల ఏకీభావాన్ని ప్రకటించవచ్చు (తనకు వేరే అంశాల పట్ల అభ్యంతరాలుంటే కూడా చెప్పవచ్చు). లేదా ఈ అంశాలు తప్పు అని గనుక భావించినట్లయతే ఎందుచేతో చెప్పి రుజువు చేయవచ్చు. ఇందులో ఏ ఒక్కటి జరిగినా మంచిదే. చర్చ తరువాత కొనసాగుతుంది గనుక.

కానీ దురదృష్టవశాత్తు రచయిత రామతీర్థ వ్యాసంలో అలా జరగలేదు. రచయిత రామతీర్థ తన ఎనిమిది పేజీల వ్యాసంలో ఏమి చెప్పాడో తెలియని గందరగోళ స్థితిని సృష్టించారు. కాసేపు భూమి వుండరాదన్న నియమము ఏమీ లేదు అంటారు. మరి కాసేపటికి "భూమి వున్నా, లేకున్నా, దళితుడున్నాడు, అతను తీసుకున్న అప్పు వుంది" అంటారు. మరికాసేపటికి "ఒకవేళ గణాంకాల ప్రకారం నిజమే అయినా (భూమి లేకపోవడం) కథా కల్పనకు, ఈ డాక్యుమెంటేషన్ ఖచ్చితత్వానికి సంబంధం వుండి వుండాల్సిన అవసరం లేదు" అంటారు. మరొకచోట "కథాకాలం అయిన అప్పలరాముడి యవ్వన కాలానికి ఆయనకు భూమి సొంతదారుగా వుండే అవకాశం లేదు అన్నది కథా గమనానికి తీవ్ర అభ్యంతరం కాలేదు" అంటారు. దేనిమీద నిలకడలేదు. అసలు తాను ఏమి చెప్తున్నానో అన్న 'ఎరుక' కలిగి వున్నారా, వుంటే ఇలా రాయగలిగేవారా అన్నది నా సందేహం. భూమే లేకపోతే కథేలేదన్న విషయం ఆయనకు ఎవరు చెబితే తెలుస్తుంది? ఖచ్చితత్వమంటే ఏమిటో ఈయనకు ఎలా చెప్పాలి? "అప్పు వుంది" అని ఒప్పుకుంటారు, కానీ భూమి వుండనక్కరలేదంటే.. ఈయనకు భూమి గురించి గ్రామీణ భూసంబంధాల గురించిన పరిజ్ఞానం ఏపాటిదో ఇట్టే అర్థమైపోతూనే వుంది.

దానికితోడు అన్నీ తనకే తెలుసన్న అతి విశ్వాసమూ, అహంకారమూ మెండుగా గలిగిన వాగాడంబరత వ్యాసము నిండా కొట్టొచ్చినట్టు కనబడుతూ ఉంటాయి. అవీ చాలవన్నట్టు ఇలా అంటున్నారు చూడండి. "తను రాసింది చదవగానే ఇంత అభివృద్ధి నిరోధకమైన కథా ఇది అన్నట్టు చదివిన వారు తలచాలని విద్యాసాగర్ తాపత్రయం(ట). ఇంకా కొంచెం లోతుగా పరిశీలిస్తే ఈ వ్యాసం కేవలం 'యజ్ఞం' కథ గురించే కాక, తెరిచిన పుస్తకం వంటి కారా మాస్టారి సార్వత్రిక ప్రగతిశీలత, దశాబ్దాల సాహిత్య నిబద్ధత ప్రజలకు ప్రయోజనకరమైన రచనా సంకల్పసిద్ధి, అన్నిటిపై నీలినీడలు ప్రసరించాలని, ప్రశ్న గుర్తులు ఉదయించాలనీ.." విద్యాసాగర్ ప్రయత్నమట. (అబ్బ! ఈయనకు పరకాయ ప్రవేశ విద్యలాంటి పర

# చరితార్ధం

- పామర్తి శివరామకృష్ణ



ఈ ధరణిలో వికసించిన పువ్వులా
పుట్టుక నా జీవితానికి తొలి పయనం
అనంత విశ్వంలో ఉదయించే సూర్యుడిలా
నేర్చుకున్న విద్య ఓ జ్ఞానం
జీవిత గమనంలో విరిగిన వెన్నెల్లా
వివాహ జీవితం ఓ భాగం
నూరేళ్ళ జీవితంలో దినదిన గండంలా
జీవ క్రియలో మరణం అనివార్యం...
అయితే...
వికసించిన పువ్వు వాడుతూ...
ఉదయించిన సూర్యుడు అస్తమిస్తూ...
విరిసిన వెన్నెల క్రమంగా
అమావాస్యగా మారుతుంటే...
నా హృదయంలో నిక్షిప్తమై
కలసిన మన స్నేహం మాత్రం
కలకాలం...
పువ్వుల పరిమళాన్ని... వెన్నెల చల్లదనాన్ని...
ఎల్లప్పుడూ...
మధురంగా వెదజల్లుతూ ఉంటుంది
అందుకే... నేనంటాను
నీతో నా స్నేహ జీవిత బంధం...
చరితార్ధం...

---

మనోపతణ ప్రావీణ్య విద్యేదో వున్నట్టుంది. అందుకు మనమంతా సంతోషించాలి. ఈయన ఇక్కడికి పరిశీలించడం ఆపారు గనుక సరి పోయింది. అలా కాకుండా ఈయనింకా లోతుగా పరిశీలిస్తే విద్యాసాగర్ మొత్తం తెలుగు సాహిత్యాన్ని గురించి ఇంకా ఏమేమి అనుకుంటున్నారో చెప్పేసేవారు. హతవిధీ ఎంత ప్రమాదం తప్పిందో కదా!).

నిజానికి విద్యాసాగర్ వ్యాసం కంటే రామతీర్థ వ్యాసం తోటే కారా మాస్టారిపై 'నీలినీడలు ప్రసరించడానికి' అవకాశం వుంది. ఎందుకంటే విద్యాసాగర్ వ్యాసం కథకు అందులో ప్రస్తావించిన విషయాలకు పరిమితమైంది. అనవసరంగా రామతీర్థే కారా మాస్టారిని మధ్యలోకి లాగుతున్నారు.

మరో విషయాన్ని చూడండి.

"కావాలంటే కథకు అర్థశతాబ్ది పునర్మూల్యాంకనం 2014లో చేసుకుందాం కానీ ప్రస్తుతానికి ఈ కథను ఈ వ్యాసంలో నేనూ, ఆ వ్యాసంలో విద్యాసాగర్ విశ్లేషించి చర్చించాం కనుక ఆ విపులీకరణలను భవిష్యత్‌కై కేటాయించమని'' ఆదేశిస్తున్నారు. (పత్రికను ఆదేశించబూనటం మంచి విమర్శకుడి లక్షణం కాదు కదా). అక్కడికి ఈ వాదన ఇరువక్షాల మధ్య జరుగుతున్నట్టు, విద్యాసాగర్, రామతీర్థ చెరో పక్షానికి నాయకులైనట్టు మాట్లాడటం, ఆరోగ్యకరమైన ఆలోచన అనిపించుకుంటుందా!?...



ఇక విషయానికొస్తే, విద్యాసాగర్ ప్రస్తావించిన ఏ విషయం మీద రామతీర్థకు స్పష్టమైన అవగాహన ఉన్నట్లనిపించదు. విద్యాసాగర్ ప్రస్తావించిన ఏ విషయం తప్పో, ఎందుకు తప్పో చెప్పిన దాఖలాలైతే కాగడా పట్టుకు వెతికినా కనిపించవు. చెప్పిన విషయాన్నే మళ్ళీ మళ్ళీ చెప్పడం, శైలి చదివించకపోవడం ఈ వ్యాసానికి అదనపు లోపాలుగా వున్నాయి.

తన వ్యాసం ప్రారంభంలో రామతీర్థ ఇలా అంటారు. "కథా రచయిత అయిన కాళీపట్నం రామారావు పట్ల కనీస 'ఆదరణ' లేకుండా రాసిన తీరు విస్మయానికి గురిచేసింది." అని అసలు ఒక కథను గానీ దానిలోని విషయాన్ని గురించి గానీ చర్చించేటప్పుడు ఆయా రచయితల పట్ల ఆదరణ గానీ, నిరాదరణ గానీ ఎందుకుండాలో అర్థం కాదు. అది కాళీపట్నం రామారావు గావచ్చు మరొకరు గావచ్చు. వ్యక్తులపై గల ఇష్టాయిష్టాలతో చేసే విమర్శ సాహిత్య విమర్శ అనిపించుకుంటుందా!

జాతీయ అంతర్జాతీయ సాహిత్యంలోంచి కొన్ని పేర్లు ప్రస్తావించి తనొక్కడే అవన్నీ చదువుకొన్నట్టు బహిరంగ బలప్రదర్శన చేయబూనడం, కారా మాస్టారి పట్ల అతి విధేయత ప్రదర్శించడం తప్ప తన వ్యాసంలో ఇంకేమీ చెప్పలేకపోయారు రామతీర్థ. తను ప్రస్తావించిన 'కఫన్' కథ గానీ, 'ది బి లవ్‌డ్' నవల గానీ ప్రస్తుత చర్చకు ఏ విధంగానూ ఉపయోగపడనివే (అసలు యజ్ఞం కథకు పై వాటికి ఏ రకమైన సామ్యము లేదు). ఎవరైనా తనకు తెలియని విషయాల పట్ల కలుగ జేసుకుంటే కలిగే ఇబ్బందేమిటో ఈపాటికి రామతీర్థకు అర్థమయి ఉంటుందనుకుంటాను.

ఇంకొక విషయం "దాదాపు యాభై ఏళ్ళ వయస్సు గల కథ గురించి, అంత వయస్సు లేని యువతరం శ్రద్ధ వహించి తమ అవగాహనను ప్రకటించడం స్వాగతించదగ్గ విషయం" అంటారు. స్వాగతించదగ్గ విషయం అంటూనే "అంత వయస్సు లేని' అని ఎత్తిపొడవడం ఎందుకు? రేపెవరైనా రామాయణ మహాభారతాల గురించి మాట్లాడాలంటే ఆ కాలం నాటి లేదా ఆ కావ్యాల వయస్సు కంటే పెద్ద వయస్సున్న వాళ్ళు రావాలేమో!

రామతీర్థ వ్యాసం మొదటి నుంచి చివర వరకు ఇలాంటి కామెంట్సుతోనే నిండి వుంది తప్ప బలమైన ప్రతిపాదన ఏదీ ప్రతిపాదించలేకపోయింది. అలాగే తన వ్యాసం చివరలో "మన ఉత్తమ రచయితల్ని మనమే నిరసించుకునే ధోరణి వల్ల ఇతర సాహిత్య సమాజాల ముందు చిన్నబోతాము" అని ఒక ఉచిత సలహా.

ఈయనకు నిరసనకు చర్చకు (లేదా విమర్శకు) తేడా తెలియదా అనిపిస్తోంది. నిజానికి చర్చించుకోవటం, విమర్శించుకోవటం (సాహిత్యాన్నే, రచయితలను కాదు) వలన మాత్రమే గౌరవం పొందగలుగుతాము. అంతేగాని, రచనల కతీతంగా రచయితల మీద ఏర్పరచుకున్న 'ఆదరణ' భక్తి లాంటి వాటి వలన ఆ రచయితలకు, తెలుగు సాహిత్యానికి మేలు కన్న కీడే ఎక్కువ జరుగుతుందని రామతీర్థ లాంటి వారు తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

•

# సాహిత్యరంగం తీరుతెన్నులపై మీరేమంటారు?

1. 2011లో మీరు ఏయే నవలలు చదివారు? కథలెన్ని చదివారు? ఏమైనా నచ్చాయా? ఎందుకు? మరీ ఎక్కువగా నచ్చిన వాటి పేర్లు, నచ్చని వాటి పేర్లు?
2. కవిత్వమూ, కావ్యాలు చదివారా? కవిత్వం పట్ల మీ స్పందన ఎలా వుంది?
3. సాహిత్య విమర్శలు గమనించారా? పాలుపంచుకున్నారా? వాటిపై మీ ఆలోచనలు ఎలా వున్నాయి?
4. దినపత్రికల సాహిత్య పేజీలు, ఆదివారం అనుబంధాలు, సాహిత్య పత్రికలు ఏవి ఎక్కువగా అనుసరించారు? ఏవి ఎక్కువగా నచ్చాయి?
5. మొత్తంగా మీ సాహిత్య పఠనం పెరిగిందా? తగ్గిందా? యథాతథమేనా?
6. మీ కుటుంబ సభ్యులు బంధు మిత్రులు సన్నిహితుల విషయమేమిటి?
7. నేడున్న సాహిత్యాభిరుచిపై మీ అంచనా ఏమిటి? చూసిన దాన్ని బట్టి చెప్పండి. (కేవలం మీ అభిప్రాయం కాదు)
8. ఇంగ్లీషులో ఎక్కువగా చదివారా?
9. మీరూ ఏమైనా రాశారా?
10. సాహిత్యేతర పుస్తకాల పఠనం ఏ మేరకు చేయగలిగారు?
11. మీకు తెలిసి వివిధ తరాలు (మీకంటే పెద్దవారు, మీ సమకాలికులు, మీకంటే చిన్నవారు) చదువు పట్ల చూపిస్తున్న ఆసక్తి ఎలా వుంటున్నది?
12. మీరు ఈ ఏడాది ఎన్ని పుస్తకాలు కొన్నారు? అందులో సాహిత్య గ్రంథాలెన్ని?
13. మీరు చదవాలనుకుని చదవలేకపోతున్న దొరకని పుస్తకాలేమైనా వున్నాయా?
14. ఫలానా అంశం ఎవరైనా రాస్తే బాగుంటుందని మీరు అనుకున్న సందర్భాలున్నాయా? ఉంటే ఏమిటి?
15. మీరూ కవులు, రచయితలైతే ఈ ఏడాది మీ రచనానుభవాలు ఎలా వున్నాయి? ఎలాంటి స్పందనలు వచ్చాయి? మీ రచనా ప్రణాళికలు నెరవేరాయా?
16. ఈ కాలంలో సాహిత్య రంగంపై రచయితలుగా మీ అభిప్రాయాలేమిటి?
17. కొత్తగా రచనలు మొదలు పెట్టినవారి అనుభవాలేమిటి?
18. ఇంగ్లీషు తెలుగు గాక ఇతర భాషా సాహిత్యాలతో పరిచయం వున్నవారు చెప్పగలిగిన అంశాలేమిటి? వాటితో పోల్చితే తెలుగు సాహిత్యం పరిస్థితి ఎలా వుంది?
19. సాహిత్య సభలు కార్యక్రమాల తీరుతెన్నులు ఎలా వున్నాయి?
20. స్థానిక సాహిత్య సంఘాల గురించి మీ అనుభవాలేమిటి?
21. మొత్తంపైన తెలుగు సాహిత్యం నేటి పరిస్థితులను సమగ్రంగా సవ్యంగా ప్రతిబింబిస్తున్నదని మీరనుకుంటున్నారా?
22. మీరు చదివే సాహిత్య పత్రికలేమిటి? నచ్చే పత్రికలు లేదా శీర్షికలు ఏమిటి?
23. ప్రస్థానం మీరు ఎప్పటి నుంచి చదువుతున్నారు? ఈ కాలంలో దానిపై మీ అభిప్రాయం ఏమిటి?
24. ప్రస్థానంలో ఇంకా ఏయే మార్పులు ఆశిస్తున్నారు?
25. ప్రస్థానం కోసం లేదా సాహిత్యం కోసం మీరేం చేయగలరు?



## గజల్

- డా॥ ఎం.బి.డి. శ్యామల
సెల్ : 9949774818

నన్ను మార్చి నేను నీవై బతుకు బాగుందంటే ఎలా?
కన్ను పొడిచి వర్ణచిత్రపు వన్నె ఏదంటే ఎలా?

రేకును విప్పదీసి పూవు అందం వెదుకుతావా
అందమంటే హృదయమేనని తెలుసుకోలేనంటే ఎలా?

గాయపడిన గుండె గువ్వకు శాంతి మంత్రం కవిత కాదా
కనుల అశ్రువులూరకుండా వ్రాయి గజలంటే ఎలా?

ఎన్ని రంగులు, ఎన్ని హంగులు, ఎంత గొప్పది సృష్టి వైనం
పక్షినై ఆకాశ వీధుల తిరుగాడవద్దంటే ఎలా?

పారుదల లేకుంటె నీటికి స్వచ్ఛతన్నది సాధ్యపడునా?
కలలు సొంతం చిదిమి కన్నుల కాంతి లేదంటే ఎలా?

## బంజారా నానీలు

- డా॥ సూర్యా ధనుంజయ్
సెల్ : 9849104187

అదే విషాదం!
అవి తల్లిపాలు కావు
తాటికల్లే
నిద్రపుచ్చే మంత్రం

పుట్టింది పెరిగింది
కొండకోనల్లో
బతుకు బండి లాగేది మాత్రం
బస్తీల్లో...



లైట్లు కాదు
మిణుగురులు
అదే నా చదువుకు
వెలుగునిచ్చిన దీపాలు

మెరిసే అద్దం
మోతిబాయి (బంజారా యువతి పేరు) అందం
శ్రామిక సౌందర్యంతో
అది మిళితం

కవిత్వం రాసింది
మట్టి మనిషి
గుప్పుమంటున్నది
దాని పరిమళమే!

జనవరి, ఫిబ్రవరి ప్రస్థానం సంచికలలో 'సాహిత్యరంగం తీరుతెన్నులు' పై అభిప్రాయాలు పంపించవలసిందిగా మేం చేసిన పలువురు స్పందించారు. ఈ సంచికలో ఆ వ్యాసాలను ప్రచురిస్తున్నాం. ఈ శీర్షిక కొనసాగుతుంది. అయితే జవాబులు రాసేప్పుడు ఆబ్జెక్టివ్ పద్ధతిలో గాక స్వయం సంపూర్ణంగా అర్థమయ్యేట్లు రాయాలని మనివి. లేదంటే ప్రతిసారీ ప్రశ్నలు చూడాల్సివస్తుంది.

## విమర్శకోసం విమర్శ కాకూడదు

- డా॥ దుట్టా శ్యమంతక మణి - 9491962638

సాహిత్య రంగంపై, తీరుతెన్నులపై ఓ సమీక్ష నిర్వహించాలను కోవడం అత్యంత అభినందనీయం. ప్రశ్నావళి క్రమంలోనే జవాబులు ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

(a) The Winner stands alone - పాల్ కొయిలో

(b) The Fountain Head - ఐయాన్ ర్యాండ్

(c) ఆంధ్రుల చరిత్ర - ఎం.వి.ఆర్.శాస్త్రి నవలలు చదివాను.

– కథలు ఇంచుమించుగా ప్రతి ఆదివారం అన్ని పత్రికలలో వచ్చినవి. నచ్చిన కథ ఈనాడు 23.10.11 ఆదివారం అనుబంధ కథ "మృత్యుంజలి" నేటి సమాజంలోని పోకడకు దర్పణం ఈ కథ.

– పత్రికలలో వచ్చే కవితలు. యాసలపు సూర్యారావుగారి కవితా సంపుటి "ఆడు మగాడు". చదివిన వాటిలో పెద్దగా ఏదీ స్పందింప చేయలేదు. పల్ప్ రీడింగ్ అనిపించింది.

– సాహిత్య విమర్శలు శ్రద్ధగా చదువుతాను. కానీ పాలు పంచుకోలేదు. "సృష్టి" చేయడం కష్టం. సృజనాత్మకతకు అగ్రపీఠం వేసి పాఠకులను చదివింపచేసే సామర్థ్యం రచయితలది.... దానిని విమర్శ కోసం, విమర్శించడమో, లేదా తమ రచనా సామర్థ్యం నిరూపించుకోవడం కోసం విమర్శించడం అంత సమర్థనీయం కాదు. నిర్మాణ సామర్థ్యం లేనివారు కట్టడాలను కూల్చేయడం లాంటిది - విమర్శ.

– ఆదివారం అనుబంధాలు ఇంచుమించు అన్ని చూస్తాను. సమయానుకూలతను బట్టి చదువుతాను. సాహిత్యపరంగా ఆంధ్రజ్యోతి, భూమి, సాక్షి, ప్రత్యేక అనుబంధాలు.

– ఇంటర్నెట్ వలన వ్యక్తిగత జీవితంలో ప్రాధాన్యతలు పెరగడం వలన గతంలో కన్నా చాలా తగ్గింది.

– సాధారణం.

– రచయితలు పెరిగారు... పబ్లిషింగ్ రంగం కూడా విస్తృతంగా, వ్యాపారాభివృద్ధి కోసం కృషి చేస్తూనే వుంది. పుస్తకాల కొనుగోళ్ళు బాగానే ఉన్నట్లుగా అనిపిస్తుంది.

– చదివాను.

– చేశాను. కథలు, కథానికలు, సమీక్షలు..

– రాజకీయాల గుర్చి ఓ స్థాయిలో పఠనం చేశాను. అది నా వ్యక్తిగత జ్ఞానాన్ని పెంచుకోవడం కోసమే.

– ఎక్కువశాతం దినపత్రికలు పఠనం పట్ల మాత్రమే ఆసక్తి చూపుతున్నారు.

– ప్రతి నెలా రూ. 500/- పుస్తకాల కోసం వెచ్చించాను. అన్ని సాహిత్య గ్రంథాలే!

– (1) సత్యకామ జాబిలి - రచన సి.వి.

– (2) పాకుడు రాళ్ళు - రావూరి భరద్వాజ

– ఇంపార్టెంట్ : అన్ని పత్రికలూ క్రీడల కోసం పేజీలు కేటాయిస్తారు. బట్ అవన్నీ సుగర్ కోటెడ్ పిల్స్. క్రీడా వ్యవస్థ అత్యంత లోపభూయిష్టం. అవినీతికి ఆలవాలం. లోతుపాతులను, లోటులను నిర్భయంగా, నిస్సంకోచంగా వెలికి తెచ్చే రచనలు అత్యల్పం. అలా కొందరురచనలు చేసినప్పటికీ సంపాదకవర్గ సమస్యలేమిటో? ఎవ్వరూ "ఈ వ్యాసంలోని అభిప్రాయాలు రచయితవే" అన్న ఓ కాప్షన్ పెట్టి కూడా ప్రచురించారు. ఇది దౌర్భాగ్యం. బాధాకరం.

– స్పాంటేనియస్‌గా స్పందించడం నా నైజం... చాలా సందర్భాలలో యథాతథంగా ప్రచురితమవుతాయి. ఇ-మెయిల్‌లో రచనలు పంపినా, తిరిగి డెస్క్‌కి ఫోన్ చేస్తే తప్ప ఫాలోఅప్ ఉండదు.

– పత్రికలు కూడా, ప్రాంతాల వారీగా, కులాలవారీగా, మతాల వారీగా, ప్రాంతీయవాదులతో విరాజిల్లుతున్నాయి. కొన్ని పత్రికలైతే "ఆస్థాన రచయిత"లకు తప్ప అన్యులకు చోటు ఇవ్వరు. ఇది అంతర్గత రాజకీయాల పర్యవసానం.

– దాదాపు 10 సం॥లుగా ఈ రంగంలో ఉన్న నాకు కొత్త అనుభవం "జనగానం"కు రచనలు చేయడం.

– పరభాషా పరిచయం ఉన్నప్పటికీ ఈ అంశంపై చర్చించగలిగే సాధికారత నాకు లేదు.

– ఓ ఫార్స్... ఓ బోగస్... నిష్పక్షపాతంగా జరిగేవి తక్కువ... ఈ సం॥ నీకు, ఆ పై సం॥ నాకు... ఇదో తంతు.. టైమ్ వేస్ట్ ప్రాసెస్.

– డబ్బు, సమయం వృథా.

– తెలుగు భాషాభిమానులందరూ వ్యక్తిగతంగానో, సమిష్టిగానో కృషిచేస్తూనే వున్నారు.

– దాదాపు అన్ని పత్రికలు. ఎడిటోరియల్ మరియు లెటర్స్.

– ఇదే తొలి పరిచయం.

– సంపూర్ణంగా చదివితే తప్ప చెప్పలేను.

– రచనలు పంపగలను.

●

## ఎవరి రచనలపై వారు శ్రద్ధ తీసుకుంటున్నారు

- జయంతి పాపారావు- 0891-2557961

– నవలలు చదవలేదు. 80కి పై చిలుకు కథలు చదివాను. చాలా కథలు నచ్చలేదు. స్పష్టమైన దృక్పథం – సమాజం పట్ల ప్రజా జీవితం పట్ల సరైన అవగాహన – వస్తువు పట్ల సమగ్ర దృష్టి – దిశా నిర్దేశం – వంటి అంశాలు చాలా కథల్లో లోపించాయి. శిల్పం అంటే పాఠకుల బుర్ర బరువెక్కించడం కాదని – బుర్రలోకి ఎక్కించడమనీ – చాలామంది గుర్తించలేదు. అయిదారు కథలు నచ్చాయి. చదివిన వెంటనే వాళ్ళకి ఫోన్ చేసి చెప్పాను. వాటి వివరాలు ఇవ్వడం మంచిది కాదు. వ్యక్తివాద ధోరణులు సాహిత్యానికి మంచి చేయవు. అవే నచ్చినవని చెప్పడం వల్ల, ఎందరో చేసిన కృషిని చిన్నచూపు చూసినట్లు అవుతుంది. అది సాహిత్యాభివృద్ధికి దోహదపడదు.

– చదవలేదు. ఏదో చూశాను. అంతే. – సాహిత్య విమర్శలో శాస్త్రీయ దృక్పథం పెరిగింది. – ఇంచుమించుగా అన్నీ చదువుతాను. సాహితీ స్రవంతి – సాహిత్య ప్రస్థానం – ప్రజాసాహితి – నడుస్తున్న చరిత్ర – కొంతవరకు నచ్చుతాయి.

– పెరిగింది.

– ఏదో చదువుతారు. అంతే.

– టీవీలతో విసుగెత్తిపోయి, మళ్ళీ సాహిత్యం వైపు కొంతమంది మళ్ళుతున్నట్లు కనిపిస్తోంది.

– కొంత చదివాను.

– కొద్దిగా రాశాను.

– నాకు నచ్చిన సృజనాత్మక సాహిత్యం రాకపోవడం వల్ల, ఇతర పుస్తకాలు బాగానే చదివాను.

– తెలుగులో రాయాలన్న తపన యువతీ యువకుల్లో కాస్త కనబడుతోంది. అందువల్ల చదువుతున్నారు. ఇంగ్లీషులో మాట్లాడగలిగినా ఇంగ్లీషు మాటలు వాడకుండా, తెలుగులో మాట్లాడలేకపోయినా, ఇంగ్లీషు చదివి అర్థం చేసుకునే స్థాయి కాదు. చాలామందిలో నిజానికి ఇంగ్లీషు బాగా రాదు. అందువల్ల తెలుగు పట్ల ఆసక్తి చూపుతున్నారు.

– ప్రతి నెలా 8 మాసపత్రికలు – రెండో మూడో పుస్తకాలూ కొంటాను. చదివాక ఇంట్లో పోగులు పెట్టుకోలేక కాలేజీలకీ, గ్రంథాలయాలకీ ఇచ్చివేస్తాను.

– ఉన్నాయి. జైన కథా సాహిత్యంపై పుస్తకాలు దొరకలేదు.

– ఆంగ్ల కథన రీతులు – నేటి తెలుగు కథపై ప్రభావం మీద రాయిస్తే మంచిది. కొన్ని వక్రీకరణలు కంటపడ్డాయి. ఎ.వి. రెడ్డి శాస్త్రి , యు.ఎ. నరసింహమూర్తి, అంపశయ్య నవీన్ రాయగలరనుకుంటాను.

– నా గురించి నేను చెప్పుకోవడం నాకు నచ్చదు.

– ఎవరి రచనలపై వాళ్ళు శ్రద్ధ తీసుకుంటున్నారు కానీ, మొత్తం సాహిత్యాభివృద్ధి కోసం ప్రయత్నించడం లేదు. ఆర్థిక ఇబ్బందులు లేకపోయినా, కనీసం పత్రికలూ, పుస్తకాలూ కూడా కొనడం లేదు.

– నాకు తెలిసిన మేరకు కొన్ని ఇతర భాషా సాహిత్యాల్లో – సంస్థలు బాగా పనిచేస్తున్నాయి. ముఠాలుగా చీలిపోలేదు. యువతరానికి సాహిత్యం పట్ల ఆసక్తి కలిగిస్తున్నారు.

– ప్రస్తుతం నేను వెళ్ళడం లేదు. వెళుతున్న వారి ద్వారా విన్నదేమిటంటే అక్కడా ముఠాలే ఉన్నాయట! సాహిత్యం లేదుట!

– సాహిత్యం కోసం పనిచేయడం లేదు!

– లేదు. చాలా వక్రీకరణ జరుగుతోంది.

– సాహితీ స్రవంతి – సాహిత్య ప్రస్థానం – ప్రజాసాహితి – నడుస్తున్న చరిత్ర – కొంతమేరకు నచ్చుతాయి.

– ప్రారంభమయినప్పటి నుంచీ చదువుతున్నాను. చెప్పుకోదగ్గ కథలు రావటం లేదు. వ్యాసాలు మంచివి వస్తున్నాయి.

– వైవిధ్యం వుంది.

– నా సాహిత్య రచనా వ్యాసంగానికే పరిమితమైపోకుండా, సాహిత్యం మొత్తం కోసం నా శక్తి మేరకు చిన్న ప్రయత్నం చేస్తున్నాను. •

---

## నానీలు

- బొమ్మరాత యల్లయ్య
సెల్ : 9494318616

నిన్నా మొన్న
ప్రసవ వేదనం
పచ్చగ నేడు
నవ్వింది విత్తనం

కరకు కత్తి
కన్నీరు పెట్టింది
అమాయకుడిని
అంతం చేసినందుకు

అధికారం లక్ష్యమైన
రాజకీయ వారకాంత
ఎవరికైన ఇస్తుంది
మారాడక కౌగిలింత

ఎన్నిసార్లొచ్చినా
పంచవర్ష ప్రణాళికలు
చిరు వర్షానికే పొంగును
మా వీధి కాల్వలు

తోడెవరు లేకున్నా
నీ నేస్తం పుస్తకం
అజ్ఞానం వదిలేసి
పదునెక్కును మస్తకం



పేగు బంధాన్ని సైతం
పెళ్ళున తెంపేసి
అల్లుకు పోతుంది
ఆర్థిక సంబంధం

కూటి కొరకు పల్లె ప్రజలు
పట్టారు పట్నం బాట
ఓటు కొరకు మన నేతలు
పట్టారు 'పల్లెబాట' ▪

## మంచి రచనలను ఆదరిస్తున్నారు

- బి. ధర్మారెడ్డి

– 2011లో నవలలు చదవలేదు. అంతకు క్రితంవి చదివాను. కథలు చాలా చదివాను. ఈనాడు ఆదివారం ఎడిషనల్‌లో వచ్చే కథలు చదివాను. మేరెడ్డి యాదగిరిరెడ్డి గారి కథలు కొలిమి, మట్టికథలు చాలా బాగున్నాయి. పల్లె ప్రజల బాధలు, ఇతివృత్తాలలో ఉన్న కథలు ఎక్కువ చదివాను అవి నాకు బాగా నచ్చినవి.

– కవిత్వం చదివాను. కావ్యాలు లేవు. కవిత్వం నిత్యనూతనంగా చెప్పదలచుకున్న విషయం సూటిగా చెప్పవచ్చు. సమస్య – పరిష్కారం రెండూ చెప్పవచ్చు.

– సాహిత్య విమర్శలు విన్నాను, సాహిత్య అభిమానిని. కవి సమ్మేళనంలో పాలు పంచుకునే వాడిని. సాహిత్య విమర్శల వల్ల ఎన్నో విలువైన విషయాలు తెలుస్తాయని గ్రహించినాను.

– ఈనాడు, వార్త, ఆంధ్రజ్యోతి పత్రికలలో సాహిత్య పేజీలు చదువుతాను. ఈనాడు, వార్తా, ఆదివారం సంచికలలో వచ్చే కథలు నచ్చాయి.

– మామూలుగానే ఉంది. (ఇపుడు నాకు 73 సం॥లు). ఎక్కువ చదవాలని వున్నా సమయం చిక్కదు. శరీరం సహకరించదు.

– వారు చదువుతారు. కొందరు కాలక్షేపానికి కొందరు, మంచి ఆర్టికల్ అయితే కట్ చేసి దాచుకోవడం చేస్తుంటారు.

– మంచి రచనలను ఆదరిస్తూనే ఉన్నారు. ఈనాడు రాసే కవులు ఎక్కువైనారు. చదివేవారు తక్కువైపోయారా అనిపిస్తుంది.

– హైస్కూల్, కాలేజ్‌లో చదివినపుడు హెచ్.జి. వెల్స్ కథలు ఆసక్తికరంగా వుండేవి. అవి చదవడమే (త్రీ మస్కటీర్స్, స్కార్‌లెట్) మొదలగునవి.

– కవితలు అప్పుడప్పుడు చిన్న చిన్నవి రాస్తాను. అవి పెన్షనర్స్ మూమెంట్‌లో వచ్చేవి.

– సాహిత్యేతర పుస్తకాలు అడపా దడపా చదువుతాను. టి.వి.లలో సాహిత్య కార్యక్రమాలు చూస్తాను. సప్తగిరిలో వెలుగుతోట, హెచ్.వై. టీవీలో ద బుక్, హెచ్ఎంటివి ఛానల్‌లో వందేళ్ళ కథకు వందనాలు, గొల్లపూడి మారుతీరావు వ్యాఖ్యానం ఎంతో ఆసక్తిగా వుంటాయి. (ఈటీవీ 2)లో తెలుగు – వెలుగు మొదలగునవి కార్యక్రమాలు చూస్తాను.

– పెద్ద తరంవారు ప్రాచీన సాహిత్యంపై ఎక్కువ శ్రద్ధ చూపుతున్నారు. ఇప్పటి కుర్రాళ్ళు కొద్దిమంది మాత్రమే శ్రద్ధ చూపిస్తున్నారు. ఏమైనా నాలుగు డబ్బులు సంపాదించే చదువుకే ప్రాధాన్యం ఇస్తున్నారు.

– ఈ సంవత్సరం అంతగా కొనలేదు. సామాన్యంగా సాహిత్య సభలలో పుస్తక ఆవిర్భావం జరిగినపుడు వెళ్తుంటాను. వారు ఫ్రీగా పంచుతారు. అలా యిచ్చినవి చాలా వున్నాయి.

– చలం, గోపీచంద్, శరత్‌బాబువి చదవాలని ఉంది. కాని అవి అందుబాటులో లేవు.

– స్త్రీల వరకట్నంపై, భార్యను బానిసగా చూడటం అనే అంశాలపై రాస్తే బాగుంటుందని అనిపిస్తుంది.

– నేను సాహిత్య అభిమానినే కాని రచనలు చేయలేదు. నాకు చిన్న చిన్న కథలు రాయాలని ఉంది. అది నెరవేరలేదు. రాయడం అంత సులభం కాదని విరమించుకున్నాను.

– నేటి సాహిత్యం మంచిని పెంచే విధంగా, సాంఘిక విలువలు పెంచేవిగా ఉంటున్నాయి.

– రచనలు అంటే చెప్పడం సులభం. దాన్ని ప్రారంభించాలంటే సాహిత్య పఠనానుభవం ఉండాలనిపిస్తుంది.

– తెలుగు – ఇంగ్లీషు గాక ఇతర భాషలు సాహిత్యంతో పోల్చుట సరికాదేమో. దేనికదే ప్రత్యేకత. అయినా మన తెలుగు సాహిత్యం సనాతనమైనది.

– జనాన్ని పిలిచి రప్పించుకొనే స్థితి ఉంది.

– సాహిత్య సంఘాలు ప్రతి జిల్లాకు ఉన్నాయి. అంత బలంగా నడవడానికి అనుకూలత లేదనిపిస్తుంది.

– నేడు సాహిత్యంలో కొంత చీడలు కూడా లేకపోలేదు. వెర్రి వెర్రి కథనాలు కూడా వస్తున్నాయి. ఉదా॥ వై దిస్ కొలవెరి కొలవెరి ఢీ.

– లైబ్రరీకి వెళ్తుంటాను అప్పుడప్పుడు. ఈ రోజుల్లో అనేక సంచికలు వస్తున్నాయి. ఈనాడు, వార్త, ఆంధ్రజ్యోతి, సాక్షి మొదలగు పత్రికలలో వచ్చే కవుల శీర్షికలు నచ్చుతాయి.

– ప్రస్థానం యింతకు క్రితం చూడలేదు. ఈ నెల మేరెడ్డి యాదగిరి రెడ్డిగారు తెచ్చి యిచ్చారు చదివాను. బాగుంది. చందాదారునిగా చేరుతున్నాను.

– 'ప్రస్థానం'లో పాఠకుల లేఖలు, లేక పాఠకుల అభిప్రాయాలు, లేక పాఠకుల స్పందన అని ఒక కాలం ప్రచురిస్తే పాఠకుల అభిప్రాయాలు, వారి స్పందన తెలుస్తుంది.

– ఇంకా కవుల, రచయితల, శీర్షికలు, వారి వారి ఆ నెలలో వచ్చే వర్ధంతి, జయంతి సందర్భాన వారిని గుర్తించడానికి వేస్తే బాగుంటుందనిపిస్తుంది. గురజాడ, గిడుగు రామమూర్తి, కందుకూరి వీరేశలింగం పంతులు, బుచ్చిబాబు, ప్రేమ్‌చంద్ మొదలగు సాహితీవేత్తల గురించి పరిచయం చేసినట్లు వుంటుంది.

# ఒక నవల చదివే సమయంలో ఎన్నో కవితలు, కవితా సంకలనాలు చకచకా చదవొచ్చు

- భాస్కర బాల భారతి రామ్మూర్తి

సెల్ : 9491353544

- 2011లో నే చదివిన రచనలలో నవలలు చాలా తక్కువ. డా॥ పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డిగారి "ఆమె" నవల మాత్రం చదివాను. ఈ నవలలో ధనము అధికమైతే కలుగు దుష్పరిణామము గూర్చి 'ఓ తల్లి ఆవేదనను' గురించి రాయబడినది.

- ఇక కథల విషయానికి వచ్చిన 'కేతు బుచ్చిరెడ్డిగారి ఓ చిన్న కథా సంకలనము "ముత్యాలు - రత్నాలు" చదివాను.

- 'దీపం చెప్పిన కత' ఓ చిన్న కథా సంకలనము చదివాను. ఇందులోని భాష, కథా సంవిధానము ఏమాత్రం నచ్చలేదు.

- నవలలు, కథల కంటే కవితలు, కవితా సంకలనాలను నేను ఎక్కువ యిష్టపడతాను. ఒక నవల చదివే సమయంలో ఎన్నో కవితలు, కవితా సంకలనాలు చకచకా చదవొచ్చు.

- కవితలు, కవితా సంకలనాలు చాలా చదివాను. ఈ కవితా సంకలనాలలో ఎందరో కవుల రచనలు వారి రచనా, వస్తు, భాషా వైవిధ్యాలు తెలుస్తాయి. వారు ఆయా రచనలలో పొందుపరచిన ఫోను నెంబర్ల ద్వారా వారితో పరిచయాలు పెంచుకోవచ్చు. నచ్చిన కవితలను, వెంటనే నోటు బుక్కులో రాసుకుని, అప్పుడప్పుడు చదువుకొని ఆస్వాదించు అలవాటు వుంది. సాహిత్యాభిమానులతో ఆ కవితల గొప్పదనం గురించి చర్చించుకుంటాను.

- గత సంవత్సరం నేను చదివిన కవితలు, కవితా సంకలనాలు చాలానే వున్నాయి.

- డా॥ ఎన్. రామచంద్రగారి సంపాదకత్వములోని సమ ఆధునిక కవితా సంకలనము "సాహితీ సౌరభం" చదివాను. డా॥ దాశరథి రంగాచారిగారి కవితా సంకలనము (కవితా కాదంబరి) మాసకవిత - జనరంగం."

- తమ్మనభట్ల గజాననగారి "మానస సరోవరం" కవితా గేయ సంపుటి.

- డా॥ కేతు బుచ్చిరెడ్డిగారి "ముత్యాలు - రత్నాలు" కథా సంకలనము.

- "వేదగిరి రాంబాబుగారి "పాపం పసివాళ్ళు" 'నూరు మంచిమాటలు" చుండి కృష్ణవేణి గారి కథా సంకలనము. గుర్రం జాషువా రచనలు కావ్యం "రెండవ సంపుటము."

- సాహిత్య విమర్శలు డా॥ కె. యాదగిరిగారి "రాయప్రోలు సౌందర్య దర్శనము" చదివాను.

- సాహిత్య విమర్శలు చదువుటకు ముందే ఆయా మూలగ్రంథాలు చదివిన ఆ విమర్శలపై పూర్తి అవగాహన లభిస్తుంది.

- ప్రతి ఆదివారము వచ్చే దినపత్రికలలోని "ఆదివారం చిన్న పుస్తకాలు, అందులోని సాహిత్యానికి సంబంధించిన అంశాలు చదవడం అలవాటు. అందులో కొత్త పుస్తకాల వివరాలు వుంటాయి. వీలయితే ఇష్టమైన పుస్తకాలు కొని చదివే అలవాటు వుంది. ఎక్కువగా 'ఆంధ్రజ్యోతి', 'ఆంధ్రప్రభ', 'ఆదివారం వచ్చే అనుబంధ పుస్తకాలు' నచ్చుతాయి. 'ఆంధ్రభూమి' మాసపత్రికలో వచ్చు రామాయణ, భారతాలకు సంబంధించి 'ప్రహేళిక' లోని ప్రశ్నలకు జవాబులు రాస్తుంటాను.

- 'సాహిత్య పఠనం'పై అభిమానం దినదినాభివృద్ధి చెందుతుంది.

- మా కుటుంబంలో మా తండ్రిగారు కీ.శే. భాస్కర కేశవయ్యగారు సాహిత్యాభిమాని. కావ్యాలు ఎక్కువగా చదివే అలవాటు వుండేది. భాగవతంలోని కొన్ని నచ్చిన ఘట్టాలు రాగయుక్తంగా చదువుతూ కంఠతా చేసేవారు. ముఖ్యంగా "రుక్మిణీ కల్యాణం" ఘట్టంలోని పద్యాలు, "సౌందరనందనం" పద్యాలు చదివినట్టు యిప్పటికీ గుర్తుంది. పద్యాలు చందోబద్ధంగా చకచకా రాసేవారు. ఆయన సాహిత్యాభిమానం మా కుటుంబంలో నలుగురు, ఐదుగురుకు వుంది.

- నేటి సాహిత్యంలో వివిధ ప్రక్రియలకు సంబంధించిన రచనలు చోటు చేసుకుంటున్నాయి. అందులో గేయాలు, కవితలు, మాత్రాబద్ధంగా, అంత్యప్రాసలు వచ్చే విధంగా చక్కగా కొందరు రాస్తున్నారు. నానీలు, హైకూలు, కాలం కవితలు, కార్డు కథలు, కొత్తగా జనకవనము' - ఇలా రకరకాల రచనలు బాగానే రాస్తున్నారు. "మా పసలపూడి కథలు" లాంటి ఒక ప్రాంతానికి చెందిన కథలు రాస్తున్నారు. "బారహమతుల్లా కథలు" లాంటి ఒక ప్రాంతానికి చెందిన కథలు వస్తున్నాయి. ఇది మంచి పరిణామము.

- ఇంగ్లీషు నవలలు, సాహిత్యము చదువు అలవాటు లేదు. ఎప్పుడో డిగ్రీ చదువు సమయంలో పాఠ్యాంశములలో వున్న కీట్సు, షెల్లీ, వర్డ్సువర్త్, షేక్స్పియర్ మొదలగువారి రచనలు చదివాను.

- చిన్న చిన్న కథలు 'జోగిని' కథ, కవితలు, కొన్ని నానీలు రాశాను.

- సాహిత్యేతర పుస్తకలలో జీవిత చరిత్రలు, రవీంద్రుని, వివేకానందుల జీవిత చరిత్రలు చదివాను.

- మా తరం వారు, పెద్దవారు, కొందరు చిన్నవారు సాహిత్యంపై అభిమానం చూపుతున్నారు. నేడు ఇంటర్నెట్ వచ్చాక గ్రంథాలయాలకు వెళ్ళువారి సంఖ్య తగ్గింది. ఇంటర్నెట్ ద్వారా కావలసినవి, అందుబాటులో వున్నవి ఎక్కువ చదువుతున్నారు.

- సాహిత్య గ్రంథాలు "ప్రస్థానం" తెలుగు అకాడమీ ప్రచురణలు "తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక" "పాలపిట్ట" సభ్యత్వం తీసుకుని ప్రతి నెల చదువుతున్నాను. గోపిగారి "నానీల సంకలనం", మోపూరు పెంచల నరసింహంగారి "నానీల సంకలనం" తీసుకుని చదివాను. డా॥ కొండ్రెడ్డిగారి శ్రీరామిరెడ్డి సిద్ధాంత గ్రంథం "చలం, విశ్వనాథ, శ్రీశ్రీల

సృజనాత్మకత" చదివాను.

– చదవాలనుకున్నవి గ్రంథాలయాలు, ఇంటర్నెట్ ద్వారా లభిస్తున్నాయి. 'వేయి పడగలు' లాంటివి ఇంటర్నెట్‌లో చదవలేము. గ్రంథాలయాల నుండి ఇంటికి తెచ్చుకోలేము. అలాంటి పుస్తకాలు, అష్టాదశ పురాణాలు స్వంతంగా కొని చదవాల్సిందే.

– నేను అంత లోతుగా ఆలోచించలేదు. ఒకే వస్తువును కథగానో, కవితగానో రాయమని పోటీ పెట్టినా బాగుండును. వాటిలో ఉత్తమమైన దానిని పాఠకుల అభిప్రాయము ప్రకారము ఎన్నుకొని బహుమతులు యిచ్చిన రచయితలను ప్రోత్సహించినట్లు వుంటుంది.

– నేను చిన్న చిన్న గేయాలు రాశాను. మాత్రాబద్ధంగా 'గడ్డిపూవు సీతాకోకచిలుక ప్రణయ భావన"ను గురించి రాశాను. బసివి అంశంగా కథ "పూజారి కథ" రాశాను. ఇంకా చిన్న చిన్న గేయాలు, "అమ్మ"ను గురించి, 'మహిళా దినోత్సవాన్ని' గురించి రాసి భద్రపరచుకున్నాను. నా యువకాశల నవపేశల (శ్రీశ్రీగారి కవితా – ఓ కవితా) వలె నేను రాసిన రచనలు అప్పుడే కూ..కూలు నేర్చిన కోయిల "తన కూ...కూ..లను విని మరల మరల పాడుకుంటూ మురిసిపోవునట్లు కొత్తగా రాయుట మొదలుపెట్టిన నేను రాసినవి మరల మరల చదువుతూ మురిసిపోతుంటాను. ఇంటికి వచ్చిన వారికి వినిపిస్తుంటాను.

– సాహిత్యరంగంలో విరివిగా రచనలు వస్తున్నాయి.

– ఇంగ్లీషు, హిందీ భాషలలో పరిచయము బాగానే వుంది కాని ఆ భాషా సాహిత్యాలు చదువు తీరిక, శ్రద్ధ లేదు. గనుక తెలుగులో పోల్చు ప్రసక్తి లేదు. కాని తెలుగులో ఎన్నో ప్రక్రియలలో సాహిత్యం దినదినాభివృద్ధి చెందుతుంది.

– సాహిత్య సభలు, సమావేశాలు చక్కగా నిర్వహింపబడుతున్నాయి. రాయలసీమలో కంటే ఆంధ్ర ప్రాంతంలో ముఖ్యంగా నెల్లూరు, రాజమండ్రి, గుంటూరు మొదలగు ప్రాంతాలలో సభలు, సమావేశాలు, కవి సమ్మేళనాలు, సత్కార్యాలు బాగా జరుగుతాయి.

– ఇక్కడ ఒక్కోసారి సాహిత్య సభలు జరిగిన తర్వాత పేపరులో చదివి హాజరు కానందుకు బాధపడిన రోజులున్నాయి. స్థానిక సాహిత్య సంఘాలలో దాదాపు పాతవారినే చూస్తున్నాను. కొత్తవారు అడపాదడపా పాల్గొంటున్నారు.

– తప్పకుండా ప్రతిబింబిస్తున్నది.

– నేను చదువు సాహిత్య పత్రికలు "పాలపిట్ట" మాసపత్రిక, "ప్రస్థానం" మాసపత్రిక, తెలుగు అకాడమీవారు ప్రచురించుచున్న "తెలుగు వైజ్ఞానిక త్రైమాసిక పత్రిక", "ఆంధ్రభూమి" మాసపత్రిక అందులోని సాహిత్యాంశాలకు సంబంధించినవి.

– పై సాహిత్య పత్రికలు దాదాపు 5 నెలల నుండి చదువుతున్నాను.

– ప్రస్థానంలో చిన్న చిన్న నాటికలు, ఏకాంకికలు రావాలి. ఉత్తమ కవిత, కథలకు పాఠకుల అభిప్రాయం సేకరించి, వారి అభిప్రాయాలకు అనుగుణంగా మెజారిటీ అభిప్రాయం నుండి ఉత్తమ కథ, కవిత ఇలా ప్రచురించిన బాగుంటుంది.

– "ప్రస్థానం" కోసం, సాహిత్యం కోసం నా వంతుగా వాటిని కొనమని, చందాదారులు కమ్మని, కవితలు, కథలు రాయమని ప్రోత్సహిస్తాను.

●

# నెలలో కనీసం పది మంచి కవితలైనా వస్తున్నాయి

- పలమనేరు బాలాజి- సెల్ : 94409 95010

2011 లో కడపకు వెళ్ళి డా॥ మనోహర్ కోటకొండ వద్ద నుండి సాహిత్య ఆకాడమీ పురస్కారం పొందిన మూడు నవలలు తెచ్చి చదివాను. వినోద్‌కుమార్ శుక్లా హిందీ నవల 'ఆ గోడకు ఒక కిటికీ ఉండేది'. మలయ శ్రీ అనువాదం మానికొండ ఎన్. విజయలక్ష్మి తమిళం నుండి అనువదించిన యం.వి. వెంకట్రామ్ నవల 'చెవులు'. నలిమెల భాస్కర్ మళయాళం నుండి అనుసరించిన 'స్మారక శిలలు' రచయిత పునత్తిల్ కుంజబ్దుల్ల.

కథ సాహితీ వారి కథ 2010 ఆవిష్కరణ కోసం కొత్తగూడెం వెడుతూ తిరుపతిలో 12.11.2011 న విశాలాంధ్రలో 'వనవాసి' నవల కొన్నాను. బిభూతి భూషన్ బంధోపాధ్యాయ (1894-1950) బెంగాలీలో రాసిన 'అరణ్యక' నవలను సూరంపూడి సీతారాం వనవాసి పేరుతో తెలుగులోకి అనువదించారు.

జయంతి పబ్లికేషన్స్ ఎస్వీ కృష్ణ ప్రచురించిన శివశంకరి తమిళ నవలలకు మంత్రి ప్రగడ శేషాభాయి తెలుగు అనువాదాలు - అంతరాలు, నేను నేనుగా..., ఆ తర్వాత...?!" చదివాను.

స్వామి నవలలు మరోసారి 2011లో చదవటం జరిగింది. "గద్దలాడతండాయి, రెండు కలల దేశమ్, మీరాజ్యం మీరేలండి" రాజ్ కమల్ ఝూ FIRE PROOF కు, కస్తూరి తెలుగు అనువాదం 'గుజరాత్ మానవ విషాదం' చదివాను.

ప్రముఖ సాహితీ విమర్శకులు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, కథాశిల్పం, నవలా శిల్పం, విమర్శా శిల్పం, విమర్శ గ్రంథాల రచయిత వల్లంపాటి వెంకట సుబ్బయ్య నవలా సంపుటిలోని "ఇంద్ర ధనుస్సు, దూర తీరాలు, మమతలు - మంచుతెరలు" మూడు నవలల్ని మరో మారు చదివాను.

విరసం ప్రచురించిన కొ.కు. రచనా ప్రపంచం ఆరు, ఏడు, ఎనిమిది నవలా సంపుటాల్లోంచి 'కులం లేని మనిషి', 'సవతి తల్లి', 'కురూపి' నవలలు చదివాను. గుంటూరు బి.ధర్మారెడ్డి గతంలో ఎన్నోసార్లు నవలలు గురించి లోతైన చర్చలు చేసి వుండటం కారణంగా వీటిని ప్రాధాన్యతా క్రమంలో చదవటం జరిగింది.

గోపీచంద్ రచనా సర్వస్వం మూడు, నాలుగు సంపుటాల నుండి 'అసమర్థుని జీవయాత్ర', 'గడియ పడని తలుపులు' నవలల్ని చదివాను. నాయుని కృష్ణమూర్తి 'మనసు గుర్రమురోరి మనిషీ!' చదివాను.

ఇక కథల విషయానికి వస్తే దిన, వార, మాస, ద్వై, త్రైమాస పత్రికల్లో, వార్షిక ప్రత్యేక సంచికల్లో వచ్చిన కథల్ని చదవటం జరిగింది. కొన్ని మంచి కథల్ని ఫైల్ చేసుకొన్నాను.

వేంపల్లె షరీఫ్ 'జుమ్మా' కథా సంపుటి, నగ్నముని 'ఆకాశ దేవర' సాహితీ స్రవంతి వారి కథకి నీరాజనం బహుమతి కథలు, చినుకు ప్రత్యేక సంచికలోని కథలు చదివాను. పాలపిట్ట, రచన, అరుణతార, ప్రజాసాహితీ, చిత్ర, భూమిక, స్థానిక పాలన, ఆశ, ఆంధ్రప్రదేశ్, ప్రస్థానం, సాహితీ స్రవంతి, విపుల, నడుస్తున్న చరిత్ర, మల్లెతీగ, ముంబాయివన్, నది, నవ్య, ఆంధ్రభూమి, విశాలాక్షి పత్రికల్లోని కథలు, అన్ని దిన పత్రికల ఆదివారం అనుబంధాల్లోని కథల్లో కొన్ని కథలు చదివాను. నవ్య వారపత్రిక వరుసగా కథల పోటీలు నిర్వహిస్తూ కొత్త రచయితల్ని కొత్త రకం కథల్ని ప్రోత్సహిస్తున్నారు. చదివించే గుణం వున్న కథలు, గుర్తుండి పోయే కథలు తక్కువగా వున్న, ఒత్తిడికి గురవుతూ కూడా నిరంతర రద్దీ జీవితంలో నిలబడి, రచయితలు రచనలు కొనసాగించటం ఒక సాహసోపేతమైన విషయం. కొత్త కథా వస్తువులు, కొత్త రకం, శైలి శిల్పాలతో నిండిన కథలు కొన్ని బాగా నచ్చాయి.

- కవిత్వం విషయానికి వస్తే కవిత్వ పఠనం నిరాటంకంగా కొనసాగుతూనే వుంది. కొత్త కవుల గళాలు, సీనియర్ కవుల జీవనోత్సాహ కవితా సౌరభాలు గొప్ప సంతోషాన్ని కలిగించాయి. నెలలో కనీసం పది మంచి కవితలైనా వస్తున్నాయి. నూట యాభైదాకా మళ్ళీ మళ్ళీ చదవగలిగే కవితలు 2011లో అచ్చయ్యాయి. పైన తెల్పిన పత్రికలతో బాటు కవిత!, నెలవంక, నెమలీక పత్రికల్లోని కవిత్వం బాగుంటుంది. కవిత! మళ్ళీ (పత్రిక) వస్తే బావుంటుంది. రచన మాసపత్రిక, ఈనాడు ఆదివారాల్లో కవిత్వానికి స్థానం కల్పిస్తే బావుంటుందని చాలా కాలంగా కవిత్వ అభిమానులు కోరుకుంటూనే వున్నా - ఎందుకో అది నెరవేరడం లేదు. ఆదివారం ఆంధ్రజ్యోతిలో కవిత్వం పేరుకు పోయింది కాబట్టి మళ్ళీ ప్రకటన ఇచ్చేంతవరకు కొత్తగా కవితలు పంపకండి అని ఆ మధ్యన ప్రకటించారు. ఇలాంటి పరిస్థితే మరికొన్ని పత్రికలకు కూడా వున్నట్లయితే - కనీసం అప్పుడప్పుడూ అయినా అదనపు పేజీలు కేటాయించో, ప్రత్యేక సంచికల్లో చోటు కల్పించో అయినా - సంవత్సరాల తరబడి ప్రచురణకు అంగీకరించి - ప్రచురించలేకపోయిన కవిత్వాల్ని ఇప్పటికైనా ప్రచురిస్తే బావుంటుందని నా వ్యక్తిగత అభిప్రాయం.

- సాహిత్య విమర్శా ప్రక్రియ విషయానికి వస్తే సాహిత్య ప్రస్థానం వారి 'దిక్సూచి' జూన్, జూలై 2011 విశేష సంచిక చాలా బాగా వుంది. పత్రికలు విమర్శకు పేజీలు కేటాయిస్తునే వున్నా, విలువైన విమర్శనా వ్యాసాలు అప్పుడప్పుడూ విమర్శ పట్ల గౌరవాన్ని, నమ్మకాన్ని కలిగిస్తున్నాయి. చినుకు వారు ప్రచురించిన వాడ్రేవు వీరలక్ష్మీదేవి భారతీయ నవల, 25 సుప్రసిద్ధ భారతీయ నవలల పరిచయ వ్యాసాల సంపుటి అద్భుతంగా వుంది. పాలపిట్టలో గుడిపాటి నిర్వహించిన పోటీలో కూడా మంచి వ్యాసాలు వచ్చాయి. ఇదొక మంచి ప్రయత్నం. పుస్తక సమీక్షలకి ప్రస్థానంతో సహా చాలా పత్రికలు మంచి చోటు కల్పిస్తుండటం వల్ల ఎప్పటికప్పుడు కొత్త పుస్తకాలు వివరాలు తెలుస్తోంది. పాలపిట్ట, చినుకు, ప్రజాశక్తి, విశాలాంధ్ర, హెచ్‌బిటి, ఎమెస్కో బుక్స్, తిరుపతి సాకం నాగరాజు, కోట పురుషోత్తం తదితరులు ప్రచురించిన విలువైన పుస్తకాలు చాలా బావున్నాయి. జి. వెంకట కృష్ణ కథా సంపుటి 'చిలుకలు వాలిన చెట్టు'కు సమీక్షా వ్యాసం రాసాను. దినపత్రికల సాహిత్య పేజీల్లో మంచి వ్యాసాలు, సమీక్షలు, చర్చలు కొనసాగుతున్నాయి. పత్రికల ప్రత్యేక సంచికల్లో మంచి వ్యాసాలు వచ్చాయి. కథల గురించి, కవిత్వం

గురించి ఎక్కువగా విమర్శ వస్తున్నప్పటికీ నవల గురించి అంతగా విమర్శ రావటం లేదు. నవలల పోటీలు నిర్వహించడం, పత్రికల వారు అనుబంధ నవలల్ని ప్రచురించటం ద్వారా కొత్త, మంచి నవలలు వెలువడే అవకాశం వుందనుకుంటాను. తద్వారా మంచి నవలల గురించి లోతైన విమర్శనా, విశ్లేషణాత్మక వ్యాసాలు వచ్చే అవకాశం ఏర్పడుతుంది కూడా.

- అందుబాటులో వున్న దినపత్రికల సాహిత్య పేజీలు, ఆదివారం అనుబంధాలు చదువుతుంటాను. ఈనాడు, వార్త, ఆంధ్రజ్యోతి, సూర్య, సాక్షి, విశాలాంధ్ర, ప్రజాశక్తి, ఆంధ్రప్రభ, ఆంధ్ర భూమి పత్రికల ఆదివారం సంచికల్లో చాలానే లభ్యమవుతుంటాయి. మూడు నాలుగు దినపత్రికల్లోని కథలు అస్సలు బావుండటం లేదు. బహుశా ఆయా పత్రికలకు మంచి కథలు అందకపోవటమే అసలు కారణం అని నా అభిప్రాయం. అయితే అవే పత్రికల్లో మంచి కవిత్వం వస్తోంది. మంచి సమీక్షలు, సామాజిక వ్యాసాలు వస్తున్నాయి. తెలుగు వెలుగు పేరుతో ఈనాడు ఇన్నేళ్ళకు పత్రికను ప్రారంభించటం విశేషం. అభినందనీయం. సాహిత్య పత్రికల పేర్లు ఇదివరకే చెప్పాను. చాలావాటికి చందాలు పంపి పునరుద్ధరణ చేస్తూనే వున్నాను. కొన్ని పత్రికలవాళ్లు చందాతో నిమిత్తం లేకుండా పంపుతున్నారు. కొన్ని పత్రికల నిక్కచ్చి వ్యవహారం వల్ల చందా పంపడంలోనా కాలాయాపన కారణంగా కొన్ని విలువైన సంచికల్ని అందుకోలేకపోయాను. అందుకే పత్రికల చందాలకే డైరీలో ఒక పేజీ కేటాయించేసాను ఇప్పుడు.

- సాహిత్య పఠనం నిస్సందేహంగా 2011లో పెరిగిందనే చెప్పాలి. పత్రిక, పుస్తకం ఏదైనా సరే చేతిలోకి రాగానే వెంటనే ఆ తేదిని మొదటి పేజీలోనే రాస్తున్నాను. ఈ అలవాటు సుంకోజి దేవేంద్రాచారి నుండి నేర్చుకున్నాను. తద్వారా పుస్తకం మనకొచ్చిన ఎంత కాలానికి ఆ పుస్తకాన్ని చదవగలిగామనే విశ్లేషణకు వీలవుతోంది. అట్లాగే స్వీకారం, సమీక్షల ద్వారా ఎప్పటికప్పుడు కొత్త పుస్తకాల వివరాలు తెలిసిన వెంటనే, వాటిని ఆలస్యం కాకుండా నచ్చిన పుస్తకాల్ని తెచ్చుకునేందుకు వీలుగా పుస్తకం వివరాల్ని ఎప్పటికప్పుడు రాసుకుంటున్నాను. ప్రాధాన్యతా క్రమంలో చదివాల్సిన కొత్త, పాత పుస్తకాల్ని సర్దుకోవటం కూడా 2011లో అలవాటు చేసుకున్నాను. సొదా, ఆర్.యం. ఉమామహేశ్వరరావు లాంటి రచయితలు ఇప్పటికైనా వారి కథా సంపుటాల్ని ప్రచురిస్తారేమోనని ఆశగా ఎదురుచూస్తూనే వున్నాం. చదవటానికి బాగా ఇష్టపడుతున్నాను. మంచి పుస్తకాల్ని మరోసారి మళ్లీ చదువుతున్నాను.

- పలమనేరులో గండికోట వారిజ, దోర్నాదుల సిద్ధార్థ, గంటామోహన్, ఆర్.మోహన్ రెడ్డి, డి. కుమారస్వామిరెడ్డి, యుగంధర్, హేమంత్‌కుమార్, యం. సంధ్యారాణి, ఈనాడు మణిలాంటి విలువైన పాఠకులు యం.శ్రీనివాసులు లాంటి పుస్తక శ్రామికులు వున్నారు. నేను రాసే కథలు, కవితలు వ్యాసాలతో బాటు, మిత్రుల రచనల్ని మా అమ్మ జయమ్మ (70) చాలా ఆసక్తిగా చదవటమే కాక, విలువైన అభిప్రాయాల్ని నాకు నేరుగానూ, మిత్రులకు ఫోన్ ద్వారానూ చెపుతూ వుంటుంది. పిల్లలు పవిత్ర, ప్రణీత, (ఇంటర్, ఎనిమిదో తరగతి) కవిత్వం చదువుతారు. వారికి నచ్చితే వాళ్లే ఆయా కవులకు ఫోన్ చేస్తారు.

- ఒక పుస్తకంలో ఒక కథ నచ్చిన కారణంగా వెతికి వెతికి ఆ రచయిత తాలుకు అన్ని కథల్ని చదవాలనుకునే తపన కలిగిన ఈనాడు మణి, కుమారస్వామిరెడ్డి, ఎల్.ఐ.సి. యుగంధర్‌లు నాకు తెలుసు. పాలపిట్ట, మిసిమి, సాహితీస్రవంతి, లాంటి పత్రికలకు తక్షణం చందాదారులైన వాళ్లున్నారు. కథ, కవిత్వం, నవలల పఠనానికి సమయం కేటాయించే వాళ్లున్నారు. వ్యక్తిత్వ వికాస పుస్తకాలకు, ప్రసంగాలకు చాలా ఇష్టంగా, బాధ్యతగా తగు సమయాన్ని కేటాయించే పద్మశ్రీ శ్రీనాథ్, గురు రాజారావు, డాక్టర్ రాజేంద్రరెడ్డి డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ మా వూరి వాళ్లే..

కథో కవిత్వమో చదివి ముక్కూ ముఖం తెలియకపోయినా ఎంతో ఇష్టంగా ఫోన్ చేసి వందలాది మంది అభిమాన పాఠకులు అభిమానం అందరి రచయితలకు, కవులకు అనుభవపూర్వకంగా తెలుసు.

- ఇంగ్లీషులో చదివిన పుస్తకాలు

వీక్షణం ఎన్. వేణుగోపాల్ **(CDRC)** ప్రచురించిన **Fifty years A.P.** 1956 –2006 ఆలస్యంగా పూర్తి చేసాను.

**Dv. V.V.B** రామారావు గారి తెలుగు కవిత్వం ఆంగ్లానువాదం (1985–95) **More Voices on The Wing** పూర్తి చేసాను.

- తెలుగులో రాస్తూనాను. ఇంగ్లీషులో రెండు కవితలు రాసాను. అచ్చయ్యాయి. సంకలనాల్లో వచ్చాయి.

- సాహిత్యేతర పుస్తకాల పఠనం పట్ల కూడా నాలుగైదేళ్ళుగా ఎక్కువ ఆసక్తి ఏర్పడిన కారణంగా విలువైనా అద్భుతమైన పుస్తకాల్ని సేకరించుకోగలిగాను.

హైదరాబాద్ నుండి వచ్చిన మిత్రుడు కె.పి. అశోక్‌కుమార్ సలహాతో పుస్తకాల్ని ఎలా వరుస క్రమంలో అమర్చుకోవాలో తెలుసుకున్నాను. ఆ తర్వాత అనవసర పుస్తకాలు నా కళ్లముందు కనిపించటం మానేసాయి. కథ, కవిత్వం, నవల, విమర్శ, సామాజిక శాస్త్రాలు, యాత్రా సాహిత్యం వారీగా పుస్తకాల్ని విడివిడిగా అమర్చుకుని ఒక క్రమంలో చదవటాన్ని కొత్తగా అలవాటు చేసుకున్నాను. జొన్న విత్తుల శ్రీరామ చంద్రమూర్తి, మధురాంతకం నరేంద్ర ఈ విషయంలో విలువైన సూచనలు ఇచ్చారు. పుస్తకాలకో పుస్తకాన్ని కేటాయించడం వల్ల ఏయే పుస్తకాలున్నాయి. ఏవి కొనాలి అనే విషయాల పట్ల అవగాహన కలిగింది. సీతారాం ద్వారా "నాకు నచ్చిన టీచర్ విద్యార్థుల కృతజ్ఞతా ప్రకటన" పుస్తకం అందింది. మహబూబ్‌నగర్ ప్రభుత్వ డిగ్రీ కళాశాల పిల్లలు రాసిన వ్యాసాలు, వారి స్పందనలు చాలా బావున్నాయి. దాట్ల దేవదానం రాజు 'యానాం చరిత్ర' చదివాను.

- పదవీ విరమణ చెందినవాళ్లు, సమకాలికులు సమ వయస్సువాళ్లు (38సం॥లు) నాకంటే చిన్నవాళ్లు నాకు తెలిసి పుస్తకాల పట్ల మంచి ఆసక్తి కలిగి ఉన్నారు. మంచి పుస్తకాల్ని వాళ్లకు తెలియచేసినప్పుడు, కొనుక్కోవటానికి సిద్ధంగా వున్నారు. మంచి మంచి పుస్తకాల్ని మని ఆర్డర్స్ పంపి తెప్పించుకుంటున్నారు కూడా. మంచి పుస్తకాలకో వెబ్‌సైట్ వుంటే చాలా బావుంటుందని నా అభిప్రాయం. రచయిత పేరో, పుస్తకం పేరో తెలిసినా, పుస్తకం ధర, పుస్తకంలోని ముఖ్యమైన వివరాలు, పుస్తకం లభించే చోటు మొదలైన వివరాలు తెలిపేలా ఒక వెబ్‌సైట్ వుంటే చాలా బావుంటుందనిపిస్తుంది.

# జ్ఞాపకం

- ఆవుల వెంకటేశులు
సెల్ : 9441665095

పడగలెత్తిన భవంతుల పునాదులలో
అమ్మ శీలం సమాధి అయితే
చిరునామా లేని నా పుట్టుక
కుప్ప తొట్టిని చేరిన జ్ఞాపకం

ఎంగిలి విస్తరాకుల గోరుముద్దలు
ఊరకుక్కల లాలిపాటలు
పాడుబడిన గోడలనీడల ఆవాసాలు
పిడికెడు మెతుకులకై శునకంలా కాపలా కాచిన జ్ఞాపకం

మనసుకు గుచ్చుకున్న ఈసడింపుల శూలం
మానని గాయం నుండి కారుతున్న రక్తం
చివికిన ఆలోచనలో ఘనీభవించిన విషాదం
చేయని నేరానికి శిలువ నెక్కిన జ్ఞాపకం



స్పందించడం మరచిపోయిన రోబోటు లోకం
వెకిలి బతుకు క్షేత్రంలో ఎండిపోయిన మానవత్వం
నివురుగప్పిన నిప్పులా ఎదిగిపోయిన ద్వైదీభావం
యంత్రాల్లా గమిస్తున్న జీవితాలు

ప్రపంచ వీధులన్నీ తిరిగి
హృదయాలన్నిటినీ ఏకసూత్రబద్ధం చేస్తాను
బాధిస్తున్న జ్ఞాపకాల గాయాలకు చికిత్స చేస్తాను
దారితప్పిన సైందవ సమూహాన్ని సంస్కరిస్తాను
మానవీయ జ్ఞాపకమై పల్లవిస్తాను...

---

– 2011లో 84 పుస్తకాలు కొన్నాను. సాహిత్య పుస్తకాలు 71, చరిత్ర పుస్తకాలు 04, యాత్రా సాహిత్యం 01, ఆత్మకథ 01, వ్యక్తిత్వ వికాస పుస్తకాలు 04, సామాజిక శాస్త్రాలకు సంబంధించినవి, కళలకు చెందినవి 03

– నాకు దొరకని పుస్తకాలు పాణి నవల 'నిప్పులవాగు'.

శార్వరి – సంపాదకత్వంలో వచ్చిన 'కథలెలా రాస్తారు"?

ఎవరో ఎత్తుకెళ్లిన నా పుస్తకాలు 'పతంజలివి, రావిశాస్త్రివి, 03

– ఎవరైనా రాస్తే బాగుంటుందని అనుకుంటున్న విషయాలు.

పిల్లలల్లో సున్నితమైన లైంగిక భావనలు, లైంగిక ప్రవర్తన, లైంగిక హింస, శారీరక మార్పులు, ఆలోచనల్లో మార్పులు – ఎదిగే కొద్ది పిల్లల్లో వచ్చే మార్పులు – పిల్లలు – తల్లి తండ్రి మాట్లాడుకోవాల్సిన విషయాల గురించిన కథలు, నవల.

ఆదివారం ఆంధ్రజ్యోతిలో కథా నేపథ్యం శీర్షిక మధురాంతరం రాజారాంతో మొదలై కీ.శే. మధురాంతకం మహేంద్రవరకు కొనసాగి ఆగింది. ఆ కథా నేపథ్యాల్ని ఎవరైనా పుస్తకంగా ప్రచురిస్తే చాలా బాగుంటుంది. ఈ శీర్షికను కొనసాగించటం కూడా బావుంటుంది.

1985-1990 ప్రాంతాల్లోని కథా కాలం విస్మరణకు గురైంది. ఒక కథా సంకలనం రావాల్సి వుంది. ప్రతి జిల్లా నుండి ఒక కథా సంకలనం, ఒక కవితా సంకలనం ప్రతి సంవత్సరం క్రమంగా వస్తే బావుంటుంది. కథల్ని అభిమానించి, విశ్లేషించే వాసిరెడ్డి నవీన్, కె.శివారెడ్డి కథలు రాస్తే చదవాలని వుంది. వాడ్రేవు చిన వీరభద్రుడు, సౌదా, ఆర్.యం. ఉమామహేశ్వరరావు, పాపినేని శివశంకర్, ఆడెపులక్ష్మీపతి, గోపినికరుణాకర్, సతీష్ చందర్, స్వామి అబ్బూరి ఛాయాదేవి గార్ల కొత్త కథల్ని చదవాలని వుంది.

ఎన్. వేణుగోపాల్, బి. తిరుపతిరావు, వాడ్రేవు చినవీరభద్రుడు, గుడిపాటి, ఎ.కె. ప్రభాకర్ మొదలైన వాళ్లు సాహిత్య విమర్శని మరింతగా కొనసాగించాలని కోరిక. సాహిత్య విమర్శకు సంబంధించి వీరి నుండి పుస్తకాలు రావాలని ఎదురు చూసేవాళ్ళలో నేను ఒకడ్ని. మధురాంతకం రాజారాం సాహితీ సంస్థ సాహిత్య విమర్శకి ఇచ్చే కథా కోకిల పురస్కారం లాంటివి మరికొన్ని ఎవరైనా ఏర్పరిస్తే విమర్శకులకు ప్రోత్సాహకరంగా వుంటుంది.

– రాయలేకపోయినప్పుడు బాధపడ్డాను. రాయకుండా వుండలేనప్పుడే రాసాను. రచనా ప్రణాళికలంటూ లేవు. నా రచనలకు మిశ్రమ స్పందన లభించింది.

– సాహిత్యరంగం సంతృప్తికరంగా వుంది. ఎన్నో మార్పులు వస్తూనే వున్నాయి. ప్రక్షాళన కూడా జరుగుతూనే వుంది. ఎన్నో పత్రికలు వెలువడుతున్నాయి. పత్రికల కొరత లేదు. అనేక పోటీలు, అవార్డులు, బహుమతులు, పురస్కారాలు పాత, కొత్త తరం రచయితల్ని రచనల్ని ప్రోత్సహిస్తుండటం సంతోషకరమైన విషయం.విలువైన సాహితీ చర్చలు జరగాల్సి వుంది. తెలుగు సాహిత్యానికో బ్లాగ్, వెబ్ సైట్ కావాలనిపిస్తోంది. అనువాదాలు చేయించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

– సాహిత్యసభలు, కార్యక్రమాల తీరు మెరుగుపడుతోంది. ఇంకా మార్పు రావాల్సి వుంది.

– స్థానిక సాహిత్య సంఘాలు లేవు.

– అక్షరాలా తెలుగు సాహిత్యం నేటి పరిస్థితుల్ని సమగ్రంగా సవ్యంగా ప్రతిబింబిస్తోంది. మరింత వాస్తవిక దృష్టితో, కళా ధోరణిలో రచనలు రావాల్సి వుంది.

– అన్ని సాహిత్య పత్రికలు బావున్నాయి. చదువుతున్నాను. అన్ని శీర్షికలు బావున్నాయి. నిర్వాహకుల్ని ఎప్పటికప్పుడు మారిస్తే కొత్త వారికి అవకాశమిచ్చినట్లు అవుతుంది. ఇతర భాషల్లోని సాహిత్య పత్రికలతో మన పత్రికల వారు సంబంధాలను మెరుగు పరచుకుని అనువాద రచనల్ని పరస్పరం ప్రోత్సహిస్తూ పలు భాషల్లో మంచి రచనల అనువాదాల్ని ప్రచురించే ప్రయత్నం చెయ్యగలిగితే బావుంటుంది.

– ప్రస్థానం చదువుతూనే వున్నాను. ఐదేళ్ల చందా కట్టాను కదా. ప్రయోగాత్మక కథలకి, పేజీల పరిమితి లేని కథలకు చోటివ్వగలరు.

•

# జీవన వాస్తవిక రచయితలు

# చాసో, జగన్నాధ శర్మ



చాసో



జగన్నాధ శర్మ

- జగద్ధాత్రి

**జ**నవరి 17. ఈ తారీఖు వినగానే సాహితీ లోకమంతా పద్దెనిమిది ఏళ్లుగా వెంటనే తలచుకునేది విజయనగరంలో చాగంటి తులసి తన తండ్రి, అభ్యుదయ రచయితల సంఘం సంస్థాపకుడు అయిన జగమెరిగిన రచయిత "చాసో స్ఫూర్తి" పురస్కారం. ఇప్పటికి పదిహేడుమందికి ఇవ్వబడ్డ ఈ పురస్కారం ఈ ఏడాది నవ్య వార పత్రికా సంపాదకులు, ప్రముఖ కథకులు జగన్నాధశర్మని వరించింది. సమంజసమే. ఆనందం కూడాను. ఇటీవల ఇక్కడ జరిగిన ఒక సాహితీ సభలో జనవరి రెండవ తారీకున చాసోపై ఒక సమాలోచన సభ ప్రజాస్పందన అధ్యక్షులు చాగంటి సుందరరావుగారు నిర్వహించారు. ఆ సభలో చాసో కుమార్తెలు చాగంటి తులసి, కృష్ణకుమారి కూడా పాల్గొన్నారు. చాగంటి తులసి మాట్లాడుతూ ఈ పురస్కారం ఇవ్వడంలోని ఉద్దేశాన్ని వివరించారు. చాసో నిర్భయంగా, నిర్మొహమాటంగా ఉన్నది ఉన్నట్లు చెప్పే మనిషని, తన కథలకి తానే మొదటి విమర్శకుడని, నచ్చకపోతే లేదా తాననుకున్న స్థాయిలో కథ లేదనుకుంటే నిర్మొహమాటంగా చింపేసేవారని చెప్పారు. అందుకే ఒక కథకుడిగా, ఒక ఆత్మ విమర్శకుడిగా, సాహితీ స్రష్టగా చాసో సాధించిన సాహితీ కీర్తి చాల తక్కువమందికి లభిస్తుంది.

తాము రాసిన ప్రతి అక్షరం చాలా గొప్ప అనుకుంటున్న ఎందరో రచయితలకు చాసో నిజంగానే ఒక స్ఫూర్తి. ఇక ఈ పురస్కారం వెనుకగల సాహితీకారులు కొంతమంది ప్రజల మనసులలో నిలిచిపోయే మానవీయ కోణాన్ని ఆవిష్కరించే కథకులకి ఈ పురస్కారాన్నివ్వడం జరుగుతోందని, అంతేకానీ దీనికి మీ కథల సంపుటులు పంపండి అని ఏమీ రూల్ లేదని చెప్పడం చాల ముదావహంగా ఉంది. ఒక సత్యమైన సాహితీకారుని లేదా కళాకారునికి గుర్తింపును మించిన ఏ పురస్కారము అక్కర్లేదు. అతని అక్షరాలు శాశ్వతంగా నిలవడమే అతనికి అన్నిటికీ మించిన వరం, పురస్కారం. అయితే కొన్ని పురస్కారాలు రచయితకి గుర్తింపు తీసుకొస్తూనే మరింత సామాజిక బాధ్యతను కూడా పెంచుతాయి. అలాంటి స్ఫూర్తి కలిగించడంలో ఈ పురస్కారం కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డ్‌ను అతి పిన్నవయసులోనే అందుకున్న సలీం వంటి రచయితలను కూడా వరించింది. తెలుగు సాహిత్య లోకంలో తలమానికంగా నిలిచిన ఈ పురస్కారం పొందాల్సిన రచయితలో ముందు వుండాల్సిన అతి ముఖ్యమైన లక్షణాలు మానవీయత, సహజత్వం, సామాజిక బాధ్యత, తనదైన విశిష్ట శైలి. ఇవన్నీ కలిగిన కథకులకు మాత్రమే ఈ పురస్కారం లభిస్తుంది.

ఈ లక్షణాలన్నీ పుష్కలంగా కలిగిన రచయిత జగన్నాధశర్మ. శర్మ ఫ్లైట్లో కూర్చుని పేదవారి జీవితం గూర్చి కథలల్లరు. నిజజీవితంలో అతి పేదరికం నుండి వచ్చి, ఆ పేదరికపు ముళ్ళనుండి ఈనాడు ఒక పత్రికా సంపాదకుడిగా ఎదిగినప్పటికీ ప్రతి క్షణం తన మూలాలు మరవని రచయిత శర్మ. జీవితంలో ఎన్నో అనుభవాలను చేదు శాతం ఎక్కువగా ఉన్నవాటిని చవి చూస్తూ, దుఃఖాల్ని దిగమింగు కుంటూ తనకున్న ఒకే ఒక ఆయుధం, ఆలంబనా అక్షరం మాత్రమే అని మనస్ఫూర్తిగా నమ్మే ఆత్మగౌరవమున్న మనిషి శర్మ. అందుకే అతని కథల్లో సకల సాహితీ మానవ లోకాన్ని కదిలించగల వాస్తవాలున్నాయి. జీవితాన్ని అక్షరీకరించడం మాటలతో పని కానేకాదు. అందుకు ముందుగా ఉండాల్సిన ఆత్మ స్థైర్యం, ఆత్మపరిశీలనా, అభివ్యక్తి ఇవన్నీ ఉంటేనే గానీ ఒక కథ రాసి మెప్పించలేము, పాఠకుల హృదయాలలో నిలవలేము. సార్వజనీనత ఉండని కథలు కానీ, సాహిత్యం కానీ ఎక్కువకాలం నిలవదన్నది మనమందరమూ ఎరిగిన సత్యం.

ఈనాటి కథకుడు తను ఏ భాషవాడైనా, ఏ ప్రాంతపు వాడైనా రాసేది సకల మానవ హృదయ సంక్షోభం, విశ్వ సత్యాలు అయినప్పుడు అవి ఎన్నటికైనా నిలుస్తాయి. కేవలం నాలుగు పుంజీలు కథలు మాత్రమే రాసిన చాసో కొన్ని తరాలకు స్ఫూర్తినివ్వగల రచయితగా మిగిలాడంటే అది అతని నిజాయితీ గల అక్షరంలోని బలం.

ఇటీవలే విడుదలైన జగన్నాధశర్మ కథల సంపుటి "పేగు కాలిన వాసన" లోని కథలు ఇటువంటి జీవిత సత్యాలనే ఆవిష్కరించాయి. పరిస్థితుల కాఠిన్యాన్ని పంటిబిగువున భరిస్తూ జీవన సమరం సాగించే మనషుల కథలు ఇవి. జీవితాన్ని బయస్కోప్‌లాగా కాక మైక్రోస్కోప్‌లోంచి దాని కణ కణాన్ని చవిచూసి అనుభూతించి రాసిన కథలవి. ఈ సంపుటిలోని "రెక్క తెగి పడిన పావురం" అనే కథ చదివినప్పుడు ఎటువంటి పాఠకుడికైనా ఏదో తెలియని ఆవేదన కడుపులో మెలిపెడుతుంది. ఆ ఆవేదన పేరే ఆకలి. బ్రహ్మరాక్షసి లాంటి ఈ ఆకలిని మనిషికిచ్చి బ్రతకమని శాసిస్తుంది జీవితంపై మమకారం. ఈ రెంటి వేదనల మధ్య తాను ఎలా మసలుకుంటాడో మనిషిగా నిలబడతాడనేది ప్రతి మనిషికీ ఒక అగ్నిపరీక్ష.

అయితే ఇందులో గెలుపు ఓటముల ప్రసక్తి లేదు. సమాజం

స్థాపించిన ఈ కుహనా విలువలు మనిషిని ఎందుకు కట్టిపడేస్తాయో, ఎందుకు మనిషి పరువూ, మర్యాద అనే మాస్కులు వేసుకుంటాడో ఈ సంఘంలో అన్నది ప్రశ్న. అన్నిటికి మించి సహజాతమైన ఆకలి, నిద్ర, కామం. ఈ మూడింటిలోనూ మనిషి ఎలా ప్రవర్తిస్తాడనేది ముఖ్యం. ఎప్పుడు ఆత్మను చంపుకోవాల్సి వస్తుంది, బ్రతకడానికి ఎలా ఒక స్త్రీ తన భర్త చేత స్వయంగా తన ఆడతనాన్ని మరొక పురుషుడికి వెలకిచ్చి బతుకు బండి నడపడానికి ఎలా తోడ్పడుతుంది అన్నది ఈ కథలోని సారాంశం.

1945లోనే స్వాతంత్ర్యం రాని కాలంలోనే "ఢంకా" మాస పత్రికలో చాసో రాసిన "లేడీ కరుణాకరం" కథ. ఈ రెండు కథలూ ఎందుకు చెప్తున్నాను అంటే వీటిలోని సారూప్యత కోసం ఒక చిన్నపాటి పరిశీలన మీ దృష్టికి తీసుకువద్దామని నా ఉద్దేశం. ముందుగా రెండు కథల్లోని సారూప్యతలేంటో చెపుతాను. ఒకటి, రెండు కథల్లోనూ పెళ్ళైన స్త్రీ తన భర్త కోసం వ్యభిచరించడం. అదీ భర్తకి తెలిసి ఉండగా. నిస్సహాయుడైన ఆ భర్త పరిస్థితి. ఇక కథన రీతిలోకి వెళితే చాసో నిర్మొహమాటంగా ఆరు దశాబ్దాల క్రితమే ఆవిష్కరించిన జీవన నగ్నసత్యాన్ని 1988లో శర్మ తన కథలో ఆర్ధ్రతతో ఆవిష్కరించారు. ఎన్ని కబుర్లు చెప్పినా ఆకలి మనిషికి తప్పదు. అలాగే కామం మనిషిని లొంగదీస్తుంది. ఇది మనం ఒప్పుకున్నా లేకున్నా ప్రపంచంలోని ఎందరో కథకులు రాసిన సజీవ చిత్రాల్లాంటి కథలు నిరూపించాయి.

ప్రఖ్యాత మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞుడు అబ్రహాం మాస్లో తన 'థియరీ ఆఫ్ నీడ్స్'లో ఒక కోను రూపంలో ప్రస్తావించాడు. ముందుగా మనిషికి కావలసినవి మానవ సహజాతాలు అయిన ఆకలి, నిద్ర, కామం. ఇవి తీరిన తర్వాతే మనిషి మానసికమైన అవసరాలను గూర్చి ఆలోచిస్తాడు. అందులో గుర్తింపు, కీర్తి, ధనం, పదవులూ, ఇక చివరిగా తనని తాను తెలుసుకునే ప్రయత్నం చేస్తాడు అని మాస్లో అంటాడు. ఏ మనిషి ఇందుకు భిన్నంగా ప్రవర్తించడం మనం చూడలేము. ఇక ఈ రెండు కథల మధ్యన దాదాపు 28 సంవత్సరాల దూరం ఉన్నప్పటికీ అదే జీవనసత్యాన్ని ఆవిష్కరించడంలో శర్మ కృతకృత్యులయారు. ఆకలి, పేదరికం మనిషిని ఆత్మాభిమానాన్ని చంపుకుని మానాన్ని అమ్ముకునే విధంగా ఎలా తయారుచేస్తుందో నిజానికి చాసో చాల కఠోరంగా ఆవిష్కరించారు. శర్మ కథలో కొంత ఆర్ద్రత ఉన్నప్పటికీ జరిగే విషయం మాత్రం ఒకటే. అక్కడ "లేడీ కరుణాకరం" లోని కరుణాకరం, శారద అయినా, ఇక్కడ "రెక్క తెగి పడిన పావురం లోని వనజాక్షి, శంకరం అయినా ఒకేలాంటి పరిస్థితి ఒకేలాంటి పరిష్కారం.

"అనేక విషయాలలో సమాధానాలు పడుతూ ఉంటేనే జీవితం ఎవరికైనా గడుస్తుంది" అని సరిపెట్టుకుంటాడు కరుణాకరం. తనకి పుట్టిన తన ఆరుగురు పిల్లల్నీ చూస్తూ. ఇది మనిషిని కలిచి వేసే నిష్ఠూరమైన నిజం. అలాగే శర్మ కథలో మేడపైన రామకృష్ణ వనజాక్షిపై ఆశ పడుతున్నాడని తెలిసీ చూసీచూడనట్టు ఊరుకుంటాడు శంకరం. అమ్మ మరణంతో అక్కడికి వెళ్ళాల్సి రావడానికి చేతిలో చిల్లిగవ్వ లేదు. ఇక రామక్రిష్ణని ఆశ్రయించక తప్పని పరిస్థితిలో పైన ఏమి జరుగుతుందో తెలిసీ ఆమెను అక్కడికి పంపి తను బయటికి వెళతాడు ఈ మగడు. అయితే రామకృష్ణ ఏమీ దానకర్ణుడు కాదు ఉత్తినే ఐదు వందలు సమర్పించడానికి, వాళ్ళు ఆ డబ్బు తిరిగి ఇవ్వలేరనీ తెలుసు అతనికి. ఇక్కడ వనజాక్షి దేహంతో బేరం పెడతాడు లొంగక తప్పనితనంతో వనజాక్షి రామకృష్ణ బేరానికి ఒప్పుకుంటుంది.

చాసో కథలో మొట్టమొదటిసారి తన భార్య వేరెవరితోనో ఉండడం చూసి మండిపడిన కరుణాకరం మగతనం మామగారి మాటలతో అవాక్కైపోతుంది. నీ చదువుకి డబ్బులు ఇవన్నీ ఇలా వచ్చినవే అని చెప్పిన మామగారి మాటలు విన్నాక ఇకనైనా వద్దని భార్యని తీసుకుని వేరే ఉద్యోగం వెతుక్కుని సంసారం చేస్తుంటాడు కరుణాకరం. ఇక చాలీచాలని జీతంతో, అసంతృప్తి జీవితంతో. అక్కడికి కూడా శారద కోసం నాయుడు రావడాన్ని అభ్యంతరపరచగా శారద అప్పుడు అతన్ని అడిగిన కఠోరమైన సత్యాల ముందు, తను సంపాదించిన డబ్బులు చూపిస్తోంటే, భవిష్యత్తు బంగారం చేసుకోమని హితబోధ చేస్తుంటే ఇదంతా నీ కోసమే మనకోసమే చేశానని చెప్తోంటే మరి కరుణాకరంలోని మగవాడు లేవడు, కేవలం స్వార్థపరుడు మాత్రమే బ్రతుకుతాడు. అందుకే ఆ డబ్బుతోనే చదువుకుని పెద్ద బ్యాంక్ ఆఫీసరై చివరికి "సర్" అనే బిరుదు ఆ రోజుల్లో గొప్ప పురుషునికిచ్చే బిరుదును సొంతం చేసుకుంటాడు. దానితో శారద కాస్తా ఒక లేడీ కరుణాకరం అవుతుంది. ఈ కథ ఆఖరి వాక్యం "శారద మహా పతివ్రత" అంటూ ముగిస్తాడు చాసో. భర్త కోసం పరాయి వారితో బిడ్డల్ని కన్న కుంతి లాంటి వాళ్ళు పతివ్రతలైతే మరి శారద మాత్రం కాదూ? ఖచ్చితంగా అవుననాలి మనసున్న ఏ మనిషైనా.

శర్మ కథలో రామకృష్ణతో వెళ్తే అతను కడుపు నిండా తిండీ నిద్రా ఇస్తానన్నాడు అని అక్కసుగా చెప్తే, అయితే మరివున్నది ఒక్క సూట్‌కేసు కదా మా బట్టలెక్కడ పెట్టుకోవాలి అన్న శంకరాన్ని అసహ్యంతో నువు మనిషి పుట్టుక పుట్టలేదూ అని ఛీత్కరిస్తుంది వనజాక్షి. అప్పుడు శంకరం... "మనిషిగా పుట్టాను కనుకనే, అందునా మధ్యతరగతి మనిషిగా పుట్టాను కనుకనే ఎన్ని దెబ్బలైనా ఓర్చుకునే మనస్తత్వాన్ని కలిగి ఉన్నాను. నువ్వు చెప్పుచ్చుకు కొట్టినా నేను బాధపడను" అంటూ, తననిలా తయారుచేసింది తన కుటుంబ వ్యవస్థ అనీ, పేద వంటి ఈ సమాజంలో తనని నిస్సహాయంగా జారవిడిచారని, అందులో పురుగులా తప్ప జీవించడం కష్టమని ఎటువంటి సమాధానమూ భార్య ప్రశ్నకు ఇవ్వడు శంకరం. ఆ క్షణంలో అతనిలోని బతుకు భయాన్ని చూసి ఒక్కసారి అతన్ని అల్లుకుపోతూ పిచ్చిగా అంటుంది నేనూ లేకుంటే నువ్వెలా బతుకుతవయ్యా అంటూ పసిపిల్లాడ్ని అక్కున చేర్చుకున్న తల్లిలా పెనవేసుకుపోతుంది. మరి వనజాక్షి ప్రతివత కాదూ?

ఈ కథ చివరి వాక్యం "టికెట్ డబ్బులు పైన ఓ పది రూపాయలు మాత్రమే జేబులో ఉంచండి. మిగిలినవి ఇటిచ్చేయండి. సూట్కేస్‌లో దాచేద్దాం" అంటుంది. చివరి మాట "దాచేద్దాం"లోనే మనమిద్దరం ఒకటి ఏమి చేసినా సరే కలిసి బతుకుదాం అనే నిశ్చయం కనిపిస్తుంది. పాఠకుడి హృదయాన్ని తడిమి కన్నీరు పెట్టిస్తుంది.

అటు చాసో కథలో కానీ, ఇటు శర్మ కథలో కానీ పేదరికం మనిషిని ఎంత బలహీనుడ్ని చేస్తుందో కథకులు బలంగా ప్రతిపాదించారు. అయితే కరుణాకరం తానో చిన్న ఉద్యోగస్తుడిగా బ్రతికేయగల అవకాశమున్నా, తెలివితేటలు గల కరుణాకరం బతుకు కేవలమొక చాలీచాలని గుమస్తా గిరితో ఆపేయాలనుకోడు. అతని అంతరంగం కనిపెట్టింది కనుకనే శారద కరుణాకరానికి నిజం

# గురుదేవోభవ

- ఆకుల రఘురామయ్య
సెల్ : 9581384016



జీవితం
ఓ విశ్వవిద్యాలయమైతే
కన్ను తెరచి
కన్ను మూసే వరకూ
ప్రతి మనిషీ విద్యార్థే....!
నాడు
అన్ని దానాలలో
విద్యా దానం గొప్ప
కానీ... నేటి విద్య
వ్యాపారంగా మారుతోంది
విద్య
వ్యాపారమైనపుడు
ర్యాంకులే ప్రామాణికమైనప్పుడు
భాషా విలువలు
మానవతా విలువలు
సంస్కృతి సంప్రదాయాల
పతనమే.
విద్య
విలువైన భూషణం
విద్య అంటే
తనను తాను సంస్కరించుకుని
సమాజానికి సంస్కారాన్ని
పంచిపెట్టగలగాలి
మాతృదేవోభవ
పితృదేవోభవ
గురు దేవోభవ
అమృత పలుకులే
తల్లి ప్రేమ
తండ్రి క్రమశిక్షణ
ఈ రెండూ కలిసిన
బాధ్యతా స్థానం
గురుదేవులదే

# కొత్త మొలకలు

- డా॥ మోపిదేవి విజయగోపాల్
సెల్ : 9490679570



కుళ్ళిపోలేదు
మాసిపోలేదు
ఈ సమాజం
వాలిపోలేదు!
లేదు
సోలిపోలేదు
లేదు
వాడిపోలేదు
లేదు
ఓడిపోలేదు
ఈ సమాజం
కమిలిపోలేదు!
నువ్వనుకున్నట్టు
పతనం కాలేదు
నువ్వంటున్నట్టు
పారిపోలేదు!
లేచి
నిలబడుతుంది
చూడు చూడు వాడ వాడలో
లేచి
తిరగబడుతోంది చూడు
వీధి వీధినా -
దొంగల్ని పట్టిస్తోంది
దొరలనీ ఆటపట్టిస్తోంది
ఏదో రోజు వస్తుంది
ద్రోహులందర్నీ చెట్టుకి కట్టేస్తుంది
ఈ సమాజానికి చావులేదు
ఒక్క పువ్వు రాలిపోతే
వంద పూలు వికసిస్తాయి
ఒక చెయ్యి జారిపోతే
శత సహస్ర భుజాలు మొలుచుకొస్తాయి!
ఈ సమాజం కాళిక
మహిషాసురులందర్నీ
మట్టి కరిపిస్తుంది!!

---

నిర్భయంగా చెప్పి మరీ తన సంపాదన్లోంచి తీసి డబ్బులు ఇచ్చి చదివిస్తుంది. అతన్ని చివరికి సర్ బిరుదుకి అర్హుడని చేస్తుంది. అక్కడ కరుణాకరం అయితే నేను రేపటి నుండీ లేడీ కరుణాకరాన్ని అన్నమాట అని సంబర పడుతున్న శారదని చూస్తూ "ఎస్ మై డార్లింగ్" అంటాడు. ఇక్కడ శంకరం మేడ మీంచి దిగి వచ్చి తన చేతికి ఐదువందల రూపాయలిచ్చిన వనజాక్షి మొహంలోకి చూడలేక "థాంక్స్ ఎ లాట్" అంటాడు. ఎంత దయనీయమైన హేయమైన పరిస్థితి ఇది అని మనం సానుభూతి చూపాలా లేక ఎందరు కనబడని శారదలూ, వనజాక్షులూ ఉన్నారోనని గుండెలు చెమర్చాలా మనకి. మారని మధ్యతరగతి మానవుని హేయమైన పరిస్థితికి ఇంకా వ్యవస్థను నిందించాలా?

ఒక ప్రాంతం, ఒక భాష అని పరిమితం కాకుంటే ఈ పేదరికపు కథలెన్ని ప్రాంతాల్లో లేవు కనుక. ప్రతిచోటా అవి సాహిత్యంలో చోటు చేసుకుంటూనే ఉన్నాయి. ఇరవయ్యవ శతాబ్దం మానవుని కేంద్రంగా మానవ వేదనా, చేతన, ఆనందం. అన్ని రకాలైన కోణాలలో ఆవిష్కరించింది అందులో మన తెలుగు కథకులు చాసో, జగన్నాథశర్మ మాత్రమే కాక ఇంకా ఎందరో ఉన్నారు. సందర్భం వచ్చింది కనుక వీరిరువురి గురించి మాత్రమే మాట్లాడుకుంటున్నాము. భమిడిపాటి రామగోపాలం కథ "మనోధర్మం"లో కూడా ఇటువంటి మానవ బలహీనతలు అవిష్కరింపబడ్డాయి. ఇక రావిశాస్త్రి కథల గూర్చి చెప్పనే అక్కర్లేదు. ఇటీవలే మరణించిన అస్సామీ రచయిత్రి ఇందిరా గోస్వామి తన "ఖాళీ శవపేటిక"లో ఇంతకన్నా దారుణమైన పేదరికాన్ని వాస్తవ జీవన చిత్రీకరణ చేసింది. చివరికి చలికి, ఆకలికి తట్టుకోలేని ఓ పేదతల్లి శ్మశానం నుండి శవాన్ని తీసేసి పడేసిన ఒక శవపేటికను తెచ్చుకుని వెచ్చగా పడుకోవడానికి ప్రయత్నించడం. ఆ కథ చదివితే గుండె కలచివేస్తుంది.వేరే భాషల కథలు చాలా విరివిగా ఆంగ్లంలోకి వెళ్ళడం వల్ల ఎక్కువగా అందరికీ తెలుస్తున్నాయి. అంతకంటే ఎక్కువ సాంద్రత గలిగిన కథలు. మన కథకులు ఎంత గొప్పగా రాసినా, సజీవంగా రాసినా ప్రపంచ పాఠకులకి అందడం లేదు. అందుకు జగన్నాథశర్మ కథగానీ, చాసో కథలు కానీ అన్ని భాషల్లోకి ముఖ్యంగా ఆంగ్లంలోకి (కొన్ని వెళ్ళే వుంటాయి) తప్పక వెళ్ళితీరాలి. మానవ సజీవ చిత్రణ మా కథకులూ చేస్తున్నారు అని ఆత్మగౌరవంతో తెలుగు వారు చెప్పుకునే లాంటి ఓరోజు రావాలి. పొరుగు కన్నడ రాష్ట్రం వరకు వచ్చిన ఎస్.ఎల్. భైరప్పకి వచ్చిన "సరస్వతీ సమ్మాన్' మన తెలుగు కథకుల్ని కూడా వరించాలి. అంతేకాక తెలుగువారు చాలా ఏళ్ళుగా పొందని జ్ఞానపీఠం మళ్ళీ మన తెలుగు సాహిత్య పుష్పాలతో అలంకరించాలి. చాసో, శర్మ, భరాగో, రఘోత్తమ రెడ్డి, సినారె, గురజాడ, సలీం, ఖాదిర్ బాబు, కుప్పిలి పద్మ ఇలా ఎందరెందరో మన తెలుగు రచయితలు అన్న భావన మనలో మిగిలున్నన్నాళ్ళూ మనం సాహిత్యానికి ఏమి చేయగలమో ఆ సేవ చేయాలని భావిస్తూ.. చాసో స్ఫూర్తి పురస్కారాన్ని పొంది మరింత బాధ్యతను ప్రపంచ కథకుడిగా తన భుజాలపైన మోయ సంసిద్ధుడైన జగన్నాథశర్మ గారిని మనసారా అభినందిస్తోంది సాహితీ జగతి. •

# కొత్త పుస్తకాలు



**తెలంగాణ కథకులు**
**కథన రీతులు** (రెండవ సంపుటి)
**- బి.ఎస్. రాములు**

వెల : రూ.90/- పేజీలు : 160

**ప్రతులకు : 9391036987**

బి.ఎస్. రాములుగారు సామాజిక తత్వవేత్తగా, ఉద్యమకారుడిగా ఎన్నో రచనలను సమాజానికి అందించారు. 'తెలంగాణ కథకులు, కథన రీతులు' అందులో ఒకటి. ఇది తెలంగాణ కథకులు, కథన రీతులు రెండవ సంపుటి. ఈ గ్రంథంలో పి. చంద్ అనే కలం పేరుతో రాస్తున్న పూరుగొండ యాదగిరి, దార్ల రామచంద్రం, నల్లాల లక్ష్మీరాజం, జాజుల గౌరి, గూడ అంజయ్య, కె. సీతారాములు, బి.ఎస్. రాములుగారల కథలు - కథన రీతులు గురించి పొందుపరిచాము.

**- సంపాదకులు**



**ఘోష** (కవితా సంపుటి)
**- డా॥ జెన్నె ఆనంద్‌కుమార్**

వెల : రూ.100/- పేజీలు : 176

**ప్రతులకు : 9966450897**

జీవితంలో నిరంతరం ఓడిపోతున్న అతి సామాన్యుల్ని అక్కున చేర్చుకొనే ఆర్ధ్రతతో అశ్రు పర్యంతమై అద్భుత కవిత్వం పునరుక్తి రమ్యంగా వివరించాడు కవి.

వేదకాలం నుంచి సాగుతున్న నిర్వేదం చారిత్రక సత్యంగా "నేస్తం"తో మాట్లాడిన కవిత్వం బలహీనులు భావితన్యం ఆశిస్తూ వుంది.

**- ప్రొ॥ కొలకలూరి ఇనాక్**



**ఓ నాన్న కథ** (నాటికలు)
**- విడదల సాంబశివరావు**

వెల : రూ.100/- పేజీలు : 124

**ప్రతులకు : 98664 00059**

ఈ నాటికల సంపుటిలో 'ఓ నాన్న కథ', 'మృగయా వినోదం', 'అవనీతలంపై అమృతకలశం', 'బాలచంద్రుడు భగ్గుమన్నాడు' అనే నాటికలున్నాయి. నాటికలన్నీ సందేశాత్మకాలు, సంచలనాత్మకాలు, ప్రయోగాత్మకాలు, ప్రయోజనాత్మకాలు, సమాజానికి ఆదర్శమైన మహోన్నత పాత్రలున్నాయి. ఆదర్శ ఉదాత్త స్త్రీ పాత్రలున్నాయి. ఇతివృత్తాలన్నీ వర్తమాన సామాజిక సమస్యలే.

**- డా॥ పి.వి. సుబ్బారావు**



**కరీంనగర్ జిల్లా కథలు**
**- బి.ఎస్. రాములు**
**వనమాల చంద్రశేఖర్**

వెల : రూ.90/- పేజీలు : 144

**ప్రతులకు : 9704708980**

కరీంనగర్ జిల్లా ప్రజల నిర్దిష్ట జీవిత రూపంలో సార్వజనీన మానవ సంబంధాలు భారతీయ పరిణామంలో, సంస్కృతి, ఆత్మీయ సంబంధాలు, సంఘర్షణ, విప్లవ పరిణామాలు, కుటుంబ సంబంధాలు, భార్యాభర్తల అనుబంధాలు, సంఘర్షణ, వ్యక్తి స్వార్థం పెరిగి తల్లిదండ్రులను వదిలించుకొని తాము మాత్రమే బతకాలనుకునే స్వభావం, ఎదుగుతున్న దళితులు అందుకుంటున్న అభివృద్ధి సామాజిక గౌరవాలు, పిల్లల స్వభావాలు, బంధుమిత్రుల ప్రాధాన్యత, ప్రజల సంస్కృతి మొదలైనవి ఈ కథా సంపుటిలో చిత్రించబడ్డాయి.

**- బి.ఎస్. రాములు**



**హృదయకాంక్ష** (కవితలు)
**- కోపూరి పుష్పాదేవి**

వెల : రూ.50/- పేజీలు : 104

**ప్రతులకు : 0866-2517025**

మానవతా వికాసానికి వ్యవస్థలోని మార్పు అలా వుండగా, వ్యక్తిగా ఔన్నత్యాన్ని సాధించే మార్గంలో మనిషి నడవాలని కూడా సమాజంలో మేల్కొన్నవారు ప్రబోధిస్తున్నారు. అలాటి వారిలో కోపూరి పుష్పాదేవి ఒకరు. ఆమె రాసిన 'హృదయకాంక్ష'లోని కవితలన్నీ మనిషి మనస్సు పునర్నిర్మాణం కావాలని కోరుకునేవే.

**- అద్దేపల్లి రామమోహనరావు**



**చిత్రగంధి** (కవిత్వం)
**- సుధామ**

వెల : రూ.100/- పేజీలు : 151

**ప్రతులకు : 9849297958**

నేను వివిధ సాహిత్య ప్రక్రియలలో కృషి చేస్తూ కార్టూనిస్టుగా, రచయితగా, సమీక్షకునిగా, విమర్శకునిగా, కాలమిస్టుగా, పజిల్స్ నిర్మాతగా, వక్తగా కూడా గుర్తించబడినా మౌలికంగా కవిని. కవిత్వమే నా స్ఫూర్తి, దీప్తి. ఈ 'చిత్రగంధి' నా ముద్రిత గ్రంథాలలో నాల్గవది. కవితా సంపుటిగా రెండవది.

**- సుధామ**

## కవినై... కవితనై...

- చలపాక ప్రకాష్

వెల : రూ.60/- పేజీలు : 152

ప్రతులకు : 9247475975




కవిగా... కవిగాంచిన కథకుడిగా... నిత్య జీవన శోధన నవలాకారుడిగా... నవ్వుల వానలు కురిపించే హాస్య లాలసుడిగా... ప్రేమైక ప్రేమికుడిగా... గీతలతో అధిక్షేప గీతాకారుడిగా... క్రమంగా అన్ని రంగాలూ అలవోకగా ఆక్రమిస్తూ అశ్వమేధం చేస్తున్న సాహితీ రౌతు ప్రకాశ్ చలపాక. ఇప్పుడు మరోసారి కవిగా సాక్షాత్తూ తానే కవితనై వస్తున్నాడు. మనసు కవాటాలు తెరిచి ఆహ్వానిద్దాము. ఈ కవన వర్షంలో తడవడానికి సంసిద్ధమవుదాం.

- నగ్నముని

## నేను తిరిగిన దారులు

- వాడ్రేవు చినవీరభద్రుడు

వెల : రూ.100/- పేజీలు : 208




తెలుగులో యాత్రా చరిత్రలు కొత్త కాదు. ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్రా చరిత్ర నుండి ఆదినారాయణ భ్రమణకాంక్ష దాకా రాహుల్ సాంకృత్యాయన్ లోకసంచారి నుంచి బి.వి. రమణ ట్రెక్కింగ్ అనుభవాల దాకా తెలుగు సాహిత్య ప్రపంచాన్ని సుసంపన్నం చేసిన యాత్రా చరిత్రలెన్నో వున్నాయి. ఆ కోవలోనే వాడ్రేవు చినవీరభద్రుడు రాస్తూ వచ్చిన యాత్రా రచనల సంకలనం ఇది.

- ప్రచురణకర్తలు

## సురపురం

మెడోస్ టైలర్ ఆత్మకథ

అనువాదం - జి. కృష్ణ

వెల : రూ.100/- పేజీలు : 161

ప్రతులకు : 0877-2232888




టైలర్ తన జీవిత కథను 'The story of my life' అను పేర ప్రకటించినాడు. ఇదే 'సురపురం' మెడోస్ టైలర్ ఆత్మకథ. టైలరు జీవితంలోని ఉద్యోగ దశ భారతదేశ చరిత్రతో పెనవేసుకొన్నది. సురపుర సంస్థాన విశేషములు, బేడర్లు, అరబ్బులు, రోహిల్లాలు, రాజకుమారులు, నిజాం చరిత్ర, జాగీర్దారుల వృత్తాంతము, విద్రోహచర్యలు, 1857 నాటి విప్లవము ఇవీ అవీ అననేల పంథొమ్మిదవ శతాబ్ది రాజకీయ సాంఘిక చరిత్రకు ఈయన ఆత్మకథ రమణీయమైన దర్పణం.

- ప్రచురణకర్తలు

## నల్లగొండ కథలు

- ఎలికట్టె శంకర్‌రావు

వెల : రూ.300/- పేజీలు : 528

ప్రతులకు : 9346359268




ఈ సంకలనంలోని కథల గురించి విశ్లేషణలు సమీక్షలు అవసరం లేదు. ఈనాటి పాఠకుడు ప్రబుద్ధ పాఠకుడు. తన చర్యల బాగోగులను కూలంకషంగా కాకున్నా ఉపరితల విషయాలనైనా అర్థం చేసుకోగలడు. ఇదిగో, ఇందులో ఈ నిగూఢార్థం నిక్షిప్తమై ఉంది అని చెప్పాలని ప్రయత్నించడం ఒక రకమైన అహంకారమే.

- డాక్టర్ నోముల సత్యనారాయణ

## భావజాల పరిణామం

- బి.ఎస్. రాములు

వెల : రూ.90/- పేజీలు : 160

ప్రతులకు : 9391036987




దరకమే ఐక్యవేదిక సమస్త వర్ణ వర్గ కుల మత లింగ జాతి ప్రాంత భాష దేశ విచక్షణలకు అసమానతలకు వ్యతిరేకంగా సామాజిక న్యాయం కోసం, సామాజిక మార్పు కోసం వర్తమానంలో సమస్త సమాన అవకాశాల కోసం నిలబడింది, నిలదీసింది, ఉద్యమించింది. తానే ఒక చరిత్రగా చరిత్రలో చెరగని ముద్రవేసింది. దీని ప్రారంభ పరిణామాలను, చారిత్రక డాక్యుమెంట్లను ఈ మొదటి సంపుటిలో చేర్చడం జరిగింది. ఇది సమాజంలో 1977 నుండి 1995 దాకా సాగిన సామాజిక సైద్ధాంతిక సంఘర్షణను, భావజాల పరిణామాన్ని పరిచయం చేస్తుంది.

- బి.ఎస్. రాములు

## వ్యాసజ్వాల

- జ్వాలాముఖి

వెల : రూ.150/- పేజీలు : 302

ప్రతులకు : 9177881201




జ్వాలాముఖి ఒక మహావక్తగా తన వాగ్ధాటితో చమత్కారంగా - ఆవేశంగా శ్రోతలను ఆకట్టుకునేవాడు. తన సుదీర్ఘమైన ఉపన్యాసాలతో విషయాన్ని విడమర్చి సోదాహరణంగా చెప్పే నేర్పుతో జనరంజకత్వాన్ని సాధించాడు. ఇదే ధోరణి ఈ వ్యాసాలలో కూడా కనబడుతుంది. తన ఆలోచనా సరళి ప్రతి రచనలో సమగ్రంగా వ్యక్తం కావాలనే తపన ఉండేది. పునరావృతమైనా, కొన్ని పడికట్టు పదాలు తరచుగా దొర్లినా వాటిని ఆయన లక్ష్యపెట్టలేదు.

- నిఖిలేశ్వర్

# తెలుగు కథకు నూతనోత్సాహం



తెలుగు కథ పుట్టి వంద సంవత్సరాలైన తరువాత కూడా అది మరింత నూతనోత్సాహంతో ముందుకు సాగుతోందని సీనియర్ రచయిత నిఖిలేశ్వర్ అన్నారు. రచయితలు మానవీయ విలువలను కాపాడేలా కథలు రాయాలన్నారు. 'ప్రజాశక్తి' ఆదివారం అనుబంధం 'స్నేహ' నిర్వహించిన సంక్రాంతి కథల పోటీ విజేతలకు ఫిబ్రవరి 21న ప్రజాశక్తి కార్యాలయంలో బహుమతి ప్రదానం జరిగింది. ఆయన మాట్లాడుతూ రచయిత పాఠకులను తనతో పాటు కథలోకి తీసుకెళ్లాలన్నారు. ప్రాంతీయ అస్తిత్వాలు ముందుకు వస్తున్న తరుణంలో కథకులు ప్రాంతాల వారీగా విడిపోతున్నారని పేర్కొన్నారు. రచయితలు ఈ మధ్యకాలంలో తమ పేర్లకు చివర కులం తోకలను తగిలించుకుంటున్నారని విమర్శించారు. ప్రజాశక్తి వంటి పత్రికలు కథల పోటీలు నిర్వహించి రచయితలను ప్రోత్సహిస్తున్నాయని కొనియాడారు. నిఖిలేశ్వర్, రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, గంటేడ గౌరునాయుడు కథల పోటీకి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

ఈ సందర్భంగా అంతర్జాతీయ భాషా దినోత్సవం సందర్భంగా 'మాతృభాష-శాస్త్రీయ దృక్పథం' అంశంపై సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి ప్రసంగించారు. ఆయన మాట్లాడుతూ పాలనా వ్యవహారాలన్నీ మాతృభాషలోనే ఉండాలని, భాషా సంస్కృతులను కాపాడుకోవాలని అన్నారు. పదో తరగతి వరకు తెలుగు మాధ్యమంలోనే విద్యాబోధన సాగాలన్నారు. తెలుగుకు విశిష్ట భాషగా గుర్తింపు వచ్చినప్పటికీ నామమాత్రపు భాషగానే మారిందని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రజల భాషలో పాలన సాగితేనే సమాజాభివృద్ధి సాధ్యమవుతుందన్నారు. ప్రజాశక్తి దినపత్రిక సంపాదకులు వినయ్‌కుమార్ మాట్లాడుతూ సమకాలీన అంశాలపై కథలు రావల్సిన అవసరం ఉందన్నారు. ఈ మధ్య కాలంలో కథలు తగ్గిపోయాయన్నారు. కథల పోటీకి మొత్తం 104 కథలు వచ్చాయన్నారు. ప్రస్తుత తరుణంలో సాహిత్యానికి లభించాల్సినంత తోడ్పాటు లభించడం లేదన్నారు. ఈ కార్యక్రమంలో ప్రజాశక్తి సిబ్బంది, రచయితలు, సాహిత్యాభిమానులు పాల్గొన్నారు.

**ప్రజాశక్తి కథల పోటి ఫలితాలు**

ప్రథమ బహుమతి పొందిన కథ: రోమ్ నీరో ఫిడేల్. రచయిత: సింహ ప్రసాద్, ద్వితీయ బహుమతి: నిర్ణయం. రచయిత్రి: పుష్పలీల, తృతీయ బహుమతి: నీ సామ్రాజ్యంలో నీవే రాజువి. రచయిత: డా. యం. సుగుణారావు.

సాధారణ ప్రచురణకు ఎంపిక చేసిన కథలు: 1. ఓ పెంపకం కథ-హనీఫ్ 2. సోమరి వసంతం- బత్తిని తిమ్మగురుడు 3. చినుకులా రాలి...-అరిపిరాల సత్యప్రసాద్ 4. ఆదర్శ గ్రామం- తుల్లి రాజగోపాల్ 5. మార్పు- జొన్నలగడ్డ ఫణీంద్ర మోహన్ 6. మట్టి మనిషి- కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ 7. బడి- మేరెడ్డి యాదగిరి రెడ్డి 8. మజిలీ- అలపర్తి రామకృష్ణ 9. వేయి రేకుల వేకువ- కాండ్రేగుల శ్రీనివాసరావు 10. నీలమ్మ- భమిడిపాటి గౌరీశంకర్ 11. పల్లె ప్రపంచీకరణ- నేలంటి మధు 12. మానవీయత- తిరుమలశ్రీ (పి.వి.వి. సత్యనారాయణ) 13. డాలర్+భూమి=మున్నామి- ఎస్. మునిసుందరం 14. కొత్తగాలి- యెన్నం ఉపేందర్ 15. ఇట్లు నీ అంజలి- రాయిని రోజా 16. ఆనవాళ్లు- భువనేశ్వరరావు 17. వారికి కొంచెం నమ్మకమివ్వండి- రాచపూటి రమేష్ 18. బలి పశువులు- పెద్దిపాగ పున్నారావు 19. కలనేత- మంత్రవాది మహేశ్వర్ 20. అన్నదాత- టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి 21. అభివృద్ధి పథం- కోపూరి పుష్పాదేవి 22. మారిన ముఖచిత్రం- అచ్చుల 23. చిన్న ఆశ- తాడికొండ కె. శివకుమార శర్మ.

# ప్రజా ఉద్యమాలతో ఆరెట్టి మమేకం




జన చేతన కళల ద్వారా ఉద్యమాలకు ఊపిరిపోసి, ప్రజా ఉద్యమాలతో మమేకమైన ఆరెట్టి నారాయణ బహుముఖ ప్రజ్ఞాశాలి అని సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి కొనియాడారు. ఆరెట్టి కళలకు, ఉద్యమాలకు కేంద్ర బిందువైన నాయకుడని, నిత్యం సమీకరణలు, పోరాటాలతోనే జీవితం గడిపారని అన్నారు. ఫిబ్రవరి 2[illegible] [illegible]జామాబాద్ జిల్లా కేంద్రంలోని రాజీవ్‌గాంధీ ఆడిటోరియంలో సాహితీస్రవంతి, ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో ఆరెట్టి సంస్మరణ సభ జరిగింది. ఈ సభలో ఆరెట్టి నారాయణకు అంకితమిచ్చిన, 'తొలకరి చినుకు' కవితా సంపుటిని తెలకపల్లి రవి ఆవిష్కరించారు. ఈ కవితా సంపుటి రచయిత్రి మల్లవరపు విజయ సభకు అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ మాట్లాడుతూ సామాజిక స్ఫూర్తి నిండుగా కలిగిన వ్యక్తి ఆరెట్టి అని అన్నారు. ప్రజలకు వాస్తవాలను తెలియజేయడంలో, చైతన్య పరచడంలో కళా, సాహిత్యాల ప్రాధాన్యతను ఆరెట్టి గుర్తించి ఆ దిశగా కృషి చేశారన్నారు. ఆరెట్టికి సన్నిహిత మిత్రుడు, ప్రజానాట్యమండలి జిల్లా కార్యదర్శి సిర్పలింగం తను రాసిన గేయాన్ని పాడి విన్పించారు. సీనియర్ రచయితలు డా. కేశవరెడ్డి, సి.హెచ్. మధులతో పాటు షాహిద్ మియా, సాయన్న తదితరులు సభలో ప్రసంగించారు. ఆరెట్టి నారాయణ కుటుంబ సభ్యులు, మిత్రులు, రచయితలు, ప్రజాసంఘాల నాయకులు, సాహిత్యాభిమానులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రజానాట్యమండలి గాయకులు ఆలపించిన గేయాలు సభికులను అలరించాయి.

## బాలల సంక్రాంతి కవితల పోటీ

విజయనగరం జిల్లా బొండపల్లి మండలం దేవుపల్లి జిల్లా పరిషత్ హైస్కూల్‌లో 2011 డిసెంబర్ 30 న విద్యార్థినీ విద్యార్థులకు సంక్రాంతి కవితల పోటీ నిర్వహించింది. ఈ సభకు అధ్యక్షులుగా ఇన్‌ఛార్జి హెడ్‌మాస్టరు జె. శ్రీనివాస రామారావు పాల్గొన్నారు. ముఖ్య అతిథిగా సాహితీ స్రవంతి అధ్యక్షులు చీకటి దివాకర్ మరియు ఆత్మీయ అతిథులుగా శంకర్రావు, రచయిత జి.ఎస్. చలం, వాగ్గేయకారుడు బొంతల కోటి శంకర్రావు, చీకటి చంద్రిక, చెళ్ళపిళ్ళ శ్యామల పాల్గొన్నారు.

అధ్యక్షులు మాట్లాడుతూ విద్యార్థుల్లో సృజనాత్మకత వెలికితీసి వారి సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడే వీలుగా ఈనాటి ఈ పోటీని స్కూలు ఉపాధ్యాయుడు పాయల మురళీకృష్ణ ఆధ్వర్యంలో నిర్వహిస్తున్నామన్నారు. న్యాయనిర్ణేతగా ఎస్.వి. శాస్త్రి తెలుగు పండితులు వ్యవహరిస్తున్నారన్నారు. చీకటి చంద్రిక ఒక పాటతో అలరించారు. జి.ఎస్. చలం మాట్లాడుతూ మా రోజుల్లో (విద్యార్థి దశ) సాహిత్యం పట్ల అవగాహన కల్గించే వారు లేక సాహిత్యం తెలిసిన వాళ్ళను అన్వేషించి అంటిపెట్టుకు తిరిగే వాళ్ళమని, ఇప్పుడు ఇది మంచి సదవకాశమని, నిర్వహిస్తున్న ఉపాధ్యాయులను అభినందిస్తున్నట్లు తెలిపారు. చెళ్ళపిళ్ళ శ్యామల మాట్లాడుతూ ఈ పాఠశాల విద్యార్థులు అదృష్టవంతులని, ఇలా ప్రోత్సహించే ఉపాధ్యాయులు అరుదుగా ఉంటారని తెలిపారు. అలాగే మంచి కవితను చదివి వినిపించారు.

చీకటి దివాకర్ మాట్లాడుతూ గురజాడ, శ్రీశ్రీ, డార్విన్‌లు ఏయే విధంగా సంఘాన్ని ఉద్ధరించేందుకు తమ కృషి చేశారో, ఒకరిని ఒకరికి సంధానపరుస్తూ విద్యార్థులకు సవివరంగా తెలియజేశారు. ఆ తర్వాత విద్యార్థులు తమ స్వీయ కవితల్ని వినిపించారు. దివాకర్ వారినందరినీ బహుమతులనందజేసి ప్రోత్సాహమందజేశారు. జనగణమణతో కార్యక్రమం ముగిసింది.

## పిల్లలు రాసిన కవితల సమీక్ష

మొదటి బహుమతి వచ్చిన ఆర్. దుర్గారావు (9వ తరగతి) రాసిన కవిత 'సంక్రాంతి కాంతి'లో "నేను ప్రేమగా పెంచుకున్న పచ్చని చెట్టు / భోగి మంటకు భగ్గుమంది, నేను మనసారా పెంచుకున్న నా చిట్టి మేక / కనుమ రోజు కనుమరుగయింది" అంటూ పండుగ పేరుతో తను కోల్పోతున్న ఆత్మీయతను ప్రకటిస్తూ "ఎక్కడెక్కడో ఉన్న చుట్టాలు పిట్టల గుంపులా వచ్చారు" అంటూ వలసను గుర్తుచేశాడు.

రెండవ బహుమతి పొందిన కె. రఘురామ్ ((8వ తరగతి) రాసిన కవిత 'సంక్రాంతి వస్తుంది'లో "దేవుడింటికి బట్టలు పట్టుకెళ్ళే / ఆచారం కనుమరుగయ్యింది" అంటూ పండుగలో మారిపోతున్న సంస్కృతిని నిరసిస్తాడు.

మూడవ బహుమతి పొందిన గొర్లె దివ్య (9వ తరగతి) రాసిన కవిత 'సంక్రాంతి' కవితలో పండగ ముందుండే ఆనందం కంటే పండగ తరువాత మరలా వాళ్ళ కుటుంబం వలస పోయే విషాదమే ఎక్కువగా స్పందింపచేస్తుందన్న విషయం తెలియజేసింది.

"మా అమ్మ చేతి ముద్ద తినగానే / మా పంట ఇంటికి వచ్చిందని జ్ఞప్తికి వచ్చింది" అన్న వాక్యాలు చాలా బాగున్నాయి.

'మరో కవిత' మా సారపు ఝాన్సీ' రాసిన కవితలో "కొట్టు గది నిండెను కొత్త పంటలతో / వంట గది నిండెను పిండివంటలతో" లయబద్ధంగా స్ఫురిస్తూ గేయ ఛాయల్ని చూపించింది.

మరో కవిత 'జి. సతీష్' రాసిన కవితలో (ఇదేనమ్మా సంక్రాంతి) "భగభగమండే భోగిమంటల్లో / భోగి పిడకలు ఉదయించే సూర్యుళ్ళలా ఉన్నాయి'' కవితీకరణ చేయడంలో భేష్ అనిపించుకున్నాడు.

సుమారు 30 మందికి పైగా రాసిన కవితల్లో రాసింది పిల్లలేనా అనిపించే విధంగా వున్నాయి. నేటి కవులంతా ఎదురుచూస్తున్న కొత్త తరం ఇదిగో రానుంది. కాసింత పక్కకు జరిగి సీనియర్ కవులు వీళ్ళను తమతో ఆహ్వానిస్తారని ఆశిస్తూ....

**- పాయల మురళీకృష్ణ**




'మూడు యాభైల మన గురజాడ' సాహిత్య సభలో మాట్లాడుతున్న విజయనగరం జిల్లా సాహితీస్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్. చిత్రంలో కవి పాయల మురళీకృష్ణ, ప్రధానోపాధ్యాయులు, సభలో పాల్గొన్న అతిథులు, మెంటాడ హైస్కూల్ విద్యార్థినులు

# మెరుగు

రిపబ్లిక్ డే సందర్భంగా జనవరి 26న విజయనగరం గురజాడ వారి స్వగృహంలో సాహితీ స్రవంతి "మెరుగు" కార్యక్రమాన్ని నిర్వహించింది. ఎస్.వి.ఆర్. కృష్ణారావు తొలి పలుకులతో ప్రారంభమైన ఈ సభలో కన్వీనర్ చీకటి దివాకర్ మాట్లాడుతూ కవి ప్రజల పక్షాన ఉండాలని, బలహీనులు, అణచివేతకు, అన్యాయానికి గురైనవారి తరపున మాట్లాడాలన్నారు. ప్రజల పక్షాన నిలబడబట్టే నేటికీ వేమన, గురజాడ, చాసో వంటి వారు స్మరణీయులుగా వున్నారన్నారు.

సాహితీ విమర్శకులు దుప్పల రవికుమార్ మాట్లాడుతూ 60, 70 సంవత్సరాల క్రిందట అయ్యేరిచర్డ్స్ ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో ఇదే విధంగా మెరుగు కార్యక్రమాన్ని నిర్వహించారని, ఉత్తరాంధ్రలో ఇటువంటి కార్యక్రమం జరగడం ఇక్కడే చూస్తున్నానని, గురజాడ ఇంట్లో అనైతిక కార్యక్రమాలు జరగకుండా నిలువరించడానికి, సాహితీ స్రవంతి 'మెరుగు'ని నిర్వహించడం, కవుల, రచయితల మేధస్సుని పదును పెట్టడం గొప్ప విషయంగా అభివర్ణించారు. కవులు ఉద్దేశించి మాట్లాడుతూ కవికి భావంతో పాటు భాష ప్రధానమని, కవులకు గొప్ప కవుల కవిత్వం కొంతమేర వినిపించి, వారిని మరికొంత పూరించమనడం, అదే విషయంపై వేరొక కవిత రాయమనడం, పేరెన్నికగన్న కవుల కవిత్వాలను చదివి విశ్లేషించడం చేయాలన్నారు. కవికి రాజకీయ అవగాహన, సాహితీ సంఘాల పరిచయం ఉండాలని తెలిపారు. సాహితీవేత్తలు రాసిన వ్యాసాలుచదవడం ద్వారా సరియైన రాజకీయ అవగాహన పెంపొందించుకోవచ్చని అభిప్రాయపడ్డారు. విజయనగరం, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలకు ఏ సాహితీ పత్రిక లేదని, ఉంటే బాగుండేదని ఆశని వ్యక్తం చేశారు. కవి రాసిన కవిత్వం నేరుగా బాధితులకు చేరకపోయినా, వారి నుద్ధరించే వారికి చేరితే ప్రయోజనం చేకూరినట్లేన్నారు. కవి బహుముఖుడుగా ఉంటూ అంటే పాఠకుడిగా, విమర్శకుడిగా ఉంటూ పాఠకులను తానే తయారు చేసుకోవాలన్నారు. ఉదయం ఒక పత్రికకు, సాయంత్రం ఒక పత్రికకు కాకుండా తాము ఏ పక్షాన ఉన్నాము, ఎవరి కొరకు రాస్తున్నాము అన్నది కవి నిర్ణయించుకోవలసిన అవసరం ఉందన్నారు.




**జనవరి 26న విజయనగరం గురజాడ వారి స్వగృహంలో సాహితీ స్రవంతి "మెరుగు" కార్యక్రమంలో మాట్లాడుతున్న చీకటి దివాకర్**

రవి కుమార్‌తో పాటు పలువురు కవులు, పాఠకులు చర్చలో పాల్గొన్నారు. పి. లక్ష్మణరావు మాట్లాడుతూ గడాఫీ, సద్దాం వంటివారు ఎంతమందిని చంపి, వారు చంపబడ్డాక హీరోలయ్యారని, మరి దీనిని కవి ఏ కోణంలో వారిని సమాజానికి చూపించాలని అడిగారు. ప్రజల భాషంటే ఏది అని ప్రశ్నించారు. ఇ. జానకి కవి తన కవిత్వం ద్వారా సమాజాన్ని అద్దంలో చూపినట్లు చూపాలన్నారు. కవికి చారిత్రక నేపథ్యం కూడా ఉండాలని, గతం తెలియాలని మానాపురం అభిప్రాయపడ్డారు. రెడ్డి శంకర్రావు కవి నిజం పక్షాన ఉండాలనీ, సత్యాన్ని ప్రజలకు తెలియచెప్పాలని, నిరంతర పఠనం కవికి అవసరమన్నారు. ఒక పాఠకుడు స్పందిస్తూ కవికి రాజకీయాలతో నేరుగా సంబంధం లేకపోయినా వాస్తవిక దృష్టి అవసరమని అన్నారు. కవులు సైనికుల వంటివారని, ఆ సైనికులు దేశాన్ని కాపాడితే, ఈ కవి సైనికులు మేధను కాపాడతారని, కవి నైతిక విలువలను కలిగి వుండాలని మరొక పాఠకుడు అభిప్రాయపడ్డారు. కవులు బాధితుల పక్షాన ఉండాలని, అప్పుడే కవి ఆశయం నెరవేరుతుందని జయంతి విజయలక్ష్మి అభిప్రాయపడ్డారు. చెళ్ళపిళ్ళ శ్యామల భావానికి, భాషకు తేడాను వివరిస్తూ భావానికి ప్రాధాన్యతనివ్వాలని, అవసరమైన భాషని సందర్భానుసారం ప్రవేశపెట్టాలని తెలిపారు. సభలో చంద్రిక, ప్రమీల పాటలు పాడగా, రాజా చంద్రశేఖర్, మొయిద శ్రీనివాస్, బాలసుధాకర్ మౌళి, పి.ఎస్.ఎస్. శ్రీనివాస్ మొదలగువారు తమ కవితలను వినిపించారు.

**- చెళ్ళపిళ్ళ శ్యామల**

## చందాదారులకు ఓ విన్నపం

* ప్రస్థానం చందాదారుని చిరునామా పైన చందా యొక్క కాలపరిమితి సూచిస్తూ నెల - సంవత్సరం ఇస్తున్నాం. అది గమనించి వెంటనే మీ చందాను పునరుద్ధరించుకోగలరు (రెన్యువల్స్).
* కంప్యూటర్‌లోని రికార్డులో చందా ముగియదంతోనే ఆ చందాదారుని పేరు ఆటోమేటిక్‌గా డిలీట్ అవుతుంది. చందా కాలం ముగిసిందని ముందుగానే వారి చిరునామాకు కార్డు రాస్తున్నాం.
* ఆన్‌లైన్‌లో చందాను రెన్యువల్ చేసుకోవచ్చు. ఖాతా పేరు: ప్రస్థానం, ఖాతా నెం. 52001500585. బ్యాంక్: ఎస్‌బిహెచ్. ఆన్‌లైన్‌లో 5, 10 సంవత్సరాల చందాలు మాత్రమే అంగీకరించబడతాయి.
* సాహితీస్రవంతి కార్యకర్తలు, అభిమానులు చందాలను ఆన్‌లైన్‌లో జమచేసేటప్పుడు కనీసం 5 చందాలను ఒకసారి జమచేయగలరు. ఒకసారి ఆన్‌లైన్‌లో జమచేసినందుకు రూ. 25/-లు కట్ అవుతుంది.
* 5 సం॥ చందా డిస్కౌంట్‌లో రూ. 500/- కట్టడం వల్ల మీకు అన్ని సంచికలు క్రమంగా అందుతాయి. గ్యాప్‌లు రావు. రూ. 100/- ఆదా కూడా అవుతుంది. (5 × 120 = 600).
* ఎం.ఓ. పంపేవారు కూపన్‌కు ఒకవైపున మీ పూర్తి చిరునామా, ఫోన్ నెం. రాయండి. అడ్రస్ మారితే వెంటనే కార్డు రాయండి. ఇ-మెయిల్ కూడా పంపవచ్చు. ssprasthanam@gmail.com




నల్గొండలో ఫిబ్రవరి 4, 5 తేదీలలో జరిగిన అరసం మహాసభలలో ప్రసంగిస్తున్న అరసం గౌరవాధ్యక్షులు ఎస్వీ సత్యనారాయణ. సౌహార్ద సందేశమిస్తున్న ఇన్‌సెట్‌లో సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి



అనంతపురంలోని జనవిజ్ఞాన వేదిక కార్యాలయంలో ఫిబ్రవరి 11న సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జరిగిన 'శిల్పశాల' కార్యక్రమం. చిత్రంలో కవి మల్లెల నరసింహమూర్తి, పి. కుమారస్వామి, తగరం కృష్ణయ్య, డా. అంకె రామలింగయ్య, ఆకుల రఘురామయ్య, డా. జెన్నె ఆనందకుమార్, మధురశ్రీ, జూటూరి షరీఫ్, రియాజుద్దీన్ తదితరులు

# చాసో 18వ పురస్కార సభ

చాసో స్ఫూర్తి సాహిత్య ట్రస్టు ఆధ్వర్యంలో విజయనగరంలో ఎం.ఆర్. లేడీస్ రిక్రియేషన్ క్లబ్‌లో చాసో 97వ పుట్టిన రోజు జనవరి 17న జరిగింది. ఈ సభకు డా॥ కె.వి. రమణాచారి అధ్యక్షత వహించారు. వాస్తవిక జీవితాన్ని చూసే వారికన్నా వినగలిగేవారు మాత్రమే గొప్ప కథలు రాస్తారని, అటువంటి గొప్ప కథలు రాసిన రచయితే చాసో అని కొనియాడారు. 18 సం॥లుగా పురస్కారాన్ని అందజేస్తున్న చాసో స్ఫూర్తి వారిని అభినందించారు. చాసో గృహాన్ని పరిరక్షించుకోవాలని, అది చారిత్రకమైన, సాంస్కృతికమైన పవిత్ర స్థలమని, చాసో శతజయంతి నాటికి ఈ గృహాన్ని సుందరంగా తీర్చిదిద్దవలసిందని రాష్ట్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసి, తన వంతు కృషి చేస్తానని అన్నారు. ఆయన పెంగ్విన్ బుక్స్ ఇండియా ప్రచురించిన, వెల్చేరు నారాయణరావు, డేవిడ్ షుల్మన్ ఇంగ్లీషులోకి అనువాదం చేసిన "డాల్స్ వెడ్డింగ్ అండ్ అదర్ స్టోరీస్" అనే చాసో కథల పుస్తకాన్ని ఆవిష్కరించారు. అనువాద పుస్తకాన్ని సుమనస్పతి సభకు పరిచయం చేశారు. చాసో రచించిన బొమ్మల పెళ్ళి కథను చాగంటి కృష్ణకుమారి చదివి వినిపించారు. చాసో కథా




సాహిత్యాన్ని విశ్లేషించి, ఆ రచనలలో ఉన్న విశిష్టతలను సహేతుకంగా కాకరాల వింగడించారు. 18వ పురస్కారాన్ని అందుకున్న ఎ.ఎన్. జగన్నాథశర్మ కథారచన ప్రాశస్త్యాన్ని పంతులు జోగారావు వివరించారు. జగన్నాథశర్మకు చాసో పురస్కారం, 10వేల నగదు, జ్ఞాపికను అందజేశారు. జగన్నాథశర్మ తన స్పందనలో చాసో దగ్గర తాను కథారచన మెలకువలను తెలుసుకున్నానన్నారు. పురస్కారం అందుకున్నందుకు ఆనందాన్ని వెలిబుచ్చారు. సాహితీమూర్తులు, చాసో అభిమానుల మధ్య జయప్రదంగా సభ ముగిసింది.



జనవరి 27న కళా సుబ్బారావు కళావేదిక, హైదరాబాద్‌లో జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ నిర్వహించిన కార్యక్రమంలో డా॥ పి.ఎస్. మూర్తి రచించిన 'సహస్ర కౌముది' కవితా సంపుటి ఆవిష్కరిస్తున్న డా॥ కె.వి. కృష్ణకుమారి, వి.వి. రాఘవరెడ్డి, కేతవరపు రాజ్యశ్రీ, శ్రీమతి మూర్తి, జీడిగుంట రామచంద్రమూర్తి, తంగిరాల చక్రవర్తి, ఫౌండేషన్ ఛైర్మన్ గుదిబండి వెంకటరెడ్డి



జనవరి 12వ న లేఖిని సంస్థ ఆధ్వర్యంలో హైదరాబాద్‌లో త్యాగరాయ గానసభ వేదికపై రచయిత్రులు గంటి భానుమతి, డా॥ మంథా భానుమతి రచించిన ఆఖరి ప్రయాణం, రామాయణం, మామయ్య నవలలను ఆవిష్కరిస్తున్న ఎ.ఎస్. జగన్నాథ శర్మ. చిత్రంలో పొత్తూరి విజయలక్ష్మి, మంథా భానుమతి, విహారి, జగన్నాథశర్మ, పోరంకి దక్షిణామూర్తి, ఓలేటి పార్వతీశం, గంటి భానుమతి, కళా వేంకట దీక్షితులు

# 'రైతు నానీలు' పుస్తక ఆవిష్కరణ

మేరెడ్డి యాదగిరిరెడ్డి 'రైతు నానీలు' పుస్తక ఆవిష్కరణ జనవరి 31వ తేదీ జిల్లా పరిషత్ సమావేశ మందిరం నల్లగొండలో నల్లగొండ జిల్లా రచయితల సంఘం వారు నిర్వహించారు. జిల్లా కలెక్టర్ ఎన్. ముక్తేశ్వరరావు ముఖ్య అతిథిగా హాజరై 'రైతు నానీలు' పుస్తక ఆవిష్కరణ చేశారు. సభాధ్యక్షులుగా డా॥ నోముల సత్యనారాయణ వ్యవహరించారు. కవి, విమర్శకులు వేణు సంకోజు పుస్తక పరిచయం చేశారు. నేటి రైతు జీవితం ఎంత దుర్భరంగా వుందో ఈ నానీలు తెలియజేస్తున్నాయని వక్తలు అభిప్రాయపడ్డారు. ఇంకా ఈ సమావేశంలో విద్యావేత్త కొండకింది చిన వెంకటరెడ్డి, ఐ.బి.సి. ఛానల్, ఎం.డి. ఏచూరి శైలజ, జి.ప. సి.ఇ.ఓ. కోటిరెడ్డి, కవి, పున్న అంజయ్య, వొరుగంటి పురుషోత్తం పాల్గొన్నారు.



జనవరి 31వ తేదీ నల్లగొండలో 'రైతు నానీలు' పుస్తకావిష్కరణ జి.ప. సమావేశ మందిరంలో వరుసగా కొండకింది చినవెంకటరెడ్డి, డాక్టర్ నోముల సత్యనారాయణ, రచయిత మేరెడ్డి యాదగిరిరెడ్డి, ఆవిష్కర్త, కలెక్టర్ ఎస్. ముక్తేశ్వరరావు, కవి వేణు సంకోజు, సి.ఇ.ఓ. కోటిరెడ్డి





అరసం ఆధ్వర్యంలో గుంటూరులో జరిగిన సభలో ఆర్వియార్ రచించిన 'భారత స్వాతంత్ర్య సమర చరిత్ర' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న గుంటూరు పార్లమెంట్ సభ్యులు రాయపాటి సాంబశివరావు. వేదికపై రచయిత, అరసం అధ్యక్షులు పెనుగొండ లక్ష్మీనారాయణ తదితరులు



జనవరి 29న గోపాలపట్నం శాఖా గ్రంథాలయంలో సృజన... విశాఖ తృతీయ వార్షికోత్సవ సభలో ప్రముఖ కథా రచయిత కె.బి. కృష్ణ మినీ కథా సంపుటి 'అభిషేకం' ఆవిష్కరణ సందర్భంగా (ఎడమ నుండి) సమీక్షకులు బొల్లోజు దుర్గాప్రసాద్, కార్యదర్శి గుండాన జోగారావు, కృతి కర్త కె.బి. కృష్ణ, ముఖ్య అతిథి బి. ప్రభాకరరెడ్డి, అధ్యక్షులు టి. సాయిప్రకాష్, విశిష్ట అతిథి డా॥ తలతోటి పృధ్వీరాజ్, అతిథి ఇందూ రమణ





జనవరి 17న శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం, హైదరాబాద్‌లో రసమయి సంస్థ ఆధ్వర్యంలో జరిగిన సభలో డా॥ తిరుమల శ్రీనివాసాచార్య రచించిన "శ్రీకృష్ణదేవరాయ సంస్తుతి" పద్యకావ్యాన్ని ఆవిష్కరిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి, చిత్రంలో కృతి స్వీకర్త డా॥ ఎం.ఎల్. నరసింహారావు, డా॥ ఎస్.వి. రామారావు, కృతికర్త డా॥ తిరుమల శ్రీనివాసాచార్య, డా॥ ఎం.కె. రాము



కేంద్ర సాహిత్య అకాడమీ, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ మరియు రామ్‌కీ ఫౌండేషన్ వారి సంయుక్త నిర్వహణలో ఒంగోలులో జరిగిన ప్రపంచ తెలుగు మహోత్సవ సభలో ప్రముఖ కవి వడలి రాధాకృష్ణ రచన "శిశిర చిత్రాలు" కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న పాలపిట్ట మాసపత్రిక సంపాదకులు గుడిపాటి వెంకటేశ్వర్లు. చిత్రంలో సిలికానాంధ్ర అధ్యక్షులు కూచిభొట్ల ఆనంద్, తానా ఛైర్మన్ డాక్టర్ జంపాల చౌదరి, అరసం అధ్యక్షులు పెనుగొండ లక్ష్మీనారాయణ, డాక్టర్ పాపినేని శివశంకర్

# విశాఖలో వానమామలై శతజయంతి

అభినవ పోతన వానమామలై వరదాచార్యులు శతజయంతి ఉత్సవాలు ఫిబ్రవరి 5న విశాఖపట్నం ఆంధ్ర విశ్వవిద్యాలయం హిందీ విభాగం సెమినార్ హాలులో ఘనంగా జరిగాయి. లోక్‌నాయక్ ఫౌండేషన్, అభినవ పోతన శతజయంతి ఉత్సవ సమితి ఆధ్వర్యంలో జరిగిన ఈ సభకు అధ్యక్షత వహించిన ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ అధ్యక్షులు, పూర్వ రాజ్యసభ సభ్యులు డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ప్రసంగిస్తూ తెలంగాణాలోని మారుమూల గ్రామంలో జన్మించిన వరదాచార్యులు 'పోతన చరిత్రము' అనే మహాకావ్యాన్ని రచించిన మహోన్నత వ్యక్తి అని అన్నారు. ఈ సందర్భంగా యువభారతి సంస్థ ప్రచురించిన వరదాచార్యులుగారి 'భోగినీలాస్యం' గ్రంథాన్ని ఆయన ఆవిష్కరించారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న దేవాదాయ శాఖ పూర్వ ముఖ్య కార్యదర్శి డా॥ కె.వి. రమణాచార్యులు మాట్లాడుతూ వరదాచార్యులు నివసించిన ప్రాంతంలో ఇప్పటికీ ఆయన పేరు



ఉచ్చరించబడటం ప్రజలలో ఆయనకు గల ఆదరాభిమానాలకు నిదర్శనమని అన్నారు. ప్రముఖ సాహితీవేత్తలు డా॥ తిరుమల శ్రీనివాసాచార్య, డా॥ అద్దేపల్లి రామమోహనరావు, వరదాచార్యులు సాహిత్య వ్యక్తిత్వాలను వివరించారు. తుల ప్రభాకరరావు, వైద్య వినాయకరావు, ఎ. నాగేశ్వరరావు అభినవ పోతన శతజయంతి ఉత్సవాలను గురించి వివరించగా తాళ్ళపల్లి మురళీధరగౌడ్ సభను సమన్వయం చేశారు. ఈ సందర్భంగా ప్రముఖ సాహితీవేత్తలు కాళీపట్నం రామారావు, డా॥ చందు సుబ్బారావు, బులుసు వెంకటేశ్వర్లు, ఓలేటి బంగారేశ్వరరావు, కొప్పిశెట్టి సూర్యనారాయణ, మెరుగుపల్లి వెంకటేశ్వరరావులను సత్కరించారు.

– మహతి




జనవరి 18న గుంటూరు బృందావన్ గార్డెన్స్ శ్రీ వేంకటేశ్వర దేవాలయం, పద్మావతి కల్యాణ వేదిక మీద జరుగుతున్న హరికథా పితామహులు ఆదిభట్ల నారాయణదాసు 67వ వర్ధంతి సభలో సభాధ్యక్షులు డా॥ వి. నాగరాజ్యలక్ష్మి, మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



ఫిబ్రవరి 10న శ్రీ త్యాగరాయ గానసభ హైదరాబాద్‌లో గోల్డెన్ స్టార్ యూత్ కల్చరల్ ఆర్గనైజేషన్ వారు నిర్వహించిన సభలో పద్మభూషణ్ డా॥ సి. నారాయణరెడ్డి ద్వారా ప్రతిభా సత్కార్ పురస్కారము స్వీకరిస్తున్న గజవెల్లి. చిత్రంలో చీఫ్ కో–ఆర్డినేటర్ డా॥ చింతపట్ల వెంకటాచారి, కళాదీక్షితులు, చిమ్మపూడి శ్రీరామ్మూర్తి, బింగి నరేంద్రగౌడ్ తదితరులు



హైదరాబాద్ నగర కేంద్ర గ్రంథాలయంలో జనవరి 29న సుపాణి రెక్కల కవితా సంపుటి "వెలుగురేకలు"ను ప్రముఖ కవి, విమర్శకులు అద్దేపల్లి రామమోహనరావు ఆవిష్కరించారు. ఫోటోలో వరుసగా సర్వశ్రీ మసన చెన్నప్ప, సలీం, సుగంబాబు, కవి సుపాణి, తిరునగరి, యస్వీ రామారావు, ఆత్రేయ శర్మ




జనవరి 21న హన్మకొండలో నందన గార్డెన్స్‌లో జరిగిన గన్నంరాజు గిరిజా మనోహర్‌బాబు షష్టిపూర్తి సభ. చిత్రంలో గొల్లపూడి మారుతీరావు, నేరెళ్ళ వేణుమాధవ్, అంపశయ్య నవీన్, సుప్రసన్నాచార్య, ప్రొ॥ లక్ష్మణమూర్తి, సి. రాంబాబు, డా॥ కె.ఎన్.వి. ప్రసాద్

# స్త్రీలపై హింస పెరిగింది

స్త్రీలపై హింస జరగని చోటు ఈ ప్రపంచంలో జానడైనా లేదని, స్త్రీలు అన్ని విధాలుగా హింసకు గురవుతున్నారని సీనియర్ రచయిత్రి ఓల్గా అన్నారు. 'ప్రపంచీకరణ - మహిళలు, సమస్యలు - సవాళ్ళు' అనే అంశంపై ఖమ్మం బుక్‌ఫెయిర్‌లో ఫిబ్రవరి 3న నిర్వహించిన సెమినార్‌లో ఆమె మాట్లాడారు. ప్రపంచీకరణ నేపథ్యంలో మహిళలపై హింస మరింత పెరిగిందన్నారు. సినిమాలు, టీవీల్లో, రోడ్డు పక్కన ఏర్పాటు చేసే హోర్డింగుల్లో స్త్రీలను అవమానకరంగా చూపిస్తున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. స్త్రీలపై జరిగే దాడులకు వారే బాధ్యులని అందరూ అంటున్నారని, ఇది అర్థం లేని, అవగాహన లేని వ్యాఖ్యలన్నారు. స్త్రీ ధరించే దుస్తులను బట్టి వారిపై అత్యాచారాలు జరుగుతున్నాయని వ్యాఖ్యానిస్తున్న వారు గ్రామాల్లో, ఏజెన్సీలో స్త్రీలపై జరిగే అకృత్యాలపై ఏం సమాధానమిస్తారని ఆమె ప్రశ్నించారు. గ్రామీణ, పేద, గిరిజన మహిళలకే కాదు ఆర్థికంగా అభివృద్ధి చెందిన కుటుంబాల్లో కూడా స్త్రీలపై హింస జరుగుతోందన్నారు. స్త్రీల సమస్యలపై ఎందరో రచనలు చేశారని, వాటిని చదివి ధైర్యం తెచ్చుకుంటున్నారని, ఇలాంటి సాహిత్యాన్ని స్త్రీలు చదవాలని అన్నారు. అనంతరం సిపిఎం రాష్ట్ర నాయకురాలు ఎస్. పుణ్యవతి 'మహిళా చైతన్యంపై మాట్లాడుకుందాం', కందుకూరి వీరేశలింగం 'మూఢనమ్మకాలపై నా పోరాటం' అనే పుస్తకాలను ఆవిష్కరించి తొలి కాపీని కానూరి హిమబిందుకి అందించారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఆనందాచారి, బుక్‌ఫెయిర్ అధ్యక్షులు సాదినేని శ్రీనివాసరావు పాల్గొన్నారు.




ఖమ్మం బుక్‌ఫెయిర్‌లో ఫిబ్రవరి 3న జరిగిన పుస్తకావిష్కరణ సభలో సాదినేని శ్రీనివాస్, కె. ఆనందాచారి, ఓల్గా, పుణ్యవతి, హిమబిందు



జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ ఆధ్వర్యంలో ఫిబ్రవరి 2న త్యాగరాయ గానసభలో కేతవరపు రాజ్యశ్రీ రాసిన "బొమ్మా - బొరుసు" (వ్యంజకాలు) గ్రంథావిష్కరణ చేస్తున్న వోలేటి పార్వతీశం. చిత్రంలో పొత్తూరి జయలక్ష్మి, సుబ్బారావు, కళాదీక్షితులు, రంగనాథ్ (సినీ నటులు), సుధామ, మసన చెన్నప్ప, రాజ్యశ్రీ, డా॥ తిరునగరి, తంగిరాల చక్రవర్తి, కె. మాధవరావు



ఫిబ్రవరి 11న విజయవాడలో ఐలాపురం హోటల్‌లో జరిగిన సాహిత్య వారధి పుస్తకావిష్కరణ సభ. చిత్రంలో డా॥ గుమ్మా సాంబశివరావు, డా॥ వెన్నా వల్లభరావు, మండలి బుద్ధప్రసాద్, హైకోర్టు న్యాయమూర్తి, జి. రఘురామ్, డా॥ కె.వి. రమణాచారి, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్



శ్రీకాకుళంలో ఫిబ్రవరి 11, 12 తేదీల్లో జరిగిన కథా నిలయం 15వ వార్షికోత్సవం సందర్భంగా మాట్లాడుతున్న శ్రీ అట్టాడ అప్పల్నాయుడు (రచయిత). ఇంకా ఈ సభలో డా॥ కాళీపట్నం రామారావు (అధ్యక్షులు), డా॥ బి.వి.ఎ. రామారావు నాయుడు (కార్యదర్శి), డా॥ బి.వి.ఎన్. స్వామి (ముఖ్య అతిథి), కుప్పిలి పద్మ( ప్రత్యేక అతిథి)



ప్రముఖ కవయిత్రి ఎన్. అరుణ రచించిన 'సూది నా జీవన సూత్రం' కవితా సంపుటికి రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కారాన్ని సిరిసిల్లాలో రంగినేని సుజాతా మోహనరావు ఎడ్యుకేషనల్ అండ్ ఛారిటబుల్ ట్రస్టు అధ్యక్షుడు మోహనరావు ప్రదానం చేస్తున్న దృశ్యం. చిత్రంలో డా॥ గుమ్మన్నగారి బాలశ్రీనివాసమూర్తి, డా॥ ఎస్. రఘు, ముఖ్య అతిథి ఫణికుమార్, ఐ.ఎ.ఎస్., తదితరులు

## తెలుగు భాషను కాపాడుకోవాలి

ఫిబ్రవరి 2న చెన్నైలో ఓల్డ్ వాషర్‌మెన్ పేటసర్ త్యాగరాయ కళాశాలలో తెలుగు విభాగం ఆధ్వర్యంలో సాహిత్య సమావేశం జరిగింది. ఆస్కా పూర్వ అధ్యక్షులు కెన్సిస్ గ్రూపు ఛైర్మన్ కె. నరసారెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. ఆయన మాట్లాడుతూ తెలుగు వారి పిల్లల కోసం సర్ త్యాగరాయ శెట్టి నార్త్ చెన్నైలో ఈ కళాశాల నెలకొల్పడం తెలుగువారంతా గర్వపడాల్సిన విషయమన్నారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంగా ఉన్నప్పుడు తెలుగు భాష ఈ రాష్ట్రంలో ఉన్నతస్థితిలో ఉండేదని అన్నారు. ప్రస్తుతం తెలుగువారు తమ పిల్లలను తెలుగులో చదివించాలని, తెలుగు మాధ్యమంలో చదివితే ఉద్యోగాలు రావనే భయం వద్దని అన్నారు. ఈ సభకు అధ్యక్షత వహించిన కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ డి. సుబ్రహ్మణ్యరాజు మాట్లాడుతూ 1955 వరకూ ఈ కళాశాలలో తెలుగు భాష మహోన్నత స్థితిలో ఉండేదన్నారు. జనని ప్రధాన కార్యదర్శి గుడిమెట్ల చెన్నయ్య మాట్లాడుతూ తెలుగు భాషను కాపాడుకొనే గురుతర బాధ్యత నేటి యువ విద్యార్థులపై ఉందని అన్నారు. నగరంలో తెలుగు భాషకు ఉన్నత పీఠం వేసిన వారిలో సర్ త్యాగరాయ శ్రేష్ఠి ముఖ్యులని అన్నారు. డిజి వైష్ణవ కళాశాల తెలుగు విభాగం పూర్వాధ్యక్షులు డాక్టర్ కాసల నాగభూషణం మాట్లాడుతూ విద్యార్థులు తెలుగు పద్యాలపై ఆసక్తిని పెంచుకోవాలన్నారు. ఈ సభలో తెలుగు విభాగాధిపతి డాక్టర్ ఎన్. ఈశ్వరయ్య, కళాశాల కార్యదర్శి పి. సుబ్రహ్మణ్యం, విద్యార్థి సంఘం ఛైర్మన్ కె. వెంకటదాస్, ఆస్కా సంయుక్త కార్యదర్శి కృష్ణ, బాల గురప్పరెడ్డి తదితరులు ప్రసంగించారు. వ్యాస రచన పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు అందజేశారు.

## కవితల పోటీ

విజయనగరం జిల్లాకు చెందిన యువస్పందన సంస్థ ఆధ్వర్యంలో 'ఉత్తరాంధ్ర ఉగాది కవితల పోటీ' నిర్వహిస్తున్నట్లు ఆ సంస్థ కన్వీనర్ బి. విజయేశ్వరరావు ఒక ప్రకటనలో తెలిపారు. కవితలను మార్చి 10లోపు బి. విజయేశ్వరరావు, తెలుగు లెక్చరర్, ఇం.నెం. 167, ఎం.ఐ.జి.-2, ఫేజ్-3, ఉడా కాలనీ, కంటోన్మెంట్ పోస్టు, విజయనగరం చిరునామాకు పంపించాలి. పోటీకి పంపిన కవులందరూ తమ కవితలతో తప్పనిసరిగా ఉగాది రోజు జరిగే సభకు హాజరు కావాలని కోరారు. ఆ రోజే ఫలితాలు వెల్లడించడం జరుగుతుందని తెలిపారు. ఎంపిక చేయబడిన కవితలతో సంకలనం కూడా ప్రచురించడం జరుగుతుందని తెలిపారు. ఇతర వివరాలకు 8985079163, 9440593910 ద్వారా సంప్రదించవచ్చు.

## సంకలనం కోసం కవితలు ఆహ్వానం

చీరాలకు చెందిన 'సహజ సాహిత' సంస్థ ఆధ్వర్యంలో కవితా సంకలనం ప్రచురిస్తున్నట్లు ఆ సంస్థ వ్యవస్థాపక అధ్యక్షులు వడలి రాధాకృష్ణ ఒక ప్రకటనలో తెలిపారు. కవులు తమ కవితలను మార్చి 31 లోపు వడలి రాధాకృష్ణ, వ్యవస్థాపక అధ్యక్షులు, సహజ సాహితి, సాహిత్య సాంస్కృతిక సంస్థ, కేరాఫ్ ఐటిసి లిమిటెడ్, ఎబిడి-ఐఎల్‌టిడి, చీరాల- 523157, ప్రకాశం జిల్లా చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9985336444 ద్వారా సంప్రదించవచ్చును.


**FORM IV**

(Rule 8)

**UNDER PRESS AND REGISTRATION OF BOOKS ACT, 1867**
**STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS ABOUT MONTHLY -SHAITYA PRASTHANAM**

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : Hyderabad |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name | : V. Krishnaiah |
| | 1 (a) Whether a citizen of India | : YES |
| | (b) If a foreigner, the country of origin | : - |
| | Address | : H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 4. | Publisher's Name | : V. Krishnaiah |
| | 1 (a) Whether a citizen of India | : YES |
| | (b) If a foreigner, the country of origin | : - |
| | Address | : H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 5. | Editor's Name | : TELAKAPALLI RAVI |
| | Nationality | : INDIAN |
| | 1(a) Whether a citizen of India | : YES |
| | (b) If a foreigner, the country of origin | : - |
| | Address | : H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |
| 6. | Name and addresses of owner | : V. Krishnaiah |
| | 1(a) Whether a citizen of India | : YES |
| | (b) If a foreigner, the country of origin | : - |
| | Address | : H.No. 1-1-298/4, Street No. 1, Ashoknagar, Hyderabad - 500 020 |

**I, V. KRISHNAIAH, here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.**

**Sd/**

**V. KRISHNAIAH**

**Publisher**

**Date: 28.02.2010**




Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల: రూ. 40/-




వెల: రూ. 200/-




వెల: రూ. 25/-




వెల: రూ. 30/-




వెల: రూ. 40/-




వెల: రూ. 40/-




వెల: రూ. 35/-




వెల: రూ. 20/-




వెల: రూ. 150/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-




వెల: రూ. 100/-




వెల: రూ. 20/-




వెల: రూ. 150/-




వెల: రూ.200/-




వెల: రూ. 35/-




వెల: రూ. 40/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-




వెల: రూ. 150/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A135 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |